

## సచిత్ర విచిత్రం

### ఖరీదైన 'బ్రా'

ఈవిడగారు ధరించిన బ్రా బంగారు తీగలతో అల్లినది. ఖరీదు కేవలం ఓ లక్షన్నర రూపాయలు మాత్రం. న్యూయార్క్ మన్‌హాటన్‌లోని 'టీఫానీస్'లో కొనుక్కోవచ్చు. అయితే అంగరక్షకుల్ని మాత్రం బ్రాతో పాటు అమ్మరు.

# చతుర కథలు

## తేడా

కోర్టుమార్షల్ జరుగుతోంది. స్క్వాడ్రన్ లీడర్ రావ్ ఆ త్రీ మెంబర్ మిలిటరీ కోర్టుముందు ముద్దాయిలా నిలుచున్నాడు.

అది యుద్ధ సమయం. అంతర్గత దేశ సమస్యలనుంచి ప్రజల దృష్టిని మళ్లించేందు కని ఆనవాయితీ ప్రకారం పొరుగు దేశం




మనపై దాడిచేసిన కారణంగా అప్రకటిత యుద్ధం జరుగుతోంది. ఆ సందర్భంలో ఓచోట కాల్బలాలకు ఆకాశమార్గాన సపోర్టు నిస్తున్న ఓ జట్టుకు నాయకుడు స్క్వాడ్రన్ లీడర్ రావ్.

ఓ అర్ధరాత్రివేళ శత్రువు ఓ కీలక గ్రామంలో ప్రవేశించాడని గ్రౌండ్‌నుంచి ఎస్.బి.ఎస్. రావడంతో పెద్ద డైలమాలో పడిపోయాడు. ఆకాశంనుండి బాంబింగ్ చేసినట్లయితే శత్రునాశనం ఖాయం. కాని, సివిలియన్స్‌కి కూడా ప్రాణనష్టం జరిగే ప్రమాదముంది. అలాగని ఊరుకుంటే దేశానికే ప్రమాదం వాటిల్లేటట్టుంది.

దేశ శ్రేయస్సుముందు కొద్దిపాటి జననష్టం అంతగా ఆలోచించదగ్గది కాదు... అనుకున్న రావ్, ఫైటర్ ప్లేన్స్‌ని పంపించి ఆ గ్రామాన్ని బాంబ్ చేయించడం జరిగింది. అందువల్ల ఆస్ట్రాటజిక్ పాయింట్‌నుంచి శత్రు నిర్మూలన జరిగింది. కాని, భయపడినదానికన్నా సివిలియన్ నష్టం అధికంగానే వాటిల్లింది.

అందుకు బాధ్యులైనవారిపైన కఠినచర్య తీసుకోవాలనీ, ప్రధానమంత్రి రాజీనామా చేయాలనీ గొడవ చేశాయి ప్రతిపక్షాలు. అందుకే ఆనవాయితీ ప్రకారం బాంబింగ్‌కి ఉత్తర్వు జారీచేసిన స్క్వాడ్రన్ లీడర్ రావ్‌ని సస్పెండు చేసింది ప్రభుత్వం. ఆ తరువాత కోర్టు మార్షల్ ఆరంభమయింది.

ఆ ఎంక్వయిరీలో ఆనాటి విపత్కర, అత్యవసర పరిస్థితినీ, మిలిటరీ స్ట్రాటజీ దృష్ట్యా, దేశ శ్రేయస్సు కోరి తాను తీసుకున్న నిర్ణయాన్ని వివరించాడు రావ్. ఓపికగా, శాంతంగా అతని సంజాయిషీని విన్న మిలి

టరీ కోర్టు తమ నిర్ణయాన్ని తెలిపేందుకు సమావేశాన్ని వారంరోజులు వాయిదావే సింది.

వారం తరువాత మళ్లీ సమావేశమ యింది కోర్టు. వారిముందు దోషిలా రావు. ఆరోజు ఇవ్వబడే తీర్పుపైన రావ్ భవిష్యత్తు ఆధారపడివుంది.

'మిష్టర్ రావ్! మేము మా జడ్జిమెంటుని ఇచ్చేముందు చివరగా నువ్వు చెప్పుకోవల సిందేమైనా ఉందా?" అనడిగాడు జనరల్.

"ఎస్ సర్!" అన్నాడు రావ్. "మీరేమీ అనుకోనంటే, ఓ విషయం తెలుసుకోవాలను కుంటున్నాను''

"ఏమిటది?"

"నా సంజాయిషీని ఆలకించిన ఆనర బుల్ కోర్టు వెంటనే తన నిర్ణయాన్ని తెలుప కుండా వారం రోజులు ఎడ్జర్న్ చేయడానికి కారణమేమిటి?"

రావు ప్రశ్నకు వింతగా చూశారు వాళ్లు. "బాంబింగ్ ఆర్డర్స్ ఇవ్వడంలో నీ జడ్జ్ మెంటు రైటా, రాంగా అన్న విషయాన్ని తేల్చడానికి అప్పటి ఫ్యాక్టర్స్‌ని జాగ్రత్తగా పరిశీలించవలసి వుంది. కేస్‌ని బాగా స్టడీచే సినమీదట, జననష్టం జరక్కుండా శత్రువుల ను తరిమికొట్టడానికి నీవు మరో మార్గాన్నేదై నా అవలంబించి ఉండవలసింది అనే నిర్ణ యానికి వచ్చాం మేము'' అన్నాడు జనరల్ హుందాగా.

"దేర్ యు ఆర్ సర్!" అన్నాడు రావ్ అదోలా నవ్వుతూ.

"ఈ నిర్ణయానికి రావడానికి మీకు వారం రోజులు అవసరమయిందన్నమాట!"

"వాట్‌డూయూ మీన్?"

"ఐమీన్... ఆ సమయంలో నిర్ణయం తీసుకోవడానికి నాకున్నది ఒక్క సెకనే సర్! రైటో, రాంగో - స్పాట్ డెసిషన్ తీసుకోవలసి వుంది నేను'' అన్నాడు రావ్.

"సో... వాట్?"

"సింపుల్ సర్! ఆనాటి పరిస్థితులూ, నా సంజాయిషీ సవివరంగా తెలుసుకున్నాక ఆ క్షణంలో ఏరియల్ బాంబింగ్ అవసరమా, కాదా అన్న విషయాన్ని నిర్ణయించడానికి ఈ ఆనరబుల్ కోర్టుకి వారం రోజుల వ్యవధి ఉంది. కాని, నాకంత అదృష్టం లేదు, సర్! సెకన్లలో, కేవలం సెకన్లలో - స్పాట్ డెసిషన్ తీసుకోవలసి వచ్చింది నేను'' అన్నాడు రావ్ తొణకకుండా.

అతని పలుకులలోని యథార్థాన్ని అర్థంచే సుకున్న కోర్టుసభ్యులు తేలుకుట్టిన దొంగల్లా ఒకరినొకరు చూసుకున్నారు. తరువాత జన రల్ నవ్వి, "ఎస్, మై బాయ్! వుయ్ గెట్ యువర్ పాయింట్, అందుకే నీ నిర్ణయంతో మేము పూర్తిగా ఏకీభవించలేకపోతున్నా, అది నిర్లక్ష్యం కారణంగా తీసుకున్నది కా దనీ, దేశరక్షణకు అవసరమని గాఢంగా నమ్మి తీసుకున్న నిర్ణయమనీ విశ్వసించి, నిన్ను కేవలం వార్నింగ్‌తో వదిలేయాలను కున్నాము'' అన్నాడు.

"థాంక్యూ సర్!" అంటూ ఆనందంగా సాల్యూట్ చేశాడు స్క్వాడ్రన్ లీడర్ రావ్.

-విశ్వమోహిని

## అదీ సంగతి!

రామారావు, సీత ప్రేమించి పెళ్లిచేసుకున్నా రు.

పెళ్లికిముందరే సీత ఉద్యోగం చేస్తోంది. పెళ్ళయ్యాక రామారావు సీతని ఉద్యోగం మానిపించలేదు. ఇవాళ ఇద్దరమేగానీ రేపు ముగ్గురవుతాం! ఇద్దరి ఆదాయమూ వుండటం మంచిది అనుకున్నారు.

ఒక్కగానొక్క కొడుకు రామారావుకి తండ్రి ఇచ్చిన ఇల్లు వుంది. పెళ్ళయ్యాక ఫ్రిజ్, గీజర్, వాషింగ్‌మెషిన్, టి.వి. అన్నీ

## సచిత్ర విచిత్రం



# కదిలే ఇల్లు

అమెరికాకు చెందిన 49 ఏళ్ల బుచ్ ఫెల్లిబామ్ ట్రక్ డ్రయివర్. ఏడాదిలో 340 రోజులు రోడ్లమీదే వుంటాడు. ఈమధ్య తన కుటుంబ సభ్యులతోసహా శాశ్వతంగా ట్రక్‌లోనే కాపురముంటూ సంపాదించుకుంటున్నాడు. ట్రక్ వెనకాల ట్రెయిలర్ వుంది. దాంట్లోనే బాత్‌రూమ్,



కిచెన్, టి.వి. సెట్, స్టీరియో, డైనింగ్ టేబిల్‌లాంటి అన్ని సౌకర్యాలూ వున్నాయి. పన్నెండేళ్ల అతని కూతురు షీలా కరస్పాండెన్స్ కోర్స్‌ద్వారా విద్యనభ్యసిస్తోంది. 44 ఏళ్ల అతని భార్య బ్రెండాకి ఆ కొత్త ఇల్లే నచ్చింది. అమెరికా మొత్తాన్ని ఇంట్లోంచే తిలకించే ఆ కుటుంబ సభ్యులకు ఇరుగుపొరుగుల బాధ లేదు.



ఒకదాని తర్వాత ఒకటి కొనుక్కున్నారు. ఏ.సి. అక్కరలేదనుకున్నారు. ఉన్న స్కూటరే చాలనుకున్నారు. అలా అన్ని ఆధునిక సదుపాయాలతో సుఖంగా జీవిస్తున్న వారికి ఇంట్లో ఏదోలేదనీ, అదే పెద్ద లోటనీ అనిపించింది.

ఒక్క పాప లేక ఒక్కబాబు వుంటే ఎంత బావుంటుందీ అనుకున్నారు.

ఒకరోజున "సీతా మనకి పెళ్ళయి ఎన్నేళ్లు అయింది?" అడిగాడు రామారావు.

"మూడు'' చెప్పింది సీత.



"మరి మనకి పిల్లలు లేరుగదా'' అన్నాడు రామారావు.

"లేరుగదా'' అంది సీత.

"ఎందుకో?" అనుకున్నారు ఇద్దరూ.

"సరే... మనం స్పెషలిస్టు దగ్గరకు వెళ్లి చెక్అప్ చేయించుకోవడం, ఆ తర్వాత స్పెషలిస్టు చెప్పినట్లు నడచుకోవడం మంచిది'' అన్నాడు రామారావు.

"సరే... మీ మాట కాదన్నానా. పైగా ఇది ఇద్దరి సమస్యాగదా'' అంది సీత.

ఆ తర్వాత అపాయింట్మెంట్ తీసుకుని వారంరోజుల తర్వాత ఇద్దరూ స్పెషలిస్టు దగ్గరకు వెళ్లారు.

స్పెషలిస్టు చెప్పిన అన్ని టెస్ట్‌లు చేయించుకున్నారు. అయితే ఇద్దరిలోనూ ఏ లోపమూ లేదని తెలిసింది.

"మీ ఇద్దరిలోనూ ఏ లోపమూ లేదు. మరి, పిల్లలు పుట్టకపోవడానికి కారణమేమయివుంటుంది'' అని ఆలోచనలో పడిపోయాడు స్పెషలిస్టు.

కాసేపు ఆలోచించిన స్పెషలిస్టు, "మీ ఇంట్లో టి.వి. వుందా'' అని అడిగాడు.

"ఉంది... కలర్ టి.వి." చెప్పాడు రామారావు.

"టి.వి. ప్రోగ్రామ్‌లు చూస్తారా'' అడిగాడు స్పెషలిస్టు.

"ఆఫీసునుంచి ఇంటికి వచ్చిన వెంటనే టి.వి. ముందరే పడిపోతాము. సెలవురోజుల్లోనైతే ఇరవయినాలుగు గంటలూ టి.వి. ముందే వుంటాము. దూరదర్శన్ ఛానల్స్‌తో పాటు అన్ని ప్రైవేట్ ఛానెల్స్ కనెక్షన్లు వున్నాయి మాకు'' సగర్వంగా చెప్పింది సీత.

అది విన్న స్పెషలిస్టు, "నేననుకున్నదే అయింది. మీరు ఏకాంతంలో ఒకరినొకరు అతుక్కుపోవాలిగానీ, ఇరవయినాలుగు గంటలూ టి.వి.కి అతుక్కుపోతే పిల్లలు ఎలా పుట్టారు?" అన్నాడు నవ్వుతూ.

సిగ్గుపడిపోయిన సీతారాములుని, "గివ్ రెస్ట్ టు టి.వి. బెస్ట్ ఆఫ్ లక్' అని పంపించాడు స్పెషలిస్ట్.

-తాజీప్రసాద్

సంతానం సౌభాగ్యం !

మాతృత్వం మహాభాగ్యం !!

# సంతాన సాఫల్య చికిత్సలో నవోదయం !
# డా॥ రమా సంతాన సాఫల్య కేంద్రంలో ఉషోదయం !!
## IVF-ET (టెస్ట్ ట్యూబ్ బేబి ), GIFT-ZIFT పద్ధతులు
## ఇప్పుడు ఇక్కడే లభ్యం !!!



విజ్ఞాన శాస్త్రము ఊహించరానంత వేగంతో ముందుకు పోతుంది. అసాధ్య విషయాలనేకం అందుబాటులోకి వస్తున్నాయి. అందులో భాగమే - ఎన్ని సాంప్రదాయ శాస్త్రీయ వైద్య పద్ధతుల ద్వారా ప్రయత్నించినా పిల్లలు పుట్టని దంపతులకోసం అందుబాటులోకి వచ్చిన కొత్త పద్ధతి - టెస్ట్ ట్యూబ్ బేబి పద్ధతి. ఈ విధానంలో కాబోయే తల్లిని హార్మోన్ ట్రీట్‌మెంట్ ద్వారా ఒకటికి బదులు 5 నుండి 15 అండాలు విడుదల చేసేటట్లు చేసి వాటిని జాగ్రత్తగా సేకరించి, శుద్ధిచేసిన భర్త వీర్య కణాలతో కలిపి, పిండోత్పత్తి జరిపి లాబులోనే ఆ పిండాన్ని 24 నుండి 96 గంటల పాటు పెంచి, తల్లి గర్భంలో ప్రవేశపెడ్తారు.

ఈ చికిత్సా విధానానికి అవసరమైన అన్ని పరికరాలను - ఇంగ్లండు, జర్మనీ, జపాను, ఆస్ట్రేలియా, అమెరికా, ఫిన్లెండు, సింగపూర్ నుండి, దిగుమతి చేసుకొని, కావలసిన పరికరాల్లో కాని, మందుల్లో కాని, పద్ధతుల్లో కాని ఎక్కడా రాజీ పడకుండా సంతాన ప్రాప్తికై కృషి చేస్తున్నారు ఇక్కడ.

ఈ పద్ధతుల్లో, అత్యాధునిక పరికరాల వాడకంలో, గత మూడేళ్ళ నుండి, దేశ, విదేశాల్లో శిక్షణ పొందిన డాక్టర్లు, ఈ కార్యక్రమం నిర్వహిస్తున్నారు. ఇప్పటిదాకా ఈ పద్ధతి కోసం విదేశాలకో, బొంబాయికో వెళ్ళి అరాకొరా ప్రయత్నాలు చేస్తూ వచ్చారు అనేకమంది.

**అన్ని విధాల ప్రయత్నం చేసి, ఆశ వదిలేసిన దంపతులకిది చివరి అవకాశం. తగిన ఆదాయ వనరులు ఉండి, సంతాన కాంక్ష ఉన్న దంపతులు వెంటనే సంప్రదించండి. ఫోను ద్వారా అపాయింట్‌మెంట్ తీసుకోండి. IVF డెస్క్ కావాలని అడగండి. కన్సల్టేషనుకి ఫీజు లేదు.**

కృషితో నాస్తి దుర్భిక్షం ! ప్రయత్నే ఫలీ !!.

DR. RAMA'S CENTER FOR FERTILITY HYDERABAD

**డా॥ రమాసంతాన సాఫల్య కేంద్రం**
గోల్డ్‌స్పాట్ కంపెనీ ఎదురుగా, అమీర్ పేట్ బస్ స్టాప్,
అమీర్‌పేట్, హైదరాబాద్, 500 016
ఫోన్లు : 311255, 312294.

సంపుటి: 19
సంచిక: 5
జూన్: 1996

# చతుర



అందమైన ఇంద్రభవనాల్ని, పట్టుతివాచీల ఘన వైభవాల్ని ఊహించుకుంటూగానీ, కోటి కోర్కె లతోగానీ ఆ అమ్మాయి అత్తవారింట అడుగుపెట్ట లేదు.

భర్త కనుసన్నలలోనే మెలగాలనీ, అతని ప్రేమ సామ్రాజ్యానికి తను పట్టమహిషి కావాలనీ కలలు కూడా కనలేదు.

మామూలు మధ్యతరగతి కుటుంబంలో పుట్టి, తల్లితండ్రులు ఎంచి నిర్ణయించిన వరుడిచేత మూడు ముళ్లూ వేయించుకుంది. చాలామంది జీవితాల్లాగే తన జీవితమూ సాఫీగా, ప్రశాంతంగా సాగిపోతుందని నమ్మింది. మరి ఆ నిశ్చింతతో అత్తవారింట అడుగుపెట్టిన ఆ అమ్మాయికి అశని పాతంలా ఎదురైన భయంకర అనుభవం ఏమిటి?

సమయా సమయాల్నిబట్టి, అవసరమొచ్చినప్పుడు స్త్రీ తగినంత ధైర్యం, తెగువ చూపించకపోతే సాటిస్త్రీయే ఆమెను వంచించగలదన్న సత్యాన్ని సాక్షరీకంగా విశ్లేషించిన ద్వివేదుల సోమనాథ శాస్త్రి రచన 'కాలిన కలలు' ఈ నెల చతుర సమగ్ర నవల.

# కాలిన కలలు

## ద్వివేదుల సోమనాథశాస్త్రి

రాత్రి పదకొండు గంటలవేళ గోడగడి యారం చేస్తున్న శబ్దం తప్ప అంతా ప్రశాంతంగా ఉంది.

సావిత్రమ్మ మనవరాలు ఉషని పక్కన పెట్టుకుని నిద్రపోతోంది. నిద్రలో ఉష ఆమెమీద కాలు వేయడంతో తెలివి వచ్చింది.

"నాయనమ్మా మంచినీళ్లు" అంటూ లేచింది ఉష.

సావిత్రమ్మ లేచి మంచినీళ్లు తెచ్చి యిచ్చింది. ఉష నీళ్లు తాగి మళ్లీ నిద్రలో మునిగింది. సావిత్రమ్మ పడుకోబోతూ వరండావైపు చూసేసరికి, మనవడు శేఖర్ గదిలో లైటు యింకా వెలుగుతూవుంది.

"వీడెప్పుడూ యింతే! ఎంత చెప్పినా రాత్రులు మేలుకొని రాస్తూనే ఉంటాడు!" అనుకుంటూ "ఏంరా శేఖర్ యింకా నిద్రపోలేదా. యిలా వేళదాటి మేలుకుంటే ఆరోగ్యం పాడవుతుంది" అంటూనే ఆ గదిలోకి వెళ్లింది.

దీపం ముందు దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్న శేఖర్ అన్నాడు "ఏం లేదు నాయీ! నవల రాద్దామని ఆలోచిస్తున్నాను''

"కాని యిలా రాత్రులు నిద్ర మాని రాస్తూ కూర్చుంటే వంటికి మంచిది కాదు నాయనా"

"ఫర్వాలేదు నాయీ! ఈ టైంలోనే కాస్త ప్రశాంతంగా వుంటుంది. ఆలోచనలు బాగా వస్తాయి"

"అంత ఆలోచన ఎందుగ్గాని నేనో మంచి కథ చెబుతాను వింటావా? "

"అంతకన్నానా నాయీ! తప్పకుండా వింటాను అలా కూచో!" అన్నాడు. సావిత్రమ్మ కుర్చీలో కూర్చుంది.

"ప్రతీ స్త్రీ, వివాహమయినాక తన జీవితం మూడు పువ్వులూ ఆరుకాయలుగా గడిచిపోవాలని కోరుకుంటుంది. తనూ తన భర్త జీవితాంతమూ ప్రేమాభిమానాలతో, అన్యోన్యంగా వుండాలని తలపోస్తుంది. పండు వంటి పాపల్నికని మురిసిపోవాలనుకుంటుంది.

ఉత్తమ యిల్లాలుగా, భర్తకు భార్యగా, పిల్లలకు మాతృమూర్తిగా బీదలకు అన్నపూర్ణగా, అత్తమామలకు చేదోడు వాదోడుగా, అతిథులకు ఆదర్శమూర్తిగా, బంధువులకు తలలో నాలుకగా తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలనుకుంటుంది.

సుశీల కూడా ఆ ఆశలతోనే అత్తవారింటికి వచ్చింది. అత్తవారిల్లు నవీన పద్ధతిలో చాలా బావుంది. ఒక వుమ్మడి కుటుంబానికి సరిపడా కాస్త పెద్దయిల్లే.

అత్తవారింట్లో మనుషులు కొత్త, మనసులు కొత్త. ఆ వాతావరణం, వారి అలవాట్లూ అంతా ఆమెకు కొత్త. కొద్దిరోజుల పరిచయంతో తన భర్తకి మాత్రం సన్నిహితమయింది.

ఇన్నాళ్లూ కలిసి మెలిసి తిరిగిన చిన్ననాటి స్నేహితులనూ, పరిసరాలనూ వదిలి రావడం అంటే మనసు అదోలా అయిపోయినా అన్నదమ్ములనూ, అక్కచెల్లెళ్లనూ వీడిపోతున్నపుడు బాధపడినా, భర్తతో వెళ్లే రోజు వచ్చేసరికి లోలోన ఏదో ఆనందం, ఆతృత కలుగకపోలేదు.

ఇన్నాళ్లూ ఎంతో ప్రేమతో ప్రాణానికి ప్రాణంగా పెంచిన తల్లిదండ్రులు కంటినీరు పెట్టుకుంటూ తను వెళ్లిపోతున్నపుడు చూసిన జాలిచూపులు ఆమె హృదయాన్ని కలచివేశాయి.

తన భర్త, బావగారూ ఆ వూర్లోనే ఉద్యోగాలు చేస్తుండడంవల్లా, మామగారు అక్కడే నౌఖరీ చేసి రిటైర్ అయిపోవడంవల్ల అందరూ ఆ యింట్లోనే కలిసి వుంటున్నారు.

మరిది చదువు పూర్తి చేసి అక్కడ ట్రయినింగవుతున్నాడు. చిన్న మరిదీ, మరదలూ యింకా చదువుతున్నారు.

సుశీల భర్త మాధవరావుకి ఒక గది, మాధవరావు అన్న కృష్ణారావుకి వేరే గదీ వున్నాయి. పిల్లలికి ఓ గది ప్రత్యేకించి వుంది. సుశీల మామగారు కాశీపతి ఎప్పుడూ నడవలోనో, వరండాలోనో కాల క్షేపం చేస్తూ వుంటాడు. అత్తగారు కామాక్ష మ్మదే యిల్లంతా.

మొదట వారం పది రోజులవరకూ ఎవ రితో ఎలా వుండాలో ఎట్లా మాట్లాడాలో సుశీలకు తెలియలేదు. మోహమాటంచేత, కొత్త చేత మౌనంగా వూరుకున్నా, రాను రాను అందరితోనూ మాటలు కలిపింది.

సహజంగా సుశీల కలుపుగోరు పిల్ల. ఎవ రయినా పలకరించాలేగాని చాలా చను వుగా, సరదాగా వుంటుంది. మాటలు మొదలు పెట్టిందంటే మరి పట్టలేం. ఆ నవ్వులూ, మాటలూ, మోతాదుకు మించే వుంటాయి. అమాయకత్వంచేత మాట్లాడడ మేగాని అవతలివాళ్లు ఏమనుకుంటారో అన్నది తెలియదు. అది ఒక్కొక్కపుడు పైవాళ్లకి ఎబ్బెట్టుగా వుండేది. అప్పుడపుడు సుశీల తల్లి "రేపు పెళ్లయి అత్తవారింటికి వెళితే ఎలాగే? యిలాగే అందరితోనూ వాగేవంటే ఊరుకోరు" అనేది.

"అప్పటి మాట చూసుకుందాంలే!" అని సుశీల తేలిగ్గా తీసిపారేస్తూ వుండేది.

ఆ రోజు యిప్పుడు రానే వచ్చింది! ఎట్లాగో ఓ నాలుగు రోజులు నోరు కట్టు కుందిగాని ఒకరిద్దరు మాట్లాడ్డం మొదలెట్టే సరికి తన ధోరణిలో ప్రారంభించింది. ఒకటి రెండు రోజులు గడిచేసరికి సుశీల ఎన్నడూ ఎదుర్కోని పరిస్థితి వచ్చింది.

తను కలుగజేసుకుని మాట్లాడేసరికి మొదట్లో తాముగా మాట్లాడిన తోటికో డలూ, మరదులూ, ఒక్కసారిగా మాట్లాడ్డం మానివేసేరు. ముభావంగా ముక్కకి ముక్క జవాబు చెప్పి వూరుకోవడం, ఇష్టం లేనట్టు మొహం పెట్టి తప్పించుకోడం చూసేసరికి సుశీల తట్టుకోలేకపోయింది.

"ఇరుగూ, పొరుగూ వింటారు! కాస్త మెల్లిగా నవ్వు. ఆ మాటలు కొంచెం తగ్గించు" అని అత్తగారు అనేసరికి తల తీసి నంత పనయింది. అవమానంతో కంది పోయి, సిగ్గుతో తల దించుకుంది సుశీల. తల్లి మాటలు జ్ఞాపకానికి వచ్చేయి. తన ప్రవర్తనను తనే ఒకటికి రెండుసార్లు పరీ క్షించుకుంది.

తనేమీ మితిమీరి మాట్లాడినట్టు అనిపిం చలేదు. కాని ఇది పుట్టిల్లుకాదు. తల్లికీ, తండ్రికీ జవాబు చెప్పి తనిష్టం వచ్చినట్టు చేయడానికి. అటు భర్త, యిటు అత్తగారు!

ఏదో భయంచేత తననితను నిగ్రహించు కుంది. అయినా అపుడపుడు ఆమెకు తెలి యకుండానే నోరుజారిపోతూ వుండేది! తక్షణం తన తప్పును జ్ఞాపకం చేసుకొని నాలిక కరుచుకొని ఆపివేసేది.

సుశీల తోటికోడలు మాలతి ఆమెకు పూర్తిగా విరుద్ధం. ఆమె ఆట్టే మాట్లాడదు. సుశీల కలుగజేసుకుని మాట్లాడినా మామూలు విషయమైనా కూడా రహ స్యంగా ఎవరూ వినకూడదన్నట్టు మాట్లాడు తుంది.

ఏ పనిచేసినా, ఏం మాటాడినా, ఎవరో వెంటాడుతున్నట్లు, ఎవరో వినేస్తున్నట్లు, ఎవరో చూస్తున్నట్లు నాల్గువైపులా చూసి మరీ మాటాడుతుంది. అంతా అనుమా నంగా చూస్తూ ప్రవర్తిస్తుంది.

అది ఆమె తత్వమో లేక ఆ యింటి అను భవమో తెలియలేదు సుశీలకు.

బావగారు కృష్ణారావు మాత్రం కాస్త స్వాతంత్ర్యం వున్నట్లు అందరితోనూ కలివి డిగా వుంటాడు. సుశీలతో కూడా కొత్త లేకుండా, బేధభావం లేకుండా మాట్లాడు తాడు. ఇంట్లో తండ్రి తరువాత అతనే పెద్ద గనుక అతనంటే అందరికీ గౌరవం.

మామగారు కాశీపతి మాటే వినబడదు. ఆయన యింట్లో వున్నాడో లేదో తెలుసుకో



వడం కష్టం. ఎప్పుడూ వాలుకుర్చీలో కూర్చుని వరండాలో వాసాలు లెక్క పెడుతూనో పుస్తకం చదువుతూనో వుంటాడు. అడపా తడపా ఎవరయినా వస్తే విధిలేనట్లు మాట్లాడతాడు. పైవాళ్లు వచ్చి పలకరిస్తే పెదిమల మీదకు నవ్వు తెచ్చుకుని ముభావంగా మాట్లాడతాడు. తనకేమీ తెలియనట్లు, అంతా యింట్లోవాళ్లకు అప్పజెప్పి తను అన్ని విషయాలలోనూ రిటైర్ అయిపోయినట్టుంటాడు.

భార్య కామాక్షమ్మ మాటకు ఎదురుచెప్పే ధైర్యం లేదు. ఆమె అతనిపై చలాయించే అధికారం, అనే మాటలూ వింటే ఒక్కొక్క



పుడు అసహ్యం కలుగుతుందికూడా.

పెత్తనం అంతా కామాక్షమ్మదే. ఎప్పుడూ ఎవరో ఒకర్ని ఏదో ఒకటి అంటూనే వుంటుంది.

ఇరుగుపొరుగు వాళ్లు "కామాక్షమ్మ అసలు నిద్రపోతుందా" అంటూ వుంటారు. నిజమే ఒక్కొక్కపుడు నిద్రలో కూడా ఏ కోడలినో, కొడుకునో, పనిమనిషినో, భర్తనో, యిరుగూపొరుగునో కేకలు వేస్తూనే వుంటుంది. ఆమె నోరు చిన్నదేం కాదు.

అయినా పై వాళ్ళు వినకుండా వుండేందుకూ లోకంలో పేరు పడకుండా వుండేందుకూ, కాస్త జాగ్రత్త తీసుకుంటుంది.

మరిది మోహనరావు ఎప్పుడొస్తాడో, ఎప్పుడు వెళతాడో తెలియదు. యింట్లో ఎవరితోనూ అట్టే కలుగజేసుకోడు. ఏమీ పట్టించుకోడు. ఎవరినీ ఖాతరు చేయడు. ఎవరయినా ఏమయినా అంటే ముక్కకు ముక్క జవాబిచ్చి తన దారిని తను వెళ్ళిపోతాడు.

మిగతావాళ్ళు చిన్నవాళ్ళేమో కిక్కురుమనకుండా పడివుంటారు.

ఇంట్లో ఎక్కడి వస్తువు అక్కడే వుండాలి. పిల్లలు ముద్దుకయినా ఏమీ తీయడానికి వీల్లేదు. ఏదయినా తేడా వస్తే తల్లి చాకిరేవు పెడుతుంది. ఆ మాటలు మాటలు కావు, ఆ దెబ్బలు పైకి వినబడవు, కనబడవు. వాళ్ళు అన్ని దెబ్బలూ తిని చచ్చినట్టు పడివుండాల్సిందే. అంతా లోలోన దిగమింగాల్సిందే!

సుశీలకు యిదంతా వింతగా, అయోమయంగా వుంది. సర్దుకుపోతూ వాళ్లలో ఒకటిగా కలిసిపోడానికి సతమతమవుతూ వుంది.

తన పుట్టింట్లో తోటి ఆడపిల్లలతో గెంతుతూ, ఆడుతూ, కేరింతాలు కొడుతూ ఎప్పుడూ నవ్వుతూ పాడుతూ వుండేది. తల్లి ఏమీ అనేది కాదు. తండ్రి దగ్గర భయం చేత అంతలా వుండకపోయినా తన ఆటలూ, పాటలూ మానేదికాదు. అతనూ అంతలా పట్టించుకొనే వాడుకాడు.

తన యీడు పిల్లలతో ఆడుతున్నపుడు ఎప్పుడూ ఆమెదే పైచేయి, తను చెప్పినట్లే అందరూ ఆడుకోవాలి.

"ఎవడు పూజ చేస్తున్నాడోగాని ఒక ఆట ఆడిస్తుంది" అని యిరుగూ పొరుగూ తనని అంటూ వుండేవారు.

అలాంటి సుశీలకీనాడు యీ అత్తింటి పద్ధతులు సంకెళ్ళు వేసినట్లయినాయి.

★ ★ ★

దూరపు బంధువులెవరో వచ్చేరు. వాళ్ళెవరో సుశీలకు తెలియదు. అత్తవారు వాళ్లకి చేసిన మర్యాద, చూపిన ఆదరం చూసి ఆశ్చర్యపోయింది. ఆ వచ్చినవారి సఖ్యత, సంస్కారం చూసి ఎంతో సంతోషించింది.

ఇంట్లో వారు కూడా ఆ వచ్చినవారి చంటి పిల్లలను సహితం గౌరవించడం మొదలెట్టేరు. అందరూ ఎంతో ఆప్యాయంతోనూ, హృదయ పూర్వకంగానూ వాళ్లరాకకు ఆనందిస్తున్నట్టు ప్రవర్తించేరు.

ఉదయాన్నే కాఫీ, ఫలహారాలూ, తర్వాత విందు భోజనం, మధ్యాహ్నం టీ, టిఫినూ అన్నీ గొప్పగా జరిగిపోతున్నాయి. మాటల్లో ఛలోక్తులూ, హాస్యాలూ, నవ్వులూ సాగిపోతున్నాయి.

సాయంత్రం కాగానే ఆ వచ్చిన ఆడా, మగా అందరూ కలిసి సినీమా ప్రోగ్రాం వేసుకున్నారు. కామాక్షమ్మను, సుశీలని, మాలతినీ కూడా రమ్మన్నారు.

"నాకెందుకమ్మా సినీమాలూ, గినీమాలూ అయినా యింట్లో పని ఎవరు చూస్తారు? వచ్చేసరికి వంటా పెంటా, అవ్వాలా!" అంది కామాక్షమ్మ.

అప్పటికి మాధవరావుగాని, కృష్ణారావు గాని ఆఫీసునుండి రాలేదు, మాలతి రానన్నా వాళ్లు ససేమిరా వచ్చి తీరాలని పట్టుపట్టేరు. సుశీలకు వస్తాననాలో రాననాలో తెలియలేదు. అంచేత తోటికోడలితో వెళ్లక తప్పలేదు.

"కోడళ్లనిద్దర్నీ పంపండి సరదాగా వెళ్లివస్తాము. మగవాళ్లు వస్తే చెపుతాంలెండి!" అని వాళ్లు అంటూంటే కామాక్షమ్మా, కాశీపతీ "ఏమో వాళ్ల ఇష్టం!" అని అటూ ఇటూ కాకుండా అని వూరుకున్నారు.

మాలతి ఆ మాటలను ఎలా అర్థం చేసుకుందోగాని ఆమెలో ఏదో భయం పుట్టినట్టు సుశీల అనుమానించింది. అయినా చుట్టాల ముందు ఏమీ అనలేకపోయారు యిద్దరూ.

అందరూ కలసి బయలుదేరారు. వెళ్లి వస్తున్నంతసేపూ మాలతి భయపడుతూనే వుంది. "ఏమిటో వుండిపోవలసింది" అని అంటూనే ఉన్నది. ఆమె మనసు సినిమా మీదగాని, మాటల మీదగాని లేదు. అది చూసి సుశీల ఉండబట్టలేక...

"ఏమక్కయ్యా అదోలా వున్నావు. నీకు రావడం యిష్టం లేదా? లేక బావగారు ఏమన్నా అంటారనా? " అని మెల్లగా అడిగింది.

దానికి మాలతి నిట్టూర్పు విడిచి, "నీకు తెలియదు సుశీ" అని మాత్రం అంది.

"అంటే..."

"ఏమీలేదు ఇప్పుడెందుకులే అదంతా! నీకే తెలుస్తుంది. వూరుకో! ఆ ఇంట్లో మనం బందీలయిన జంతువులం... సరదాలూ, నవ్వులూ... ఇవన్నీ మరచిపోవాలి" అని వూరుకుంది అంతమందిలో మరి చెప్పడం ఇష్టంలేనట్టు.

సుశీలకు గుండెల్లో రాయిపడినట్టయింది. యింక ప్రశ్నించడం అనవసరం అనుకొని వూరుకుంది.

సినిమా నుండి ఇంటికి తిరిగి వచ్చేరు.

మాధవరావూ, కృష్ణారావూ అప్పటికే భోజనాలు చేసి ఎవరి గదుల్లో వారు వున్నారు. రాగానే అందరితోపాటు సుశీల కూడా భోజనం చేసింది.

అత్తగారు చుట్టాల ముందు సరదాగానే వున్నట్టున్నా సుశీల, మాలతిలను చూసి మాత్రం ముఖం ముడుచుకోవడం మొదలెట్టింది.

బంధువులున్నారని వూరుకుందిగానీ కోడళ్లనిద్దరినీ నూరుకు తాగేయాలన్నంత కోపంతో వుందని సుశీల, మాలతీ కనిబెట్టేరు.

భోజనాలయేక ఎవరి గదుల్లోకి వారు వెళ్లిపోయారు. చుట్టాలకూ, పిల్లలకూ వసారాల్లోనూ, వరండాలోనూ పక్కలువేశారు.

సుశీల గదిలోకి వెళ్లేసరికి మాధవరావు ఆమె రాకని చూసి గమనించనట్టు పుస్తకం పట్టుకొని కూర్చున్నాడు.

"ఏమండీ నిదరపోలేదా? " అంది సుశీల.

అది విని యిటు తిరిగి "రాణీగారికి ఇప్పుడు యిట్లా మొగుడన్నవాడు జ్ఞాపకంవచ్చినట్టు వుంది" అన్నాడు.

హాస్యమాడుతున్నాడనుకుంది సుశీల "మరి రాజావారు వచ్చి జ్ఞాపకం చేస్తే మరుస్తామా? " అన్నది నవ్వుతూ!

కానీ మాధవరావు, "చాలు నోర్ముయ్ యింకా మాటాడుతున్నావు సిగ్గులేక" అని గట్టిగా అరిచాడు. "ఎవర్నడిగి వెళ్లేవు సినిమాకి... అంతా నీ యిష్టంలాగే వుందే! ఇంకా నిన్నగాక మొన్న వచ్చిన దానివి అప్పుడే యింత స్వతంత్రం! ఇక్కడ మీరు వచ్చేసరికి అన్నీ సిద్ధంగా ఎవరు తయారు చేసి వుంచుతారని అనుకున్నావు" అని అరిచాడు మళ్లీ.

తను చేసిన తప్పేమిటో సుశీలకు అర్థం కాలేదు. భర్త నోటంట ఆ మాటలు రాగానే గతుక్కుమంది.

"మరేమో నేనొక్కర్తినీ వెళ్లలేదండీ మన ఇంటికొచ్చిన పిన్నిగారూ, వదినగారూ అందరూ వస్తేనేగాని వీల్లేదంటే అక్కయ్యతో కలిసి వెళ్లేను" తలదించుకుని అంది.

"అదే నేనడుగుతున్నది! ఎవళ్లు పిలిచినా వెళ్లిపోడమేనా! బాగానే వుంది. ఎవర్నీ అడిగి వెళ్లనక్కర్లేదా? యింట్లో పెద్దాచిన్నా ఎవరూ లేరా! అంతా మీ ఇష్టమేనన్న మాట"

"లేదండీ అత్తగారితో వాళ్లే అన్నారు రమ్మనమని. కాని అత్తగారు రానని అనేసేరు. అయితే మమ్మల్ని తీసుకు వెళతామన్నారు"

"మా అమ్మ వెళ్లమని చెప్పిందా? "

"మీ యిష్టం అని వూరుకున్నారు అందుకని వెళ్లేము"

# ఏరిన ముత్యాలు

★ వాన పడినా ఊసర క్షేత్రంలో గడ్డి కూడా మొలవదు. భగవద్భక్తి ఉంటే కోరికలు మొలకెత్తవు

-(శ్రీరాముడు)

★ భయంకంటె భయంకరమైనది మరియొకటి లేదు

-పండిత శ్రీరామశర్మ ఆచార్య

★ విలువైనవాటి అన్నింటికంటె విలువైనది కాలం

-పండిత శ్రీరామశర్మ ఆచార్య

★ కాలం అనేది ఎలుకలాంటిది. మెల్లమెల్లగా జీవితమనే దారాన్ని కొరికివేస్తుంది.

-స్వామి శివానంద్

★ జ్ఞానం ఐకమత్యానికి దారితీస్తే అజ్ఞానం కలహాలకు దారితీస్తుంది.

-రామకృష్ణ పరమహంస

★ ఒరనుంచి తీసిన కత్తివంటి శత్రువుకంటె మంచిగా ఉంటూ హానిచేసే బంధువు ప్రమాదకారుడు.

-తిరుక్కురళ్

★ ఉదారంగా నీ శత్రువులను క్షమించువారు నీకు ఎంత మిత్రులవుతారో చూడు!

-చిన్మయానంద

★ నిన్ను నీవు పూర్తిగా దేవుడికి అర్పించుకో. అంతరాత్మ ప్రబోధించే పనులు చేయి!

-రామదాస్

★ మూఢాచారాలనుండి ముక్తుడైనవాడికి మృత్యుభయం ఉండదు!

-గురునానక్

★ ఆత్మ విచారణే లక్ష్యశుద్ధికి దారి తీస్తుంది!

-పతంజలి

★ ఉదయం లేచింది మొదలు పడుకోబోయేవరకూ కీటకంలాగా ఎవరి విధిని వారు నిర్వర్తించడం ముక్తికి మార్గం

-వివేకానంద

★ తప్పు చేయడం మానవ లక్షణం. క్షమించడం దైవత్వ లక్షణం

పోప్

★ కత్తిని ఝళిపించి కూడగట్టుకున్న శక్తి వృధా. నిక్కమైన శక్తి సత్యనిహితమైనదే కదా!

-గాంధీజీ

★ పాక్షికంగా గాక సమగ్రంగా విద్యావంతుణ్ణి చేసేదే విద్య!

-జె.పి.వాస్వానీ

★ నీవు కొన్న ప్రతి మంచి పుస్తకంలోనూ నీ వ్యక్తిత్వం ఒక మిల్లీమీటర్ పెరుగుతుంది!

-హరదయాళ్

సేకరణ: వాకాడ శ్రీను

"అంటే ఏమిటి అర్థం వెళ్లమనా? "

"అలాగనే అనుకున్నాం. వాళ్లు బల వంతం చేస్తే బావుండదని"

"అవును బావుండదు! మరి.. వెధవ బుద్ధీ.. వెధవ స్వతంత్రమూ" అని గట్టిగా కేకవేయబోయేసరికి.

"పోనీ మరెప్పుడూ మిమ్మల్ని అడక్కుండా వెళ్లనులెండి. ఈ సారికి వూరుకోండి. కాస్త మెల్లిగా మాట్లాడండి... అవతలవాళ్లు వింటారు"

"వీళ్లొకళ్లు బాగా దాపురించారు! అయినా తీరుబాటుగా ఎవళ్లయినా వుంటే చాలు బంధుత్వం కలుపుకు మరీ వస్తారు. పోనీ వచ్చినవాళ్లు వాళ్ల మానాన్ని వాళ్లుపోరు" అని విసుక్కున్నాడు.

అతని మాటలకు సుశీల ఆశ్చర్యపోయింది.

ప్రొద్దున వాళ్ల ముందు యీయనేనా అట్లా ప్రవర్తించింది? అంత మర్యాద చూపింది?

"పోన్లెండి వాళ్లెన్నాళ్లుండి పోతారు. ఏదో చుట్టపు చూపుగా రాకరాక వచ్చేరు. రాకపోకలు లేకపోతే బంధుత్వం ఏమిటి? " అని సమాధానపర్చబోయింది సుశీల.

"చాల్లే నాకే చెప్పొచ్చేవు! వాళ్లొచ్చి వుద్ధరించారు! నువ్వు వెనకేసుకొస్తున్నావు! అయినా నీ ప్రవర్తనేం బాగులేదు" అని అన్నాడు మాధవరావు.

అది విని సుశీల నిశ్చేష్టురాలయింది. "అదేమిటండీ యిప్పుడు నేనేం చేశానని" అని అడిగింది.

"లేకపోతే ఏమిటా పకపకలు! వాళ్లు వచ్చిన దగ్గర్నుండి చూస్తున్నాను తెగవాగుతున్నావు వాళ్లతో"

"ఎవరితో మాట్లాడాను గనుక! పిన్నిగారితోనూ వదినగారితోనూ కదా!"

"అయితే మాత్రం అంత వాగడమా? అంత నవ్వులా? చూడూ! ఇట్లా అయితే ఈ ఇంట్లో కుదరదు. ఎవరితోనయినాసరే మితిమీరి మాటాడకూడదు. ఏదో అవుసరమయిన వాటికే జవాబు యివ్వాలి. అంతే గాని అట్లా విరగబడి పోకూడదు."

"ఇంటికి వచ్చిన వారితో సరదాగా మాట్లాడకపోతే ఏమనుకుంటారు చెప్పండి! అందుకని మాట్లాడేనుగాని..."

"అదుగో మళ్లీ జవాబు చెప్పి సమర్థించుకుంటావేం! చెబుతూ వుంటే నీక్కాదా? " అని కళ్లెర్రజేశాడు.

"పోనీలెండి మీకిష్టంలేకపోతే అలాగేలెండి!" అని అనేసిందిగాని అతని ప్రవర్తన ఆమెకు అర్థం కాలేదు. యింత కోపం రావలసిన కారణం కనబడలేదు. అక్కడ మాలతి ఎన్ని ఆశీర్వచనాలు తిన్నదో అని తలపోస్తూ పడుకుంది సుశీల...

ఆ రాత్రి మాధవరావు ఆమెతో మాట్లాడలేదు. భర్త కోపంతో ఎడ మొహం, పెడ మొహంగా వుండడం అదే మొదటిసారి.

ఆ తెల్లవారురూమున వచ్చిన చుట్టాలు వెళ్లిపోయేరు.

★ ★ ★

ఆ సంఘటనకు యింటిల్లపాదీ అంత ప్రాముఖ్యత నిస్తారనుకోలేదు సుశీల.

ఉదయం మామూలుగా లేచింది. గానీ యింట్లో మిగతావారు మామూలుగాలేరు. అందరి మొహాలూ ఉడుకుతూ వున్నాయి.

కామాక్షమ్మ లేచిన దగ్గర్నుండి దులపడం మొదలెట్టింది.

"ఇంట్లో అందరికీ స్వతంత్రాలు లావయిపోతున్నాయి"

"పుట్టింటిలో జరిగినట్టే జరగాలంటే ఇహ అయినట్టే"

"ఎవరయినా వస్తేచాలు, వళ్లూ యిల్లూ మరచిపోతారు!"

ఇలా సూటిపోటీ మాటలు ప్రారంభించింది. దానికి కాశీపతి తాళం వేయడం ఒక విశేషం.

"అయినా పెద్దవాళ్ల మాటకు మర్యాద...

ఈ ఇంట్లో ఎక్కడేడిచింది"

ఇలా మొదలయిందల్లా పొద్దెక్కుతున్న కొద్దీ పెద్ద రాద్ధాంతం అయింది.

"అడ్డమయినవాళ్లూ ఇదిగో అంటూ సంబంధాలు కలుపుకు వస్తారు" అని కామాక్షమ్మ ఆ వచ్చిన వాళ్లను అంటూంటే మోహనరావు అందుకున్నాడు.

"అదేమిటమ్మా వాళ్లు వచ్చిన దగ్గర్నుండీ నువ్వేకదా ఎంతో మర్యాద చేసి తెగ మేపేవు. మరి యిప్పుడు ఇలా తిడతావెం దుకు? "

"ఇంటికి వచ్చేక మానేస్తామా? అలా చేయకపోతే ప్రచారం మొదలెడతారు. అయినా వచ్చినవాళ్లు వచ్చినట్లే వెళ్లరాదూ?''

అన్నది కామాక్షమ్మ.

"అయితే ఇష్టం లేకపోయినా ఎందుకం తలా వారి ముందు నటించడం? వూరు కుంటే పోయేదిగా" అన్నాడు కృష్ణారావు.

"అదెలా కుదురుతుందిరా నాయనా! అయినా అదంతా అట్లావుంచు మనమేదో మర్యాద చేశాం... అలాగని వీళ్లని వాళ్లతో వూరేగమని వుందా? "

"అదేమిటి నువ్వు వూరుకున్నావుగా? "

"ఊరుకోక వాళ్లముందు వెళ్లొద్దు అని అంటే ఏం బావుంటుంది? వాళ్లే గ్రహించు కోవాలిగాని. సుశీలకు తెలీదు పోనీ మాల తికేం తెలీదా! మనకలాంటివియిష్టంలేదని? "

మాలతి, సుశీల ఒకరినొకరు చూసుకు న్నారు.

మాలతి ఎందుకలా భయపడిందో ఆమె అన్న మాటల్లో నిజం ఏమిటో సుశీలకు యిప్పుడు అర్థమయింది. ఆ యింటివాళ్ల మనస్తత్వాలు కూడా అర్థమవజొచ్చేయి.

"వాళ్ల పాపని వదిన అసలు వదలనే లేదమ్మా!" అని చిన్న మరదలు మంట ఎగ దోసింది.

"ఛీ... మనిషికి ఒకసారి చెబుతే బుద్ధి వుండాలి. ఎన్నిసార్లు చెప్పడం. పరాయి వాళ్ల పిల్లల్ని పట్టుకుని ఎందుకంత ప్రాకు లాడ్డం? ఎన్ని చెప్పినా అంతే" అని మాలతి మీదకు లేచేడు కృష్ణారావు.

"అయిదేళ్లయింది కాపురానికి వచ్చి ఎందుకూ? ఎంత మురిసిపోయేమో! అంతా అయింది. అయినా మనకు ఎక్కడ దొరికేరో ఈ త్రాష్టులు. మనకు కలిగితే గర్వం, ఆనందమూగాని మరో తల్లిపిల్లల్ని చూసి సిగ్గుపడక వాళ్లని ఎత్తుకుని ఆడిం చడం కూడాను" అంది కామాక్షమ్మ.

ఇవి విన్న మాలతి కళ్లవెంట నీరు తిరి గింది. తలవంచుకుని సిగ్గుతో వూరుకుంది.

ఆ ప్రసంగం మాలతి వైపునుండి సుశీల వైపు మళ్లింది... "ఇదిగో అమ్మాయీ! నీకింకా కొత్త కాబట్టి చెబుతున్నా! యింటికి వచ్చిన వాళ్లతో ఆ నవ్వులేమిటి? ఆ పకప కలూ, ఆ బెకబెకలూ ఏమిటి? వాళ్లేమను కుంటారు? సిగ్గూ లజ్జా వుండనక్కర్లా! ఆడ దానివి కాదూ? ఇలాటి శషబిషలు పనికి రావు! యికనయినా బుద్ధి తెచ్చుకొని వుండు!" అని కొత్త కాబట్టి అక్కడితో ఆపింది కామాక్షమ్మ.

సుశీల అన్నీ వింటూ వూరుకుంది.

"వాళ్లేదో చేశారని వదినలను అంటున్నా వుగాని అమ్మా నువ్వు చేసింది బావుందా? వచ్చినవాళ్లకు రెండుపూట్లా టిఫిన్లూ రెండో సారి కాఫీలూ యివన్నీ ఎందుకమ్మా! వాళ్లె వళ్లు? మనమెవళ్లం? " అని మళ్లీ నిలదీ సేడు మోహన్‌రావు.

వదినలను అనవసరంగా అంత మాటల నడం అతనికి బాధనిపించింది.

"నే చేయక పోదునురా! కాని మన యింటి మర్యాద ఆలోచించే అలా చేశాను! తెలుసా? ఆమాత్రం దానికి అంతలా మరీ మరీ అడుగుతావ్? నాకామాత్రం స్వాతంత్రం లేదా! నువ్వు నోరు ముయ్యి!"

"అలాగే వుంటుంది అమ్మా అందరికీ! తనవరకూ వస్తేనేగాని తెలీదు!... ఎవర

యినా వస్తే ముఖం ముందు అన్ని మర్యాదలూ చేస్తాం. ఆ వెనక చేసినందుకు గింజుకు చస్తాం! యిది మనింట్లో మామూలే కదా! అయిందేదో అయింది యింక వూరుకోండి!" అని మనసులో వున్నది అనేసేడు మోహనరావు.

సుశీలకు అత్తవారింట్లో మెసులుకోవడం, అనుకున్నంత సుకరం కాదని అర్థమయింది. పుట్టినింట గల స్వతంత్రానికి, అత్తవారింట్లో తనస్థానానికి తేడా తెలియవచ్చింది.

మొదట్లో, వాళ్ళందరూ ఎంతో మర్యాదస్తులని అనుకుంది గానీ రాను రానూ వాళ్ళ నిజస్వరూపాలు బయటపడినాయి. ఏం చేసినా లోకం కోసం చేస్తున్నారు గాని హృదయపూర్వకంగా చేస్తున్నట్టు కనబడలేదు. పైకి డాబుగా వుంటారుగానీ లోపల అంతా విరుద్ధం. నయాపైసలతో కూడా లెక్క. నవ్వుతూ మాటాడిన వాళ్ళనే వెనక తిడుతూ, విమర్శిస్తూ వుంటారు.

ఎవరయినా వస్తే వాళ్ళ ముందు, యింట్లో కోడళ్ళని ఎంతో ముద్దుగా, గౌరవంగా చూస్తున్నట్టు, కలిసి మెలిసి వున్నట్టే నటిస్తారు, వాళ్ళా గుమ్మం దాటిన దగ్గర్నుండి, యీసడింపులు ఎత్తిపొడుపులూ మొదలెడతారు.

ప్రతీవాళ్ళూ ధర్మాలూ, ధర్మపన్నాలూ మాట్లాడేవాళ్ళే కాని ప్రత్యక్షంగా చేయవలసి వచ్చేసరికి వాళ్ళంత అనాగరికులూ, మూర్ఖులూ మరొకరు వుండరు! వాళ్ళ మనసుల్లో ఏముంటాయో, ఏమి మాటాడుతారో, ఏం చేస్తారో తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు!

ఇలాటి వాతావరణంలో నడచుకోడం సుశీలకు కత్తిమీద సాము అయింది! తాను ఏ శతాబ్దపు, ఏ దశాబ్దంలో ఉన్నదీ, వీళ్ళే యుగంలో బతుకుతున్నదీ అర్థంకాలేదు.

సుశీల వచ్చి ఆరు నెలలయింది. అదేం చిత్రమోగాని తన తల్లీదండ్రీ దగ్గర్నుండి ఒక వుత్తరమయినా రాలేదు... లోకంలో పిల్లని అత్తవారింటికి మొదటి మారు పంపినపుడు ఒక నెలో, రెండు నెలలో పోయాక, మళ్ళీ తమతో తీసుకువెళ్ళి సారె, చీర పెట్టి పంపడం రివాజు. కాని సుశీల పుట్టింటివారు ఆ వూసే ఎత్తలేదు.

సుశీల అత్తవారికి ఇదో కోపకారణం అయింది. ఆ యింట్లో అందరికీ అదే తాజా సమస్య అయింది.

"ఏవమ్మా నీ కోడలు వచ్చి ఆర్నెల్లు అవుతూంది! వాళ్ళవాళ్ళెవరూ రాలేదేం! సారె చీర ఏం పెట్టేరూ? " ఇరుగుపొరుగు అడిగేటప్పటికి-

"ఇంక అడక్కండి తల్లీ! వున్నారో, పోయారో, ఆ దేముడికే తెలియాలి! కట్టుబట్టల్తో పంపించేశారు. మరి తిరిగి చూడలేదు సరికదా ఎలా వున్నదని ఉత్తరమయినా వ్రాయలేదు"

"బావుంది మొదటి మారు పంపడం కదా! అదేం మనుషులమ్మా"

"అయ్యో! కట్టి విడవడానికి రెండోబట్ట, నీళ్ళుతాగడానికి గ్లాసయినా యివ్వలేదమ్మా... యింక సారె, చీర కూడానా తల్లీ! చెప్పుకుందుకి సిగ్గుసిగ్గు!... అంతే ఎలా వదుల్చుకుందామా అని యిన్నాళ్ళూ చూశారు... ఏదో కట్నం మొహాన్న పారేసి... ఆ పీడని మాకు అంటకట్టి వూరుకున్నారుగాని... యింక వాళ్ళు చూస్తారా! చేస్తారా? "

రోజులు గడుస్తున్న కొద్దీ యింట్లో చిటపటలు ఎక్కువయినాయి. అస్తమానం సుశీలనూ, ఆమె పుట్టింటివారినీ, పట్టుకుతిట్టడం ధ్యేయం అయింది. సుశీల అన్నీ వింటూ లోలోనే ఏడుస్తూ వూరుకోవడం తప్పితే ఏమీ అనలేకపోతూంది. ఎవరితో చెప్పుకుంటుంది? ఆమెను వెనకేసుకొచ్చే వాళ్ళూ, నా

అన్నవాళ్ళు లేకపోయారు. కనీసం భర్త మాధవరావయినా సానుభూతి చూపుతాడేమో అంటే అదీ లేదు సరిగదా "పెళ్ళిచూపుల్లో మాత్రం! ఏం మర్యాద చేశారని? స్కూటర్ అడిగితే యిస్తానని మాట మాత్రం కూడా అనలేదు! ఎంతసేపూ డబ్బు! డబ్బు! అని చచ్చేరు! ఎక్కడా చెల్లక నా కంటగట్టేరు దీన్ని! పాతిక వేలు కట్నం యిచ్చేసరికి నీకూ, నాన్నగారికీ రెండోదేమీ కనబడలేదు!" అంటాడు.

"ఏదో కావలసినవాళ్ళూ, మర్యాదస్తులూ, అనుకున్నాంగాని యిలాటి పిసినారి సంబంధం అని అనుకోలేదు" అని కామాక్షమ్మ ముక్కు చీదుతూ అంటుంది.

"అయినా మన రాత. ఆ పెద్ద కోడలూ అలాటిదే అయింది. ముచ్చటపడితే యీ రెండో కోడలూ యిలాటిదే అయింది"

"సరేలే ఎన్నాళ్ళిలా వుంటారు. ఆడపిల్లనిచ్చుకున్నాక రాక మానతారా! అప్పుడే తగిన మర్యాద చేద్దాం!"

సుశీల మనసులో కల్లోలం ప్రారంభం అయింది. తాను ఏం చేయగలదు? ఒకప్పుడు "అత్తవారింటికి పోతే సుఖపడతానేమో" అనుకున్నది. అదంతా భ్రమ అని తేలిందిపుడు.

ఇద్దరు అక్కచెల్లెళ్ళలో సుశీల రెండోది. తరువాత వరసగా యిద్దరు తమ్ముళ్ళు. ముందుగా యిద్దరూ ఆడపిల్లలే అవడం చేతనో ఏమో ముద్దూ ముచ్చట, చదువూ, సంస్కారం అంతగా ఎరుగదు.

తండ్రి కొండలరావంటే ఆ యింట్లో అందరికీ హడలే. ఆయన తత్వమే అంత! అంతా డిసిప్లిన్ అంటాడు. హృదయంలో అభిమానం వున్నా, అది వ్యక్తపరిచే సమయం వచ్చినపుడు కూడా, తూచి మరీ ప్రవర్తిస్తాడు. ఏదయినా సరే ఆఖరికి ప్రేమ కూడా హద్దులు దాటకూడదంటాడు.

ఆయన స్వభావం అటు పాతతరం వాళ్లదీ కాదు యిటు కొత్త తరం వారిదీ కాదు. మంచి విషయాలలో అట్లా వుంచి మార్పు రావలసిన పాత కాలపు పద్ధతులలో కూడా ఆయన అంతే!

ఆడ పిల్లలంటే యింట్లో పడివుండవలసిందే. వాళ్ళకు ఏ మాత్రం స్వతంత్రం వుండడానికి వీల్లేదు! చదువులు చదివి వూళ్లేలతారా? ఇంట్లో అమ్మ వెనకాల పనులు చేస్తూ తమకన్నా చిన్నవాళ్లని ఎత్తుకు ఆడిస్తూండడమే వాళ్ల పని... ఇంట్లో మగవాడు ఎంత చెబితే అంత! ఎలా అంటేఅలా.. తండ్రి నిర్ణయించి ఎవరికి కట్టబెడితే వాడే భర్త. ఆడపిల్లలు, 'ఇదీ' అని వాళ్ల మనసులోని మాట చెప్పడానికి వీలులేదు. పోనీ అదేదో తను గ్రహించనూలేదు! ఎప్పుడయినా యిరుగూ పొరుగు గుమ్మాలకి... తప్పితే, మరెక్కడికీ వెళ్ళడానికి వీలులేదు. ఒక బజారుకిగాని, ఒక సినీమా, నాటకం యిట్లాంటివాటికి తీసుకువెళ్ళిన రోజులేదు.

అందరిళ్ళలోనూ పండుగలకూ, పబ్బాలకూ, పుట్టిన రోజులకూ, పిల్లలకి కొత్తబట్టలు కుట్టించి సరదాలు తీర్చడం అన్నది వుంటుంది! గాని కొండలరావు యింట్లో అది లేదు.

ఎప్పుడో అతనికి తోచినపుడు, రెండు మూడు తానుల బట్ట తెచ్చి టైలర్‌కి యిస్తాడు. బేండు మేళంలా అందరికీ ఒకటే రకం కుట్టించవలసిందే! ఎవరూ ఎదురు చెప్పడానికి వీలులేదు.

ఇంక తల్లి పార్వతమ్మ ఎప్పుడూ జబ్బు మనిషే. ఆమె కలివిడిగా, బాగా తిరిగిన రోజు ఎవరికీ జ్ఞాపకం లేదు. ఏదో ఒక బాధతో ఎప్పుడూ 'యిస్సు'మంటూ వుంటుంది. అందుచేత పేరుకి ఆమె వంట చేసేది తప్పితే అంతపనీ ఆడపిల్లలే చేసేవారు. ఈ కారణాలవల్ల సుశీల థర్డుఫారం పాస్ అవడమే కష్టమయిపోయింది.

సుశీల అక్క భారతి మాత్రం అంత అధ్వాన్నంగాదు! ఆమె అందరికన్న పెద్ద

అవడంచేతో ఏమో ఎవరూ ముద్దుచేయక పోయినా తనే ముద్దులు గురుస్తూ అన్నిటికీ మారాం చేస్తూవుండేది. పనులు మానేస్తూ వుండేది. మిగతావాళ్ళు అట్లా చేస్తే చీవాట్లు తప్పేవి కాదుగానీ భారతిని మాత్రం ఏమీ అనేవారు కాదు.

అందువల్ల సుశీలకు, భారతి పని కూడా చేయవలసి వచ్చేది. విశ్రాంతి వుండేది కాదు! మిగతావాళ్ళు తనకన్నా చిన్న వాళ్ళు. అంచేత సుశీలకు తప్పేది కాదు. తమ్ముళ్లు చంకకు అందివచ్చేసరికి... అసలే తీరుబడి వుండేది కాదు. వాళ్ళకి వళ్లు కడగడం, బట్టలు తొడగడం, భోజనాలు పెట్టడం అన్నీ తనే చూసుకొనేది.

ఇంత చేసినా- భారతిని గురించి అమాయకురాలు, ఏమీ తెలియనిది అనీ సుశీల గురించి "పైకి ఏమీ అనదుగాని, గడుసుది, అన్నీ తెలుసు!" అనీ అంటూండేవారు.

కొండలరావుగారికి కూతుళ్లమీద ఎలాటి అభిప్రాయం వుందో కొడుకులమీద కూడా అలాటి అభిప్రాయమే వుంది.

మగపిల్లలు ఎంతసేపూ చదువుకోవలసిందే! మరో ధ్యాస వుండడానికి వీల్లేదు. ఉద్యోగం పురుషలక్షణం, చాకిరీ స్త్రీ లక్షణం!

అతగాడు వచ్చేసరికి ఆడపిల్లలు యింట్లో పనులు చేస్తూవుండాలి! మగపిల్లలు పుస్తకం పట్టుకొని వుండాలి. ఇందులో ఏ తేడా వచ్చినా కొడుతూ వుంటాడు.

అందుకే... పెళ్ళి అయి మూడుముళ్ళూ పడ్డాక అల్లుడు కూతుర్ని ఏలుకోక ఏంచేస్తాడు? కాకపోతే నాలుగు మాటలు అంటాడు, రెండు కొడతాడు! అంతకన్నా ఏం చేస్తాడు. తనను కాదని దులిపేసుకుంటే సరి! యిప్పుడు మళ్ళీ కూతుర్ని యింటికి తీసుకువస్తే సారె, చీర పెట్టాలి. ఖర్చు. పెళ్ళికే బోలెడు అయింది! అని ఆలోచించాడాయన!

సుశీల మాత్రం తన తండ్రి ప్రవర్తనకి సిగ్గుపడుతూ తలుచుకొని ఏడుస్తూ వుంటుంది. కాని ఓదార్చేవాళ్లు ఎవరు?

భర్తగాని, అత్తగారు గాని చూస్తే ఏమంటారో అన్న భయంతో చాటుగా కన్నీళ్ళు పెట్టుకు తుడుచుకొనేది.

సుశీల నెల తప్పింది. మొదట్లో కలవరపాటు చెందినా అత్తగారూ, తోటికోడలూ నిర్ధారణ చేసిన తర్వాత, ఆమె మనసు సంతోషంతో పరవశించింది. సిగ్గు ముంచుకొచ్చింది. తనలో తనకే ఆ మార్పు వింతగానూ, విచిత్రంగానూ అనిపించింది. క్రొత్త అనుభూతులతో సుశీల ఉక్కిరిబిక్కిరి అయింది.

ఈ విషయం యింట్లో అందరికీ సంతోషాన్ని కలిగించింది. సుశీల మీద, కాస్త అభిమానం చూపడం, కొంచెం గౌరవంగా చూడడం మొదలెట్టేరు! కాని అది అట్టే కాలం నిలవలేదు. ఆ సంగతి సుశీల పుట్టింటివారికి తెలుపడమా? మానడమా? అనే ప్రశ్న వచ్చింది!

"ఓ ముక్క రాసి పడేస్తే సరి! వస్తే వస్తారు లేకపోతే లేదు" అని కృష్ణారావు అనేసరికి...

"ఆ అంతపాటివాళ్ళా? యిన్నాళ్ళయింది ఉత్తరం ముక్కయినా లేదు యిహ ఈ కబురు తెలుస్తే వస్తారు!" అని యీసడించింది అత్తగారు.

"ఇంక యీవిడను తీసుకువెళ్లడం, సీమంతం చేయించడం పురుడు పొయ్యడం... యిదంతా ఖర్చు... అంచేత అతగాడు రాడు!" అని కాశీపతి గొణిగేడు.

"ఇంతకీ యిదంతా మన అదృష్టం! కొత్త కోడలు వచ్చింది కదా అని ఓ అచ్చటా! ముచ్చటా! ఎవళ్ళనంటే ఏం లాభం!"

"ఏం రాయనక్కర్లేదు! వాళ్లంతట వాళ్ళు ఒక్కమారయినా వచ్చి చూసిన పాపాన్ని పోలేదు! మనకేం అవుసరం! రండి! పిల్లను తీసుకువెళ్ళి పురుడు పోయండి అని వ్రాసేక వస్తేనేం! రాకపోతేనేం! ఆ పురుడేదో

యిక్కడే పోసుగుంటే సరిపోతుంది"

"ఏమో బాబూ మీ యిష్టం ఏం చేసుకుంటారో! మళ్ళీ ఎటొచ్చీ పెద్దవాళ్లని మమ్మల్ని అంటారు! చెబితే ఒకటి- చెప్పకపోతే ఒకటి. మన ఆచారాలూ, నమ్మకాలూ ఏనాటినుండో వున్నవి... కూతురికి మొదటి పురుడు పుట్టింటివారే పోసేది ఆచారం... అందరూ చేసేది... యీనాటికీ మహానుభావులను చూస్తున్నాం"

"అలాటివన్నీ వాళ్లకు మొదటినుండీ వుంటే కదా! ఛీ పాడు మనుషులు! వీళ్ళను వచ్చినా గుమ్మం ఎక్కకుండా చూడాలి!"

సుశీల ఆ మాటలన్నీ వింటూ బిక్కచూపులు చూస్తూ తలవంచుకొని కాలు నేల రాస్తూ వుండిపోయింది.

ఇంక రోజూ యిదే పారాయణం. ఏదో ఒక వంకపెట్టి ఎత్తిపోయడం ప్రారంభించేరు.

తన భార్య నెల తప్పడం మాధవరావుకి లోలోన ఎట్లా అనిపించిందోగాని, పైకి మాత్రం ధుమధుమలాడుతూనే వున్నాడు. కారణం సుశీల పుట్టింటివారు రాలేదనే.

సుశీలకు కూడా మనసు చివుక్కుమన్నది. తన వాళ్ళమీద కోపం వచ్చింది. ఆశపాశమూ లేని తల్లిదండ్రులయితే ఎవరికి కష్టమనిపించదు! పోనీ లోకం కోసమయినా ఒకసారి వచ్చి చూచిపోవొచ్చును కదా అనుకుంది.

ఎంత పౌరుషం వస్తున్నా, తల్లిని తండ్రిని అన్నదమ్ముల్ని చూడాలనే కోరిక వేధిస్తూనే ఉంది.

వాళ్లని వదిలిపెట్టి వచ్చిన దగ్గర్నుండి అక్కడి సంగతులు తెలియలేదు, తల్లి వంట్లో ఎలావున్నదో ఒక్కసారి చూసివస్తే బావుండుననిపించింది.

కళ్లంట నీరు బొటబొట రాలేయి. హృదయమంతా కలచివేసినట్లయింది. మరి ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది లోలోనే. పైకి తెలిస్తే అల్లరి... ఎవరితో చెప్పుకుంటుంది తన ఆవేదన? ఏం చేయగలదు?

అలా ఓ నెల గడిచిపోయింది.

తన వాళ్ళకు యీ సంగతి ఎంత వేగిరం తెలియపరుద్దామా అని వున్న సుశీల ఒకనాడు భర్త భోంచేసి తీరుబాటుగా పడుకున్నాక మెల్లిగా అడిగింది.

"ఏమండీ! మా వాళ్ళకు వుత్తరం వ్రాయండి! పోనీ నన్ను వ్రాయమంటే వ్రాస్తాను!" అంది ఒక వంక భయపడుతూనే.

"ఏమిటి? " అన్నట్టు చూశాడు మాధవరావు.

తలవంచుకు వుండిపోయింది సుశీల.

"సిగ్గులేదూ! నన్ను ఉత్తరం రాయమనడానికి. ఓ శ్రీశ్రీశ్రీ మామగారూ దయచేయండి మీ సుపుత్రికా రత్నం ఉద్ధరించింది అని. మళ్లీ ఆ ప్రసంగం తేకు నాకు చికాకు!''

అని కోపంతో అన్నాడు.

అతని ధోరణి చూసి నిస్పృహతో వస్తున్న దుఃఖాన్ని దిగమింగుతూ వుండిపోయింది!

కానీ సుశీల మనసులో మధనపడుతూ వుంది! ఈ వార్త ఎట్లాగయినా తల్లిదండ్రులకు తెలియపర్చాలన్న కోర్కె ఆమెలో ఎక్కువ కాజొచ్చింది!

ఒకనాడు భర్త బయటకు వెళ్ళడం చూసి తలుపులు వేసుకుని తండ్రికి వుత్తరం వ్రాసింది. దానిని జాగ్రత్తగా ఎవరికీ కనబడకండా దాచి వుంచింది.

సుశీల వస్తున్నపుడు, తండ్రిని అడిగి తెచ్చుకున్న కవర్లు అవి. ఎడ్రసు రాసే వున్నాయి. వాటి అవసరం యిన్నాళ్ళూ పడలేదు. ఈనాడు ఒక కవరును తీసి ఉత్తరం పెట్టి అంటించింది.

పొరుగింటి అబ్బాయి పన్నెండేళ్ళ వాడొకడు, రోజూ తన యింటిముందునుండే స్కూలుకి వెళుతూంటాడు. వాడిని పిలిచి కవరు పడేయమని బతిమాలాలి! అను

కుంది.

అత్తగారు అవతల వంట పనిలో వుంది, మామగారు ఏదో పుస్తకం పట్టుకు కూర్చున్నారు. తోటికోడలు చుట్టుపక్కలలేదు. భర్త ఎవరో స్నేహితుడొస్తే అతనితో వెళ్ళేడు. అదే సమయంలో ఆ అబ్బాయి బడికి వెళ్తుంటే చూసి దగ్గరకు రానిచ్చి మెల్లగా పిలిచింది. ఎప్పుడూ పిలవని ఆమె అట్లా పిలిచేసరికి, ఆ కుర్రవాడు బితుకు బితుగ్గా వెళ్ళేడు. ఆ వుత్తరం వాడికిచ్చి పోస్టులో వెయ్యమని చెప్పింది.

ఇంతలోనే ఎక్కడనుండి వచ్చేడో మాధవరావు సైకిల్ దిగి అది చూశాడు.

సుశీల అతడిని చూసి బిక్కమొహం వేసింది.

"ఏమిటది? " అని అంటూ ఆ కుర్రవాడి చేతిలోంచి ఆ కవరు లాగేసుకున్నాడు మాధవరావు.

ఆ కుర్రవాడు భయంతో పారిపోయాడు!

మాధవరావు ఎడ్రసు చూసి అన్నాడు, "ఏం అంత రహస్యం ఎందుకు నాకు చెపితే నే పోస్టు చెయ్యనా? "

సుశీల ఏం జవాబు చెపుతుందీ.

"ఇందులో రహస్యం ఏముంది? ఆ కుర్రవాడు కనబడగానే వేగిరం పోస్టు చేస్తాడని యిచ్చాను!"

"చాల్లే వూరుకో!" అంటూ ఆ వుత్తరం చేత్తో పట్టుకుని రంయ్‌మని యింట్లోకి వెళ్ళిపోయాడు.

"ఏమిట్రా నాయనా! అంటున్నావు!" అని అడిగింది ఎదురు వస్తూ కామాక్షమ్మ.

"ఏముంది? నేను ఉత్తరం రాయలేదని వాళ్ళ వాళ్లకు తనే రాసుకుంది. పక్కింటి చంద్రాన్ని పిలిచి, వాడిచేత దొంగతనంగా పోస్ట్ చేయిస్తూంది"

"అవ్వా! అంతవరకూ వచ్చింది! ఏం అంత ఖర్మేంవచ్చింది. ఏదో రహస్యం లేకపోతేనూ! ఇలాగే యిక్కడి విషయాలు చేరవేస్తూంది అన్నమాట!"

ఆ మాటలు విని సహించలేకపోయింది సుశీల.

"ఎందుకలా మాటలంటారు? నాకేమీ రహస్యాలు లేవు. నేనేం దొంగతనంగా, చాటుమాటుగా, ఏమీ రాయలేదు. కావలిస్తే చదివి చూసుకోండి" అంది.

"నోర్మూయ్!" అంటూ మాధవరావు ఆ కోపంలో ఒక్క లెంపకాయ వేశాడు.

"ఎంత జాణవయినావ్!" అంటూ బుగ్గ మీద పొడిచింది కామాక్షమ్మ.

"మంచిది మంచిది మా కోడలంటే... బాగానే వుంది వరస!" అంటూ కాశీపతి అందుకోసమే వచ్చినట్లు అని మళ్ళీ వెళ్లిపోయాడు.

"నాకూ అయిందిలే నీకు జరిగిన మహోత్సవం!" అన్నట్టు మాలతి ఒక సానుభూతి చూపు చూసి వూరుకుంది.

ఆ ఉత్తరాన్ని ముక్కముక్కలు చేసి పొయ్యిలో పడేశాడు మాధవరావు. సుశీల హృదయం భగ్గున మండింది. అలాగే కళ్ళ నీరుతో కూలబడిపోయింది. యింక ఆ ఆశ కూడా పోయింది. తన సంగతి తనవాళ్లకు తెలిసే అవకాశమే లేదు! ఏం చేయగలదు!

సుశీలకు వేవిళ్ళు ప్రారంభమయినాయి. ఏదీ నోట పోదు, చిక్కిపోయింది. శరీరం తెల్లగా పాలిపోయినట్టయింది. ఎన్నెన్నో వింత కోర్కెలు కలుగుజొచ్చేయి. వేరుసెనక్కాయలు తిందామని మహాకోరిక కలిగేది.

రోజూ బడిపిల్లలు స్కూలునుండి వచ్చేటప్పుడు తింటూ పోతుండేవారు. బండీవాడు శనగ పలుకులమీద నిప్పుపిడతలు పెట్టి కొన్నవారికి, వాటిమీద నిమ్మకాయపిండి, కారం గుండజల్లి వేడివేడిగా పెడుతూవుంటే, నోరు వూరేది.

అలా చూస్తూ, కోర్కె చంపుకొనేది. తప్పితే ఎవరు కొనిపెడతారు? తెగించి కొనుక్కుందామన్నా డబ్బు ఎక్కడిది? వున్నా ఇంట్లో ఏమంటారో? అన్న భయం.

అడుగుదామంటే మొహమాటం! తనకేం కావాలో ఏమిటో అడిగేదెవరు? ఎవరికి తనమీద అంత ఆప్యాయత? భర్తకు అటు వంటి ఉద్దేశ్యమే వున్నట్టు లేదు, ఇంక ఎవరు తీరుస్తారు?

ఈ కోర్కెలన్నిటికీ ఏమి? ఎలాగో మానుకోగలదు. కాని తల్లినీ, తండ్రినీ చూడాలన్న కోర్కె ఆమెకు ఎక్కువయింది. అవి కలలో కూడా జరగవేమో అని బెంగ పట్టుకుంది. కనీసం తనిలా వున్నదని వాళ్ళకు తెలియనన్నా తెలియదుకదా. తెలిస్తే తన తల్లినయినా పంపివుండేవాడు నాన్న అనుకుని ఏడ్చేది.

కాని ఓదార్చేవారు ఎవరు? ఇలాంటి సమయంలో, ఎంతో ఉత్సాహంగా, ఆనం దంగా వుండవలసిన సుశీల అంత దైన్యం గానూ, అంత విచారంగానూ తయార యింది. తిన్నావా లేదా? అని అడిగేవార యినా కాదు. కాస్త తిన్నది కూడా వాంతి చేసుకుంటే అయ్యో అన్నవారు కూడా లేరు, ఏది తింటే సహిస్తుందో అది చేసి పెట్టేవారు అంతకన్నా లేరు. ఆమె పరిస్థితి. అలాగ యింది. ఆఖరికి "ఎందుకొచ్చింది కడుపు" అని తిట్టుకొన్న సమయాలూ వచ్చేయి!

ఒకనాడు అకస్మాత్తుగా సుశీల మేన మామ వేణూ వాళ్లింటికి అనుకోకుండా వచ్చేసరికి ఆ ఇంటి వాతావరణం తాత్కాలి కంగా ఆ కాస్సేపూ మారింది.

సుశీల పెళ్లిలో ఆ మూడు రోజులూ, వేణుని అందరూ చూశారు, మాధవరావు పరిచయం కూడా అయింది. ఆ తర్వాత ఇప్పటివరకూ మళ్లీ కలుసుకునే అవకాశం కలగలేదు. అంచేత వేణు రావడం ఆశ్చ ర్యంగా ఉంది వీళ్లకు.

కాశీపతి చెట్టంత మనిషిని ఏమీ అనలేక మర్యాద కోసం 'రండి రండి' అని వరం డాలో కూర్చోబెట్టాడు.

తర్వాత వరుసగా అందరూ వచ్చి చూశారు, గాని ఎవరూ వరస పెట్టి పలకరిం చలేదు.

వేణు అవస్థ వర్ణనాతీతం.

"నేనెందుకు వచ్చానా భగవంతుడా" అని అనుకున్నాడు.

ఏదో అడిగేసి వచ్చినదారంటే జారుకో వాలా? లేక తన నామగోత్రాలు బంధుత్వం చెప్పుకోవాలా? తోచలేదు.

అయినా తనదే తప్పు, ఏదో పనివుండి ఆ వూరు వచ్చేడు. వచ్చి తన మేనమామ ఇంటికి వెళ్లిపోయాడు. దిగినవాడు తనపని చూసుకునిపోక, మేనకోడలు వుందికదా. చూసిపోదాం, యోగక్షేమం తెలుసుకు పోదాం అనే సద్భావంతో వచ్చేడు.

కాని ఇంత వేగిరం వీళ్ళందరూ మరచిపో తారని అనుకోలేదు. ఏమో పెళ్లిలో అందరి మొహాలతోపాటు, తననీ చూశాడు ఆ తర్వాత లేడాయె. అంత జ్ఞాపకం వుంటుందా! అని సమాధానపర్చుకున్నాడు.

ఇంతకీ తన మేనకోడలు అప్పటివరకూ కనబడదేం? ఆమె ముందు చూసివుంటే ఈ తంటా లేకపోను. అని అనుకుంటూ వుండగా, మాధవరావు వచ్చేడు. వేణు అతడిని అవలీలగా పోల్చుకున్నాడుగానీ అతను మాత్రం పోల్చలేదు.

"మీరు... మీరు..." అని నీళ్లు నమి లాడు.

మిగతావాళ్లకు తెలియకపోవచ్చుగాని, మాధవరావు తనతో ఆ మూడురోజులూ కలిసి తిరిగినవాడు, ఇంత వేగిరం మరచి పోయాడంటే ఎలా నమ్మటం!

వీళ్ళందరూ ఎందుకోగానీ, అలా నటిస్తు న్నారనిపించింది. అందుచేత తనూ తెలియ నట్టే నటించి తప్పుకుందామని అనుకుంటూ వుండగానే-

మాధవరావు అన్న కృష్ణారావు అక్కడకు వచ్చి ఆశ్చర్యపోయి జ్ఞాపకం తెచ్చుకున్నట్టు.

"అరె! మీరు వేణుగారు కదూ? " అన్నాడు.

"అలా చూస్తావేమిరా? మాధవ్, ఈయన సుశీల మేనమామగారు వేణు గారు! జ్ఞాపకం లేదూ" అని అడిగాడు.

అలా అనగానే జ్ఞాపకం వచ్చినట్టు?

"అరె అవునుకదూ! ప్లీజ్ ఏమీ అనుకోకండి. గుర్తు రాలేదు" అన్నాడు మాధవరావు.

"దాని కేంలెండి! మనం కలుసుకున్నదేదీ?" అనేసేడు వేణు. ఆ విషయం అప్పుడే తెలుసుకున్నట్టు కాశీపతి, కామాక్షమ్మ.

"అయ్యో ఎంతపని అయింది. ఏమీ అనుకోకు నాయినా! ఇలా వున్నాయి మన బంధుత్వాలు... చెప్పుకుందుకే సిగ్గు! పెళ్లి అయిన దగ్గర్నుండి రాకలా పోకలా! దగ్గిర వాళ్లని కూడా పోల్చుకోలేని పరిస్థితి వచ్చింది. ఎవళ్లు ఎవరో ఏమిటో చెప్పారా ఏమన్నానా? పెళ్లి చేసినంతవరకూ ఆ విషయాలు, ఆ వాగ్దానాలూ, ఆ తర్వాత కన్న కూతురు కూడా ఏమయిందీ అక్కర్లేదు. ఏం చెప్పడం!"

"అమ్మా వూరుకో ఇప్పుడెందుకవన్నీ... కానీ, ఫలహారం సంగతి చూడు" అని అన్నాడు కృష్ణారావు.

"అయ్యో! నా మతిమండ, అలాగే నాయనా, ఏమిటో అలా అనిపిస్తుంది, ఆశలూ, అభిమానాలూ తలుచుకుంటే. పోనీ నీకయినా మేనకోడల్ని చూడాలని ఆపేక్ష వుంది. అంతే చాలు. కన్నవారికి లేకపోయినా" అని అంటూ వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

ఆ తర్వాత అందరూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడడం మొదలెట్టేరు.

మాధవరావు "సుశీలా, సుశీలా" అని పిలుస్తూ "ఎవరొచ్చారో చూడు... ఇట్లారా సుశీలా!" అని ఎంతో ప్రేమతో పిలిచాడు.

సుశీల మెల్లగా వచ్చింది.

మేనమామను చూసి ఆశ్చర్యపోయింది. ప్రాణాలు లేచివచ్చినట్లయింది ఆమెకు.

నీరసంగా వున్న సుశీలను చూసి వేణు ఆశ్చర్యంతో ఆలోచనల్లో పడ్డాడు.

"అందరూ కులాసాగా వున్నారా?" అని అడిగింది. ఇంతలో "సుశీలా! సుశీలా!" అని లోపలనుండి కేక వేసింది కామాక్షమ్మ.

"వస్తున్నానండీ" అని సుశీల అనీ అనకం డానే.

"రావమ్మా... సుశీలా ఏం చేస్తున్నావు. ఇదిగో టిఫిన్ పట్టుకు వెళ్లు మామయ్యకు" అని పిలిచింది కామాక్షమ్మ.

సుశీల గాభరాతో, లోపలికి వెళ్లగానే లోపల అత్తగారేదో గుసగుసలాడింది.

మరో పది నిముషాల్లో సుశీల టిఫిన్ తెచ్చింది. అప్పుడు వచ్చిన సుశీలను చూడగానే వేణు ఆశ్చర్యం ఇనుమడించింది.

కళ్లు పెద్దవిచేసి ఏమిటిది అన్నట్టు చూశాడు.

"ఇంతకన్నా ఏం చెప్పేది? ఎలా చెప్పేది?" అన్నట్టు తలదించుకొని వూరుకుంది.

మొదట వచ్చిన సుశీల నిజమయిన సుశీల, ఇప్పుడు వచ్చిన సుశీల తయారయిన బొమ్మ. చీర మార్చుకొని, పౌడరు అద్దుకొని, మేకప్ అయి తలదువ్వుకొని లేని సంతోషాన్ని పెదవులమీదకు తెచ్చుకొని వచ్చింది.

అదే వేణుకు అర్థం కాలేదు.

ఒకే ప్లేటు చూసి "మీరో" అని మాధవరావుని అడిగాడు వేణు, మర్యాదకు టిఫిన్ ప్లేటు అందుకుంటూ.

"అబ్బే లేదండీ! మీరు తీసుకోండి, మేం ఇప్పుడే తిన్నాం" అంటూ "సుశీ నువ్వు మాట్లాడుతూ వుండు. నేనిప్పుడే వస్తాను" అని చెప్పి అవతలకు వెళ్ళాడు.

కావాలనే ఆ ఏకాంతం కలగజేసినట్లుంది గానీ సహజంగా అనిపించలేదు వేణుకి.

తనకూ సుశీలకూ ఏకాంతం ఏమిటి?

తను తెలుసుకోవలసింది, మాటాడేది,

ఆమె యోగక్షేమం మాత్రమే. దానికోసం ఒంటరిగా వుండనక్కర్లేదు, అంతకన్నా రహస్యం ఏముంటుంది? అయినా సుశీల వాలకం చూస్తే ఏదో అనుమానం కలుగుతోంది. అడుగుదామా? అని అనుకున్నాడు వేణు.

కాని ఏం బావుంటుంది? అయినా సుశీల తన భర్తావాళ్ళమీద చెబుతుందా?

ఇట్లా అవకాశం ఇచ్చినవాళ్ళు తప్పకుండా ఏ గోడపక్కనుండో చాటుగా వింటూనే వుంటారు.

"ఏం సుశీలా బాగున్నావా?" అని మాత్రం అడిగాడు. అట్లా అడగ్గానే సుశీల జవాబు చెప్పకండానే కళ్ళెత్తి చూసింది... వేణు గుండె పగిలిపోయింది.

సుశీల కనులనిండా నీరు! ఎంత దుఃఖాన్ని ఆ కళ్ళలో దాచుకున్నదో! ఎన్నో చెప్పాలనుకున్న మాటలు, ఆ పెదిమల వెనక పైకి రాలేక భయపడి దాగున్నాయో! ఆ భయానికే కాబోలు పెదిమలు వణుకుతున్నాయి.

ఆ జాలి చూపులు వర్ణనాతీతం

చాలు. ఆమె చెప్పవలసినదేదో చెప్పింది. గ్రహించుకొనేవాడికి అదే చాలు. "ఆమెకు అక్కడ తృప్తిలేదు" అని గ్రహించడానికి వేణుకి అట్టేసేపు పట్టలేదు. కాని అదెలాటి అసంతృప్తో మాత్రం తెలియలేదు.

ఇంతలో ఓ పదేళ్ళ పిల్లవచ్చి

"ఒదినా జడ వేసిపెట్టవా?" అని ఎంతో చనువుగా అడిగింది. సుశీల ఇంకా ఏమీ అనకండానే లోపలనుండి "బావుందే లలితా! వదిన మాట్లాడుతూవుంటే తప్పు కదూ. అలా అడగవచ్చా? ఇవాళ్టికి పెద్ద వదినచేత వేయించుకో" అంది కామాక్షమ్మ. రోజూ సుశీల ఆ పిల్లకి జడ వేస్తున్నట్టు.

ఆ వెనకే సుశీలకన్నా పొడుగ్గా, పలుచగా, తెల్లగా వున్న ఒకామె వచ్చి "రా అమ్మా! నే వేస్తాను" అని ఆ పిల్లను తీసుకువెళ్ళింది. ఆమె సుశీల తోటికోడలు మాలతి అని పోల్చుకున్నాడు వేణు. సుశీల చిన్నమరిది రాము కూడా అదే సమయానికి వచ్చి "వదినా ఒక పిన్ను వుంటే ఇవ్వవూ?" అని అడిగేడు ముద్దుగా. సుశీల ఇచ్చింది.

ఆ తర్వాత మాధవరావు నవ్వుతూ వచ్చేడుకానీ, జైల్లో వున్నవారిని ఎవరయినా చూడడానికి వస్తే కాస్త టైమ్ యిచ్చి, ఆ గడువు కాగానే సిపాయి తయారయినట్టు అనిపించింది, అతని వాలకం.

సుశీల ఏమయినా చెబుతుందేమో అనుకున్నాడు వేణు. కాని వాళ్ళు అందరూ ఆ చుట్టు పక్కలే తిరుగుతున్నారు.

చూశానుకదా అని తృప్తిపడ్డాడు.

"ఇంక వెళతానండి" అని లేచాడు వేణు.

"అదేమిటి! ఇప్పుడే వచ్చి వెళతారా? ఈ పూట మా ఇంట్లో వుండి వెళ్ళాలిగాని!" అని అన్నాడు మాధవరావు.

"లేదండి. మామయ్యా వాళ్ళూ నా కోసం చూస్తూవుంటారు. పనివుండి ఈ వూరు వచ్చాను. మళ్ళీ వెళ్ళిపోవాలి" అన్నాడు.

"అమ్మా! వేణుగారు వెళ్ళిపోతారంట" అని అన్నాడు.

"అదేం నాయనా! ఈ పూట వుండి వెళ్ళు. వచ్చి పోతూంటేనే బంధుత్వం!" అంది కామాక్షమ్మ.

"మళ్ళీ వస్తాలెండి" అని మొహమాట పడ్డాడు.

"అలాగంటే ఏమనగలం? ఈసారి మాత్రం తప్పకుండా రావాలి. మీరొక్కరే కాదు. కోడలిని కూడా తీసుకురావాలి. నెల తప్పింది కూడాను. సుశీలను చూస్తుంది. కన్నవాళ్ళు ఎలాగూ ఖాతరు చేయలేదు" అని మళ్ళీ ఎత్తీ ఎత్తనట్టు అంది.

"అలాగా చెప్పేవు కాదేం! సుశీలా" అని నవ్వుతూ సుశీలవైపు చూశాడు వేణు.

సుశీల నవ్వుతూ ఊరుకుంది.

"ఏం చెబుతుంది నాయనా! ఎంతయినా ఆడపిల్ల కదా! పెళ్ళిచేసి మాతో ఇలా పంపించారా! అంతే మరి తిరిగి చూడలేదు. నాలు గయిదు ఉత్తరాలు వ్రాయించినా వాటికి



జవాబయినా లేదు. మరి మేమేం నేరం చేశామో! పోనీ మేమంటే గిట్టకపోయినా కన్నకూతురిమీదయినా వుండొద్దా! ఇంకా కొత్తకదా, ఆ పిల్లకి పైకి చెప్పకపోయినా వాళ్ల వాళ్లని చూడాలని వుండదూ! అందులోనూ ఇలాటప్పుడు? ” అని మొదలెట్టింది కామాక్షమ్మ. వేణుకు ఆశ్చర్యం వేసింది.

కొండలరావు సంగతి తనకూ తెలుసును కాబట్టి అది నిజమే అనుకున్నాడు.

“తెలిసే వూరుకున్నారా? ” అన్నాడు.

“పోనీ చూడు నాయనా దాని ముఖం అలా మనోవ్యాధి పెట్టుకుని ఏడుస్తూ వుంటుంది? ఎందుకే తల్లీ! ఈ సమయంలో అలా వుండకూడదు. హెచ్చరికగా వుండాలి? వస్తారులే! నీకేం తక్కువ మేమందరం వున్నాం అంటే వినదు. పాపం! ఎప్పుడూ అదే ఆలోచన” అంది కామాక్షమ్మ.

“పోనీలేవే అతనితో ఎందుకు ఇవన్నీ. వాళ్లకు, వాళ్ల పిల్లమీద అభిమానం వుంటే వాళ్లే వస్తారు” అన్నాడు కాశీపతి.

“అక్కడికీ ఏం తల్లీ, మీ వాళ్లను చూడాలని వుంటే చెప్పు ఎవరో ఒకరం తీసుకువెళ్లి దిగబెడతాం. వాళ్లు వచ్చి తీసుకువెళ్లకపో

తేసేం అని కూడా అన్నాం. కాని ఏమీ చెప్పను" అన్నది కామాక్షమ్మ అభిమానం ఉట్టిపడుతున్నట్టు.

"అవునమ్మా సుశీలా మనసులో వున్న దేదో చెప్పకపోతే వాళ్లకు మాత్రం ఏం తెలుస్తుంది. నువ్వలా విచారంగా వుండకూడదు. నేవెళ్లి చెబుతాలే. మరి బాధపడకు! సంతోషంగా వుండు" అని వేణు, వాళ్లన్న వన్నీ నిజమనుకొని అన్నాడు.

అదంతా వింటూ నిశ్చేష్టురాలై నిలబడింది సుశీల. ఎంత ధైర్యంగా, నిజాన్ని కప్పిపెట్టి, అబద్ధాలు చెబుతున్నారో. అని అనుకొని లోలోపల అసహ్యించుకున్నది.

పైకి మాత్రం ఏ భావాలూ కనరానీకండా ముభావంగా వూరుకుంది.

"ఇంక వెళతానండీ!" అంటూ పరిపరివిధాల ఆలోచించుకుంటూ లేచాడు వేణు.

అయితే, వేణు చెప్పినా కొండలరావు అంతగా పట్టించుకోలేదు. "ఏమంత కొంప మునిగింది గనుక, మొగుడు దగ్గరే వున్నది గాని అడవిలో లేదుకదా" అనుకున్నాడు.

కాని, భార్య పార్వతికి అప్పటినుండి మరి నిద్రాహారాలు లేవు. కూతురిని చూసి వద్దాం, తీసుకువద్దాం అని పోరుతున్నా కొండలరావు స్వల్ప విషయం కింద జమకట్టేశాడు. ఉత్తరం వ్రాశారా! ఏమయినా జవాబు వచ్చిందా? అని రోజూ అడిగేదామె.

నిజానికి అతను ఉత్తరం వ్రాయకపోయినా ఆమె బాధపడలేక వ్రాసేనని అబద్ధం ఆడేడు. పార్వతి అల్లునికే కోపం వచ్చి జవాబు వ్రాయలేదనుకుంది.

తన తమ్ముడు వచ్చి ఈ కబురు చెప్పాక, భర్త ఏమన్నాసరే, ఎదిరించి కూతుర్ని తీసుకురావాలని నిశ్చయించుకుంది.

"నాకు మాత్రం ఇష్టం లేదా పార్వతీ! ఏమిటో అవకాశం లేక అవలేదుగానీ" అన్నాడు భర్త.

"పిల్లనిచ్చుకున్నవాళ్లం. వాళ్లు అలాగే అనుకుంటారా? అయినా ఇన్నాళ్లయింది, తిరిగి చూడనయినా చూడకపోతే అన్నారంటే అనరూ? "

"ఏమంత తప్పుపని చేశామని? "

"మీ మాట మీదేగాని, లోకం, లౌక్యం, అక్కర్లేదు. పెళ్లిచేసి ఏనాడు పంపించామో ఇంతవరకూ పిల్లని ఇంటికి తీసుకురాలేదు. ఎలా వుందో, ఏమిటో, మంచీ చెడ్డా కనుక్కున్న పాపాన్ని పోలేదు" అని కళ్ళంట నీళ్లు పెట్టుకుంది.

"అవన్ని ఇప్పుడెందుకు! గతజలసేతు బంధనం- ఇలా వుందని అల్లుడయినా ఒక ముక్క వ్రాసి పడేస్తేనేం? "

"ఏ మొహం పెట్టుకొని వ్రాస్తాడు. మనం వ్రాసేం గనుకనా? నన్ను మభ్యపెట్టడానికి మీరు అలా అనివుంటారు అంతే!"

"సరేలే! అయిందేదో అయింది. మంచి రోజు చూసి వెళ్లి తీసుకువస్తాను" అని అన్నాడు.

ఈ మాటలు విన్న పార్వతి సంతోషించినా భర్త ఒక్కడూ వెళ్ళివస్తే రసాభాస తప్పదని భావించింది. అసలే అభిమానం గల మనిషి. ఒక్కమాటంటే సరి అవతల వాళ్లు ఎవరయినా పడేతత్వంకాదు. వెళ్లేది అల్లుడింటికి. ఇన్నాళ్లయి తిరిగి చూడనందుకు వాళ్ళకు పీకలబంటి కోపం వుండివుంటుంది. ఏమయినా అనకమానరు. అందువల్ల కొండలరావు ఒక్కడూ వెళ్తే కార్యం చెడకమానదు. కాబట్టి తనూ వెళ్లడానికి నిశ్చయించుకున్నది.

"నేనూ మీతో వస్తాను తీసుకువెళ్లండి" అంది.

"ఈ పరిస్థితుల్లో నీవెందుకు? మళ్లీ జబ్బు తిరగవేస్తుంది. ఎలాగూ ఇక్కడకు వస్తుందిగా" అన్నాడు.

"నాకేమీ ఫరవాలేదు. నామాట కాదనకండి. ఎందుకు చెబుతున్నానో వినండి.

# ఏరిన ముత్యాలు

☆ అభిప్రాయాలను ప్రశ్నించే వ్యక్తి తెలివి కలవాడు. వాస్తవాలతో పోట్లాడే వ్యక్తి మూర్ఖుడు.

-ఫ్రాంక్ ఏ. గార్మంట్

☆ విశ్రాంతి అనే తియ్యదనం, శ్రమ అనే చేదునుంచి లభిస్తుంది.

-అల్జీరియన్ సూక్తి

☆ సమర్థతకు పాఠశాల లేదు.

-టర్కీ సామెత

☆ సంగీతం- ధన సంపాదనకు, ప్రజల్ని వినోద పర్చేందుకు కాదు. అది భగవంతుని చేరుకునేందుకే.

-ఉస్తాద్ అలీ అక్బర్‌ఖాన్

☆ చెడు చింతనతో కూడిన మాటలను తవ్వి తీసేవాడు తన మానసిక శాంతిని కోల్పోతాడు.

-సెనెకా

☆ తనకు దొరికిన అవకాశాలకన్నా, ఎక్కువ అవకాశాలను ఏర్పరచుకొనేవాడే వివేకి.

-జార్జ్ హెర్బర్ట్

☆ మర్యాద, ఓర్పు ఒక మంచి మనిషికి వుండవలసిన ఉచిత లక్షణాలు. వీటిని మించిన మంచి లక్షణాలు లేవు.

-సిసెరో

☆ వివేకి మనసుకి కళ్ళెం వేయగలడు. మూర్ఖుడు మనసుకి బానిస అవుతాడు.

-లిలియన్ సిరన్

☆ మీ పేరు మలినం గాకుండా వుండాలంటే, గుణవంతులతో తిరగండి.

-జార్జి వాషింగ్టన్

☆ ఏదో రూపంలో త్యాగం చేయకుండా ప్రపంచంలో ఎవరైనా, ఎన్నడైనా శాశ్వత ఫలితాలు సాధించలేరు.

-ఆర్థర్ హెల్ప్స్

☆ పులిని, మేకను ఒకేచోట వుంచి రెండింటికి కూడా సమానంగా స్వతంత్రం అనుభవించే హక్కు వుందంటే, మేకకున్న స్వతంత్రం మనం అర్థం చేసుకోలేనిది కాదు.

-లింకన్

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూన్ చతుర నవల కాలిన కలలు ..............................

**సమీక్షకుని పేరు:** ..............................

**చిరునామా:** ..............................

..............................

..............................

..............................

నన్నూ తీసుకువెళ్ళండి"

కొండలరావు ఆలోచించాడు- పార్వతి కూడా రావడం మంచిదేనేమో! తనకా ఎలా మాట్లాడాలో తెలియదు.

"అయితే సరే. మళ్ళీవారం బయలు దేరుదాం" అని చెప్పి వెళ్ళిపోయాడు.

పార్వతికి సగం ఆరోగ్యం చేకూరినట్టు అయింది. శరీరంలో ఎక్కడలేని ఓపిక, సంతోషం కలిగింది. ఉత్సాహంగా ప్రయాణ సన్నాహం చేసింది.

వస్తున్నట్టు ఉత్తరం వ్రాసి ఇద్దరూ బయ లుదేరారు.

వీళ్లను ఎదుర్కొందికి ఎవరూ స్టేషనుకు రాకపోయేసరికి తమకు అల్లుని ఇంట్లో జర గబోయే స్వాగతం ఎలా ఉందో అర్థమ యింది కొండలరావుకు.

అయినా తప్పదు! పిల్లనిచ్చుకున్నాక తన చెయ్యికింద. వారి చెయ్యిమీద! అన్నిటికీ తలొగ్గి వుండవలసిందే అనుకుని ఎలాగో వారి ఇల్లు చేరుకున్నారు.

వీళ్లు వస్తారని తెలిసినా తలుపులు కూడా తెరిచివుంచలేదు. గుమ్మంలో రిక్షా ఆగిన చప్పుడు విన్నా ఎవరూ ఇవతలకు రాలేదు. లోపల కిటికీలోనుండి నాలుగయిదు ముఖాలు చూసి, నీడల్లా తప్పుకున్నాయి ఎరగనట్టుగా ఎవరూ బయటకు రాలేదు.

కొండలరావు ఎన్నడూ ఇలాటి అవమా నాన్ని ఎదుర్కొనలేదు. తల తీసినంత పని అయినా తమాయించుకుని లోలోపలే కోపంతో కుమిలి వూరుకోక తప్పలేదు. "చూశావా? వచ్చేమని తెలిసినా ఎవరూ తలుపు తీసి బయటకు రాలేదు" అన్నాడు పార్వతితో.

ఇలా జరుగుతుందని పార్వతి వూహిం చింది. భర్తకు కోపం వస్తే వెనకా ముందూ చూడకుండా, ఏంచేస్తాడో అన్న భయంతో జాలిగా అతనివైపు చూసింది. "పోనీలెండి ఇంత మాత్రంలో మనకు తక్కువయిపో యిందేదీ లేదు. మన అవుసరం! దేనికొ చ్చామో ఆ పని చేసుకుపోదాం. నా కోసం కోపం తగ్గించుకోండి" అంది మెల్లిగా.

"హుఁ! ఖర్మ!" అని అనేసి కొండలరావు మరేం జవాబు చెప్పలేదు. మెల్లగా గుమ్మం ఎక్కి తలుపు తట్టేడు.

కాశీపతి తలుపు తీశాడు.

"ఓహో! బావగారు" అని అనలేదు.

అకస్మాత్తుగా ఊహించరానిది చూసినట్టు నోటమాట రానట్టు అలా వుండిపోయాడు. అయినా తర్వాత.

"రండి" అని పిలిచి లోపలకు తీసుకువెళ్ళి కూర్చోబెట్టేడు.

కొంతసేపటికి కామాక్షమ్మ కొంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది. "ఇన్నా ళ్లకయినా ఏ దారి తప్పో ఇలా జ్ఞాపకం వచ్చి వచ్చినట్టుంది" అని నొక్కుతూ అన్నది.

"ఎంత మాటన్నారు? ఏదో అవకాశం లేక అలా అయిపోయిందిగాని" అన్నాడు కొండలరావు.

"ఏవో మా వల్ల తప్పులుంటాయి. అంత మాత్రంలో కోపాలు తెచ్చుకుంటే ఎలాగు? మనసులో వుంచుకోకండి" అంది పార్వతి.

భార్య అలా బ్రతిమాలుతూ మొదలెట్టడం విన్నాక కొండలరావుకి వళ్లు మండిపో యింది.

"ఏదో తప్పు చేసినట్టు ఏమిటా ప్రారబ్ధం" అనుకొని కొరకొరా చూశాడు భార్యవైపు.

పార్వతి కళ్లనీళ్లతో "వూరుకోండి" అన్నట్టు సంజ్ఞ చేస్తూనే, లోపలికీ పెరటివైపూ చూసింది.

అక్కడ బట్టలు పిండి ఆరవేస్తూ సుశీల కనిపించింది. సుశీల వైఖరి చూసి ఆమెకు కడుపులో దేవుకుపోయింది. మొదట పని మనిషనుకున్నదిగానీ, కాదు, తన కూతురే అని తెలుసుకుని విస్తుపోయింది, ఇలా కని పించి అలా మాయమయిపోయింది సుశీల!

ఎప్పుడు చూద్దామా? ఎప్పుడు మాట్లాడు

దామా! అని ఉవ్విళ్లూరుతున్న పార్వతి ఇంక ఓర్చుకోలేకపోయింది.

"అమ్మాయి ఎక్కడ? " అని అడిగింది.

"అమ్మాయికేం! పెళ్లి చేశాక బాధ్యత తీరి పోయిందని మీరనుకుంటే మాత్రం మేమలా పూరుకోగలమా? " అని మొదలెట్టింది కామాక్షమ్మ.

దానికి ఎవరూ జవాబు చెప్పలేదు.

"అమ్మాయి... సుశీలా ఇలా రామ్మా" అని ఎంతో ఆప్యాయంగా పిలిచింది కామాక్షమ్మ.

ఇంతలో పది పన్నెండేళ్ల పిల్లవచ్చి- "వదిన పడుకుని వుంది లేపనా? " అని అంది.

పార్వతి ఆశ్చర్యానికి అవధి లేదు.

ఒక్క నిముషం కింద సుశీలను చూసింది నిజంకాదా? ఇప్పుడు పడుకొని వుండడం ఏమిటి? అనుకుంది.

"తీసుకురావే. మీ నాన్నగారూ అమ్మగారూ వచ్చారని చెప్పు" పార్వతికి ఏమీ అర్థం కాలేదు.

మరి కాస్సేపటికి సుశీల నవ్వుతూ వచ్చింది. అప్పటికప్పుడు చీర అదీ మార్చి కట్టుకొని, గబగబా తలదువ్వుకొని వచ్చినట్టు వున్న సుశీలను చూసి కొండలరావు ఆశ్చర్యపోయాడు.

కూతుర్ని చూశాక పార్వతి హృదయం వాత్సల్యంతో నిండిపోయింది.

"ఇలారా తల్లీ" అంటూ దగ్గరకు తీసుకుంది పార్వతి.

"అమ్మా" అంటూ సుశీల తల్లి ప్రేమలో కరిగిపోయింది.

ఇద్దరికీ కళ్లంట నీళ్లు తిరిగాయి. మూగగా ఆ తల్లి ఏమేమి అడిగిందో, మౌనంగానే ఆ పిల్ల ఏమేమి చెప్పిందో వారిద్దరికే తెలియాలి.

ప్రపంచాన్నే మరిచి, కొంతసేపు అట్లా వుండిపోయారు.

ఆ ఉద్రేకానికి పార్వతి తట్టుకోలేకపోయింది. ఆయాసంతో గుండెదడ రావడంలో అలానే అక్కడే పడుకోబోతూవుంటే గబగబా మంచంవేసి పడుకోబెట్టారు.

సుశీల తల్లి దగ్గరే కూర్చుని ఉపచారం చేయమొదలెట్టింది. కంటనీరు పెట్టుకుంటూనే!

"వద్దమ్మా! ఈ సమయంలో కంటతడి పెట్టకూడదు. నాకెప్పుడూ వున్నదేగా, నిన్ను చూశాను. ఇంక నాకే చింతా లేదమ్మా!" అని చేతులు పట్టుకుని అంది, పార్వతి.

కామాక్షమ్మ ఎవరూ చూడకుండా మూతి విరుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె వెనకే "ఆర్డర్స్" కోసం అనుసరించాడు కాశీపతి. ఇంక మిగిలినవారు తండ్రీ, తల్లీ కూతురూ.

"అమ్మా! ఎలాగున్నావు. మీ మామయ్య వచ్చి చూసి, చెప్పినప్పటినుండి నిద్రాహారాలు లేవనుకో" అంది తల్లి.

సుశీల కళ్లంట నీళ్లు తప్పితే నోటంట మాట రాలేదు.

"మీ ఆయనతో చెప్పమ్మా. నిన్ను పంపించమంటున్నాం అని నేనూ చెబుతాను!" అని కొండలరావు అన్నాడు.

ఇంతలో సుశీల ఆడపడుచు వచ్చి "వదినా అన్నయ్య రమ్మంటున్నాడు" అని చెప్పి వెళ్లిపోయింది.

సుశీల వెళ్లిపోయింది.

"ఇంట్లోనే వున్నాడా అల్లుడు? " అని ఆశ్చర్యపోతూ అన్నాడు కొండలరావు.

"పోనీలెండి, మీరే వెళ్లి పలకరిస్తేపోతుంది" అని అన్నది పార్వతి నీరసంగా.

"తప్పుతుందా? " అని కోపం అణుచుకుంటూ అన్నాడు కొండలరావు.

వాతావరణం ఎలా వుందంటే, మబ్బులు కమ్మిన ఆకాశంలా, ఏ నిమిషాన్న ఉరుములూ, మెరుపులూ వచ్చి వర్షిస్తుందో చెప్పలేమన్నంతగా వుంది.

మాధవరావు భోజనాలు దగ్గర మాత్రం దర్శనం ఇచ్చాడు. మామగారిని 'వచ్చారా'

అని మాత్రం పలకరించేడు.

తర్వాత ఎవరికివారే భోజనాలు సాగిస్తున్నారు, మౌనంగా.

కొండలరావు అన్నం కలుపుకుంటూ కదిపేడు.

"అమ్మాయిని తీసుకువెళతానోయ్"

"ఎందుకండీ మీకాశ్రమ, ఆపాటి మేమూ చూసుకోగలంలెండి!" అన్నాడు మామగారివైపు చూడకండానే.

"మొదటి పురుడు పుట్టింటివారు పోయడం ఆచారం. కాదనకు నాయినా!"

"తొమ్మిదో నెలలో వచ్చి తీసుకువెళ్ళడం కూడా ఆచారమే కాబోలు"

"అలా అయినందుకు నేను చాలా బాధ పడుతున్నాను, క్షమించండి. అయిందేదో అయింది. ఈసారికి మీరందరూ మన్నించి పిల్లని పంపుతారనే నమ్మకంతోనే అంతదూరంనుండి వచ్చేను. అందుకే వద్దంటున్నా జబ్బుతో వుండి కూడా పార్వతి వచ్చింది. కాదనకండి"

"పెళ్ళిచేసి ఏరోజయితే దిగబెట్టేరో... మరి పిల్ల సంగతి అక్కర్లేకపోయింది, ఇప్పటివరకూ" అంది కామాక్షమ్మ.

"అవును అందుకు మరేమీ అనుకోకండి. ఏదో అలా అయిపోయింది."

"అన్నీ అలాగే అయిపోతూ వుంటాయిలెండి! ఇవతలవాళ్ళు ఏమీ అనకుండా సర్దుకుపోతూవుంటే-"

"కాస్త ఆలస్యం అయింది అంతేకదా నాయినా! అంతకన్నా యింకేం తక్కువ చేశాం" అని అడిగేడు కొండలరావు కోపం ఆపుకోలేక.

"కోడలిని తెచ్చుకున్నాక ముద్దూ ముచ్చటా ఏమీ వుండవు కాబోలు. ఏమి తక్కువ చేశాం అని అడిగేకన్నా ఏమి చేశాం? అని ప్రశ్నించుకుంటే బోధపడుతుంది... ఓ సారా... ఓ చీరా... సీమంతమా? ఏంచేశారని? ఏదో దగ్గిర సంబంధం కదా అని సర్దుకుపోడంగాని మరో పాటి వారయితే తెలిసేది" అన్నాడు కాశీపతి.

దానికి కొండలరావు ఏదో అనబోతూండగా పార్వతి మెల్లగా నడచి వచ్చి, భర్తని వారించింది.

"అవునమ్మా, నిజమే మా వల్ల తప్పయిపోయింది, ఇలాటివి వస్తే సర్దుకుపోతారనే కదా దగ్గిర సంబంధాలు చేసుకోడం, అయిం దానికి క్షమించండి" అని సర్ది చెప్పింది.

"పెళ్ళిలోమాత్రం ఏంచేశారండి! జరపవలసిన లాంఛనాలు కూడా జరపలేదు. ఒక్కరోజు పెళ్ళి చేసేసరికే, వచ్చిన మా బంధువులంతా, ఇంత లోభత్వమా అని ముక్కుమీద వేలేసుకున్నారు" అన్నాడు కాశీపతి.

ఆ మాటలు వినేసరికి కొండలరావూ, పార్వతీ కూడా ఆశ్చర్యపోయారు. ఏదో వాళ్ళకు కలిగినంతలో పెళ్ళిచేశారు. ఈ ముక్క ఇప్పుడు వీరి నోటంట వినడమే తప్పితే మరెవ్వరూ అనలేదు.

"అదేమిటండీ అలాగంటారు, పెళ్ళిలో మేం ఎవరికి లోపం చేశామని.. సాధ్యమయినంత మట్టుకు ఎవరికీ ఏలోటూ కాకుండానే చూశాం, అంత గొప్పగా చేయలేదంటే ఒప్పుకుంటానుగాని-బాగా చేయలేదనడం మీకు సబబుకాదు, అయితే కార్యం అన్నాక ఎక్కడో ఓచోట లోటుపాట్లు వుండకతప్పవు. మాకు తెలియకుండా ఎవరికయినా ఏదయినా ఇబ్బంది కలిగిందేమో... అంత మాత్రంలో, ఇంతమాట మీరు అంటారనుకోలేదు" అన్నాడు కొండలరావు వూరుకోలేక.

"ఆం మీరే పొగుడుకోవాలి. ఒక్క ఖరీదయిన బట్ట పెట్టారా. పోనీ పెళ్ళికొడుక్కి ఎన్ని సూట్లు ఇచ్చేరు! పెళ్ళి పెద్దలకు అప్పగింతలపుడయినా జలతారు చీరలు పెట్టారా? ఇంకెందుకు అనుకుని, నేరక ఈ సంబంధం చేసినందుకు నోరు మూసుకొని వూరుకున్నాం..." అన్నది కామాక్షమ్మ.

"పోనీలెండి, ఎవరికి తగినట్లు వారు చేస్తారు, అంటే మమ్మల్నే అంటారుగాని మిమ్మల్నికాదుగా, అయిపోయిన వాటిని తవ్వుకొని స్పర్ధలు పెంచుకోవడం దేనికి" అంది పార్వతి.

"అంతేగాక ఇంకేం చేయగలం మీతో వియ్యమందినందుకు నలుగురిలోనూ మా మర్యాద ఇలా ఏడిసిందికదా " వుండబట్టలేక అంది.

"పోనీలెండి మీ అంతస్తుకు తగనివాళ్లం" అని కోపం దిగమింగుతూ అనేసేడు కొండలరావు.

"ముమ్మాటికీ నిజం మా అంతస్తెక్కడ, మీ అంతస్తెక్కడ" అని ఇంకా కోపంతో అన్నాడు కాశీపతి.

మాధవరావు అన్నిసార్లూ వూరుకున్నాడు, ఎవరినీ వద్దని అన్లేదు. కొండలరావు మనసు చివుక్కుమంది, పార్వతి నిశ్చేష్టురాలయి ఏడుస్తూ నిలబడిపోయింది.

నోటిలో పెట్టుకుంటున్న అన్నం చెయ్యి అలాగే కంచంలో కడిగేసుకొని గబగబా లేచిపోయాడు... కొండలరావు.

"ఇంతకూ మేమేమన్నామని, అలా లేచిపోతారు" అన్నది కామాక్షమ్మ.

"చాలు కడుపు నిండిపోయింది" అన్నాడు చేయి కడుక్కుంటూ కొండలరావు.

"ఉన్నమాటంటే వూరంత పౌరుషంట! అన్నా, అనకపోయినా వాళ్ల అమ్మాయి గౌరవం ఏమీ హెచ్చిపోదులే" అన్నాడు మాధవరావు.

"మా పిల్లకేం నాయనా? ఎన్నయినా మమ్మల్ని అను! బాగా పెళ్లిచేయలేదంటే ఒప్పుకుంటాం! పెట్టుపోతలు చాలలేదంటే ఒప్పుకుంటాం **అంతే**గాని మాపిల్లని ఎంచబోకు" అని అన్నది పార్వతి.

"ఆహాహా! మీ పిల్లను మీరు పొగుడుకోక ఏం చేస్తారు... మీకేం తెలుస్తుంది? అనుభవిస్తున్నవాళ్లం మాకు తెలుస్తుందిగాని! ఒక చదువా? సంధ్యా? ఒక చురుకా? అందమా? చందమా? చాలు మొహం మొత్తింది" అంది కామాక్షమ్మ.

"ఇవన్నీ ముందే చూసుకోవలసింది! ఇప్పుడనుకుంటే ఏంలాభం? " అన్నాడు కొండలరావు.

"మాకిలా రాసి వుంటే అలా ఎందుకవుతుందీ? " అన్నాడు కాశీపతి.

"చదువు లేదన్నారు బావుంది... మాకు అవకాశం లేక చెప్పించలేకపోయాం! యింక మిగతా విషయాల్లో మీరు పెట్టిన వంకలు సహించలేము!"

"సహించకపోతే ఎవరికి కావాలి? మీకంత కోపం అయితే పిల్లను ఎలాగూ తీసుకువెడుతున్నారుగా అక్కడే అట్టిబెట్టుకోండి? ".

"అదేమిటి? అలా ఒకదానికొకటి అంటారు, మాయింట్లో వుంచుకొనేందుకేనా పెళ్ళిచేసింది? ".

"మరి అంత పౌరుషం ఎందుకు? ' అన్నాడు మాధవరావు.

"ఆడపిల్లని యిచ్చుకున్నాం కదా అని మరీ అంత అలుసుగా మాట్లాడితే, ఎవరికయినా పౌరుషం వస్తుంది!"

"బాగానే వున్నదిలెండి, యింక గొప్పలు చెప్పుకోకండి!"

ఈ విధంగా మాటమీద మాట పెరగడమేగాని, ఆ వాదోప వాదాలకు అంతుకనబడలేదు. స్థానబలం చూసుకొని, పార్వతి ఏమంటే ఏమౌతుందో అని హడలిపోతూనే వుంది. అంచేత మెల్లగా భర్త దగ్గరకు వచ్చి చేయిపట్టుకొని-

"ఇక్కడ మనం ఏమన్నా బావుండదు! ఆడపిల్లను యిచ్చుకున్న వాళ్ళం- అన్నిటికీ తలవొగ్గక తప్పదు, మనం ఎలా చేశామో, లోకానికి తెలుసు! వూరుకోండి!" అని శాంత పరిచింది.

ఆ ముక్కతో మరెవరూ మాటాడుకోలేదు, ఎవరికివారే ముభావంగా అయిష్టంగా

ముఖాలు ముడుచుకున్నారు.

ఆ మర్నాడుగాని బండిలేదు తిరిగి వెళ్లడానికి. అంతవరకూ ముళ్ళమీద వున్నట్టు గడిపాడు కొండలరావు.

వియ్యాలవారు వచ్చేరని, ఒక విందుగాని, ఒక సరదాగాని లేదు. భోజనం మాత్రం పడేసేవారు.

సుశీల వెళ్లేముందు అత్తగారి డైరక్షన్‌లోనే వెళ్ళింది! ఏవో రెండు మూడు చీరలు మాత్రం పెట్టుకుంది. పెట్టిన నగలన్నీ కామాక్షమ్మ పెట్టుకు నెళ్లనివ్వలేదు. ఆ రాత్రే అవన్నీ దాచేసింది. ఇవన్నీ పార్వతి గ్రహించినా ఏమీ అనలేకపోయింది, పిల్లను పంపిస్తున్నారు కదా అంతే చాలు అనుకుంది.

సుశీల బయలుదేరుతున్న వేళకు మాధవరావు యింట్లో లేకుండా వెళ్ళిపోయాడు.

"పురుడు వచ్చాక ఉత్తరం వ్రాయండి" అని ఎవరూ అనలేదు.

జరిగిన అవమానానికి చిన్నబోతూ సుశీలని తీసుకొని బయలుదేరారు పార్వతీ, కొండలరావు.

★ ★ ★

బస్‌స్టాప్ దగ్గర నిలుచొని మోహన్ గురించే ఆలోచిస్తున్నది పద్మ. కాలేజీ నుండి తను వస్తూ యీ స్టాప్ దగ్గరనుంచోడం, అతడూ ట్రైనింగు స్కూల్‌నుండి వస్తూ అక్కడ కలియడం, రోజూ జరిగేదే. కాలేజీలో అతను చదువుతున్నపుడు తన కన్నా రెండేళ్లు సీనియర్. అప్పటి పరిచయమే ఇది!

పద్మ ఎన్నోమార్లు అనుకుంటుంది, మోహన్ను కొంచెం దూరంగా వుంచుదామని, కాని అతను దగ్గరికి వచ్చేసరికి అతనితో మాటాడుతూ వుండేటప్పటికి, తను తన అధీనంలో లేకుండా పోతుంది. ఈ పరిచయం ఇలాగే కొనసాగితే, తాను ఏ దుర్బల క్షణంలోనో లొంగి పోక తప్పదు. ఆనాడు యింక తను అతని దయాభిక్ష కోసం అతని చుట్టూ తిరగక తప్పదు. అంచేత తను జాగ్రత్త పడక తప్పదు.

కాని మోహన్... అలాటి మోసగాడు కాడు, అతని ప్రవర్తన అతను తనకిచ్చిన మాట, అన్నీ అతసలాటివాడు కాదని ఆమెకు అనిపించింది. అతడెన్నడూ అన్యాయం చేయడనీ తప్పకుండా వివాహం చేసుకుంటాడని నమ్మింది.

ఈ విషయం ఆమె తల్లిదండ్రులకు కూడా యిష్టమే. వారు తరచూ మాటాడుకోవడం, కలిసి తిరగడం- చూసినా తండ్రి ఏమీ అనలేదు. అయినా వీరిద్దరి పరిచయం మరీ సన్నిహితం అవుతున్నదని తెలిస్తే వూరుకొనేవారు కాదేమో!

అయినా పద్మ, "మోహన్! వివాహం చేసుకొనే వుద్దేశ్యం వుంటేనే మన పరిచయం యిలా కొనసాగనీ! లేకపోతే దూరంగా వుండడమే మంచిది" అని చెప్పనే చెప్పింది.

ఏమయినా సరే ఈరోజు మోహన్ వచ్చినపుడు- ఖచ్చితంగా, వివాహం సంగతి తేల్చుకుంటేనేగాని, ఈ కలుసుకోడాలూ, తిరగడాలూ, జరగవని చెప్పేయాలని ఆమె అనుకుంటూ వుండగానే "హల్లో పద్మా! ఎన్ని బస్సులు వచ్చి వెళ్లాయి! అసలు నువ్వు బస్సుకోసమే నిలుచున్నావా?" అని నవ్వుతూ వచ్చాడు మోహన్.

పద్మ నవ్వుతూ అతని వయిపు చూసింది. "అవును మరి! ఆడదానికి జీవితాంతం మగవాడి తోడు వుండాలన్నారుగా మీ మగవాళ్ళు. అంచేత బస్సులో కూడా వుండాలని నుంచున్నాను!" అంది.

"అందికే పాపం! అబలవి ఏమయిపోతావో అని పరుగెట్టుకు వచ్చాను" అని మోహన్ అనగానే యిద్దరూ నవ్వుకున్నారు.

మరి కొద్దిసేపటికి బస్ రావడంతో యిద్దరూ ఎక్కారు. బస్ కిక్కిరిసి వుంది. ఎక్కగానే లేడీస్ సీట్‌లోనుండి ఒకామె లేచి ఆ స్టాప్‌లోనే దిగడంతో పద్మకు ఆ సీటు దొరికింది.

బాయ్‌ఫ్రెండ్‌కి సీటు లేనందుకు విచారి స్తూనే పద్మ కూర్చుండిపోయింది. హాండిల్ పట్టుకుని ప్రక్కన నిలబడ్డాడు మోహన్. బస్‌రన్నింగ్‌లో కుదుపుకి పద్మమీద ఎవరూ పడకుండా అడ్డంగా నిలుచుని తనే అప్పుడ పుడు పడుతున్నాడు.

"బాడీగార్డ్‌లా బాగానే వుంది" అని అను కుంది పద్మ.

తదేకంగా పద్మవైపే చూస్తూ పరిసరాలు మరచిపోయాడు మోహన్.

పక్కగా పోతున్న సైన్ బోర్డులు చూస్తూ కూర్చుంది పద్మ. అయిదు నిముషాలు పోయాక అతని వయిపు చూసింది.

మోహన్ సర్వం మరచిపోయి తనవైపే చూస్తున్నాడు. "ఏమిటి చెప్మా!" అనుకొని తనను తను పరీక్షించుకుని సిగ్గుతో కోపం తెచ్చుకుంది.

45 డిగ్రీల కోణంలోంచి చూస్తున్న అతని చూపులు సరిగ్గా తన లోకట్ జాకెట్‌లోకి వెళుతున్నాయి!

ఆడవాళ్లు ఎంత జాగ్రత్త పడుతున్నా, అలాగే సందు చేసుకుంటారు ఈ మగ వాళ్ళు అనుకుని పైట సర్దుకుని, చురచురా మోహన్‌వైపు చూసింది.

మోహన్ నవ్వేసి తర్వాత స్టాప్‌లో, "పద్మా ఇక్కడ దిగుదాంలే!" అన్నాడు.

"ఇక్కడెందుకు? " అని ఆశ్చర్యంగా అడి గింది.

"చెబుతాగా" అన్నాడు.

సంశయిస్తూనే లేచింది పద్మ. ఆ స్టాప్‌లో ఇద్దరూ దిగిపోయారు. మోహన్ పార్కులోకి దారితీశాడు. "ఇప్పటికే ఆలశ్య మైంది మోహన్! ఇప్పుడెందుకు నేను వెళ తాను!" అన్నది పద్మ... కానీ లోపల ఈ సమయంలోనే తను అనుకున్నది అడిగే యాలని మనసులో వుంది.

"కాదు నీతో కొన్ని విషయాలు మాటా డాలి రావోయ్" అన్నాడు.

మరేమీ అనకుండా వెనకాలే వెళ్ళింది.

సందడి తక్కువగా వుండే కార్నర్‌లో ఒక చెట్టుకింద కూర్చున్నారు, మెత్తటి గడ్డి తివా సీలా పరచి వుంది. రకరకాల పక్షులు కిల కిలలాడుతున్నాయి. చెట్టుమీద, సాయం త్రపు సూర్యకిరణాలు, బంగారు పోతపోసి నట్టు పడుతున్నాయి, నెమ్మదిగా రేడియో, సంగీతం వినిపిస్తోంది.

కొంతసేపు ఇద్దరూ ఒకర్నొకరు చూసు కుంటూ మౌనంగా గడిపేరు.

"చెప్పు మోహన్ ఏదో చెప్పాలన్నావ్" అని పద్మే అడిగింది.

"ఏం లేదు వూరికనే కూర్చుందామని!" అని నవ్వేసేడు మోహన్ కాంక్షతో చూస్తూ.

"వద్దు మోహన్, నాకేమీ బాగా అనిపిం చలేదు, వద్దనుకుంటూనే నువ్వు పిలిచేసరికి వచ్చింది చాలు? "

"ఇందులో తప్పేముంది? పద్మా!"

"తప్పులేదా! ఇలా పెళ్ళికాకుండా కలసి తిరగడం! తప్పుగాక మంచిదా? "

"నన్ను అనుమానిస్తున్నావా!"

"లేదు మోహన్ ఎన్నాళ్ళిలా పొంగుతున్న అలల్ని చూస్తూ కూర్చోగలం? నీకు అభ్యం తరం లేదన్నావు అయినపుడే ఆలశ్యం ఎందుకు? ఒకరిమీద ఒకరికి ఇష్టమయేక ఎన్నాళ్ళో నిగ్రహించుకోవడం అసంభవం- అంచేత ఆ దుర్బల క్షణం రాకముందే మన వాళ్ళకు యిష్టమయిందీ, లేనిదీ తేల్చుకో వడం మంచిది కాదా? "

ఆమె చెప్పినది మోహన్ ఆశ్చర్యంగా విన్నాడు.

"అయితే మనవాళ్లకు ఒకవేళ యిష్టంలేక పోతే మనం విడిపోవలసిందేనన్నమాట, అంతేగా నువ్వనేది? " అని అన్నాడు.

"అంతమాట అనలేనుగాని నీకున్నంత స్వతంత్రం నాకు వుండదని నీకు తెలియదా మోహన్. తల్లిదండ్రులను ఎదిరించాలా లేక వారికి యిష్టమయేట్టు చేసుకోవాలా అనేది మనలోనే వుంది"

"మావాళ్ల సంగతి నాకు ముందే తెలుసు పద్మా. మా అమ్మ ససేమిరా ఒప్పుకోదు, మానాన్న సరేసరి అమ్మ ఎంతంటే అంత. అంచేత మా వాళ్ళతో చెప్పి ఒప్పించడం అన్న ప్రశ్నేలేదు"

"మరి ఎలా కుదురుతుంది? ఉండవల సింది అక్కడే కదా?"

"నిజమే... అందుకే నేను యిన్నాళ్ల ఆగేను- ఈ నెలతో ట్రైనింగు అయిపో తుంది కదా, ఎక్కడో అక్కడ పోస్టింగు వస్తుంది. అప్పుడు గప్‌చుప్‌గా పెళ్లిచేసుకొని మన మానాన్ని మనం వుండవచ్చును!"

"మంచి ఆలోచనే, కాని పెద్దవాళ్ళు వుండగా మనం వేరే వెళితే బావుం టుందా?"

"వాళ్ళు ఒప్పుకుంటే మంచిదే, కాదన్నప్ప టిమాట చెబుతున్నాను!"

"అంతవరకూ మనం ఎడంగానే వుంటే మంచిది" అన్నది.

"ఏమిటిలా ఇవాళ యింత రిజర్వ్‌డ్‌గా మాట్లాడుతున్నావ్ పద్మా" అన్నాడు.

"నేనింకా చిన్నపిల్లని కాదు మోహన్. లోకంలో జరుగుతున్నవి చూస్తూ, వింటూ, చదువుతూ కూడా యిలాగే ప్రవర్తిస్తే ఖింకేముంది? ముందు మన వివాహవి షయం తేలాలి అంతే!" నిష్ఠూరంగా చెప్పింది.

అలా అంటున్న పద్మవైపు చూస్తూ నిశ్చే ష్టుడయాడు మోహన్.

"నిజం చెప్పేవు పద్మా! పద, నీతో యిప్పుడే వస్తున్నాను? మీవాళ్లతో యివాళే మనిద్దరం సంగతి చెప్పి, మన నిర్ణయం కూడా చెబుదాం!" అని అన్నాడు.

"ఏదో అన్నానని అంత తొందరలేదులే!"

"అలా కాదు, పెళ్లిచేసుకుందికి అభ్యం తరం లేనపుడు, డొంక తిరుగుడు వ్యవ హారం దేనికి, ఈ రహస్య సమావేశాలు దేనికి? నువ్వన్నదే నిజం, నిర్ణయం చేసు కొని, వివాహం చేసుకుంటేనే మంచిది. కాక పోతే నౌకరీ అయినపుడే నువ్వు నాతో రావ చ్చును!" అన్నాడు.

ఆ మాటలు విని పద్మ హృదయం ఆనం దంతో వుర్రూతలూగింది. మోహన్ వక్షం మీద అలాగే ఒరిగిపోయి పెనవేసుకుపో దామా అని అనుకున్నది గాని- నిగ్రహించు కున్నది.

"పద పద్మా!" అంటూ లేచాడు మోహన్.

పద్మకు తెలుసు- తన తల్లి, దండ్రి ఈ విషయం విన్నా ఏమీ అనరని అయినా అతడిని వెంటబెట్టుకొని వెళ్ళి డైరెక్ట్‌గా చెప్ప డానికి సిగ్గువేసింది. అందుకని.

"మోహన్ ఇప్పుడే కాదు రేపు ఉదయం, నీకోసం చూస్తూ వుంటాను, నాన్నగారూ వుంటారు నువ్వు తప్పకుండారా! అప్పుడు మాటాడవచ్చు!" అని అంది.

"సరే... నీ ఇష్టం అలాగేకానీ, ఒకవేళ మీవాళ్లు ఒప్పుకోకపోయినా మనం రిజిష్టర్ మ్యారేజ్ చేసుకోడం మాత్రం ఖాయం" ఆవేశంతో చెప్పేడు.

"అలాగేలే!" అని నవ్వుకుంది పద్మ.



మర్నాడు నిద్ర లేచిన దగ్గర్నుండి పద్మ ఎంత ఉత్సాహంగా ఉన్నా తండ్రితోగాని, తల్లితోగాని స్వయంగా చెప్పలేక, లోపల నుండి పెల్లుబికి వస్తున్న ఆనందాన్ని అణు చుకోలేక సతమతమవుతూంది.

సిగ్గూ, సంతోషమూ కలిసి అదో విధమ

యిన ముగ్ధమోహనరూపంతో వెలిగిపో తూంది. ఏదో మిషతో వీధిలోకి వస్తూ, మోహన్ వచ్చేడో లేదో అని చూస్తూ వుంది.

పద్మ ప్రత్యేకంగా పూరీ, కూర్మా చేసింది. నెస్ కాఫీ సిద్ధంగా వుంచింది.

మోహన్ మనసా వాచా పద్మను ప్రేమిం చాడు. ఏది ఏమయినా, ఆమెనే వివాహం చేసుకొని తీరాలని పట్టుదలతో వున్నాడు.

రెండుమూడు నెలల్లో వుద్యోగం ఎక్కడో అక్కడ దొరక్కపోదు. ఈ లోపున పెళ్ళిచే సుకున్నా ఫరవాలేదు. ఎన్నాళ్ళో పద్మను విడిచి వుండనక్కర్లేదు అనుకున్నాడు మోహన్.

తనవాళ్ళకు ఈ సంగతి చెప్పడం, మరింత వాగ్వివాదానికి దారితీయడం, మనసు పాడవడం తప్పితే వేరే ప్రయో జనం వుండదని తెలుసుకున్న మోహన్ ఆ విషయమే యింటిదగ్గర ఎత్తలేదు.

మోహన్ వచ్చేసరికి పద్మ చిరునవ్వుతో ఎదుర్కొని లోపలకు తీసుకువెళ్ళి కూర్చోపె ట్టింది. అంతకుముందే పద్మ తండ్రికి అతను తెలిసి వుండడంచేత.

"ఓహో, మోహన్! ఏమిటిలా వచ్చేవు కూర్చో" అని మర్యాదగా పలకరించేడు. పద్మ వెళ్ళి టిఫిన్ తెచ్చి యిద్దరికీ యిచ్చింది.

తను అనుమానిస్తున్న ప్రత్యేకత యిది అని అప్పుడు గ్రహించేడు పద్మ తండ్రి. కూతురి అభిమతాన్ని తెలుసుకుందికి ప్రయ త్నిస్తూ ఆశ్చర్యంతో, అర్థంకాక చూశాడు.

పద్మ మౌనం వహించింది.

మోహన్ కూడా ఎలా మొదలెట్టాలో తెలి యక వూరుకున్నాడు. వచ్చినపని చెప్పలేక మోహమాటపడిపోతూ, పద్మ చెప్పివుండదా అతను అడగడా? అని అనుకున్నాడుగాని ఆడపిల్ల ఎంత ప్రేమించినా ముందుగా చెపుతుందా?

పద్మ తండ్రి విశ్వేశ్వర్రావుకి యిందులో ఏదో అర్థం వుండకపోదని వారి వ్యవహారం చూశాక అనుకున్నాడు.

పద్మ నవ్వుతూ కాఫీ పట్టుకువచ్చి "ఇంకేం ఆలశ్యం ? అంత ధైర్యంగా వచ్చి ఇంతేనా? " అన్నట్టు మోహన్ వైపు చూసింది.

"మీరు కోపగించుకోనంటే ఒక్క విషయం మీతో మాట్లాడదామనుకుంటున్నాను!" అని వినయంగా బితుగ్గాబితుగ్గా అన్నాడు మోహన్.

"ఏమిటోయ్! సందేహిస్తావెందుకు? చెప్పు!" విశ్వేశ్వరరావు అడిగేడు.

"మరేంలేదండి... మరి...మరి..." అని నీళ్ళు నమిలేడు సిగ్గుతో.

పద్మ అక్కడనుండి జారుకుంది.

"చెప్పవోయ్ ఆడపిల్లలా సిగ్గుపడతావెం దుకు"

"మీ అమ్మాయి ఏమీ చెప్పలేదా? " అన్నాడు.

"ఎవరూ పద్మా!... ఏమీ చెప్పలేదే!"

"మరేం లేదండీ... మేమిద్దరం పెళ్ళిచేసు కుందామని అనుకున్నాం... మీరు ఆశీర్వ దించాలి!" అని అతనేమంటాడో అని భయంతో చూస్తున్నాడు.

ఆమాటలు విని విశ్వేశ్వరరావు- అకస్మా త్తుగా విన్న అటువంటి నిర్ణయానికి ఏమ నాలో తెలియక తబ్బిబ్బుపడ్డాడు.

ఆలోచన్లోనూ పడ్డాడు.

ఇందులో తను అభ్యంతర పెట్టాల్సిన అవసరం ఏమీ కనబడలేదు. ఎంతో కష్టమ నుకున్న పద్మ వివాహ సమస్య యింత సులువుగా విడిపోతున్నందుకు మనసులో ఆనందమయింది. మోహన్ని మోహన్ కుటుంబాన్ని తను ఎరుగును, ఒక శాఖ కాకపోయినా ఒక కులం, ఒక జాతి. కాబట్టి ఎవరూ వేలెత్తి చూపే సమస్యలేదు. ఈ రోజుల్లో శాఖ పట్టింపు ఎవరు చూస్తు న్నారు. అన్యజాతి వివాహాలు చేసుకొన

డాన్ని సమర్థించేంత విశాలహృదయుడు కాకపోయినా, సంకుచిత అభిప్రాయాలు పోవాలి అన్న నమ్మకం గల మంచి హృదయం గలవాడు విశ్వేశ్వరరావు. తనం తటతనే నిర్ణయాన్ని చెప్పేకన్నా.

"ఉండవోయ్ నీ సమస్య యిప్పుడే తేల్చే స్తాను" అంటూ కుర్చీలోంచి లేచాడు.

"ఇదేమిటీయన ? జవాబు చెప్పకుండా లేచి వెళిపోతున్నాడు ఇష్టంగాని లేదా? ... ఉచిత మర్యాదలేం తలపెట్టలేదు కదా" అని అనుకొని తనూ రెడీగా వున్నాడు. అలాంటిదేమన్నా వస్తే కాచుకుందుకు.

ఇంతలో లోపలనుండి భార్య సుభద్ర మ్మని, కూతురు పద్మని కూడా వెంటబె ట్టుకు వచ్చేడు విశ్వేశ్వర్రావు.

అందరూ కూర్చున్నాక, "అదుగోనోయ్ మీ అత్తగారు, ఆమెకూ యిష్టమయితే నాకేం అభ్యంతరం లేదు!" అన్నాడు.

"బాగుందండోయ్! అత్తగారూ అంటూ కలిపేస్తూ, మళ్లీ నా యిష్టం అంటున్నారు బాగానే వుంది!" అంది ఆమె నవ్వుతూ.

ఆ మాటకి అందరూ పకాలున నవ్వుకు న్నారు.

"ముఖ్యంగా పద్మకు యిష్టం. అంచేత మా అందరకూ యిష్టమే!" అంది ఆమె.

"ఎలా తెలిసిందే! కనుక్కున్నట్టు చెబుతు న్నావు!" అన్నాడు అతను.

"అడగాలా ఏమిటి? ప్రొద్దుటినుండి పద్మను చూస్తే తెలియడంలేదూ- ఎప్పు డన్నా స్వయంగా టిఫిను చేసిందా? "

పద్మ, మోహన్ సిగ్గుపడి తలలు వంచు కొన్నారు.

"మా అభ్యంతరం ఏమీలేదు నాయనా, మంచిరోజు చూసి మీ నాన్నగారితో అన్ని విషయాలూ మాటాడుకొని ముహూర్తం నిర్ణయించుకోవచ్చును" అన్నది సుభద్రమ్మ.

ఆ మాటలు విని మోహన్,

"ఆ విషయమే చెప్పడానికి వచ్చానండి... ఆ పనిమాత్రం చేయవద్దు. మా వాళ్ళతో మాటాడనవసరం లేదు, ప్రస్తావించినా ప్రయోజనం లేదు... మా వాళ్ళు వినరు... వాళ్ళకోసం పద్మను వదులుకోలేను. మీ అంగీకారం అయితే మేమిద్దరం రిజిష్టర్ మారేజ్ చేసుకుంటాం. ఆశీర్వదించండి! తర్వాత మేమిద్దరం వెళతాం అప్పుడేమీ అనలేరు!"

ఈ మాటలు విని విశ్వేశ్వర్రావూ, సుభ ద్రమ్మ ఒకరి మొహాలొకరు చూసుకు న్నారు.

"మీరు మరోలా భావించకండి. ముందుగా వెళ్లి అడిగితే జరిగే పని కాదు... ఆ తర్వాతయినా ఆ పనే చేయక తప్పదు కదా. అందుకని ముందుగానే మీతో చెబుతున్నాను క్షమించండి!" అన్నాడు మోహన్.

సందిగ్ధంలో పడ్డారు వాళ్ళిద్దరూ.

"అదేమిటి నాయనా అందరూ వుండి, ముద్దూ ముచ్చటా లేకుండా రిజిష్టర్ పెళ్లి చేసుకుంటానంటావేమిటి? " అన్నది సుభ ద్రమ్మ.

"ఎలాగయితేనేమండి! మేమిద్దరం దంప తులమయి హాయిగా వుండడం కదా కావాలి! బోలెడు ఖర్చు పెట్టి బాజాభజంత్రీ లతో చేస్తేనే వుందా! కారణం చెప్పేను కదా!"

"ఏమిటో నాయనా! నాకంతా అయోమ యంగా వుంది!"

"నే చెప్పి చూసినా కాదంటారా! పోనీ చెప్పి చూస్తాను!" అని అన్నాడు విశ్వేశ్వ ర్రావు.

"వద్దండి... ఆలోచించే చెబుతున్నాను" అన్నాడు మోహన్.

మరెవరూ మాటాడకుండా ఆలోచిస్తూ వుండిపోయారు.

"సరే... అలాగే కానివ్వండి. మంచిది చూసి దండలు వేసేద్దాం! నాకు శ్రమలే కుండా మంచి భర్తను తెచ్చుకున్న అమ్మా

యికి, కాణీ ఖర్చులేకుండా పెళ్ళి చేసుకుంటున్న మోహన్‌కు నా అభినందనలు" అని నవ్వుతూ విశ్వేశ్వరరావు అన్నాడు.

అందరూ అమితానందంతో లేచారు.

★ ★ ★

ఒక శుభసమయంలో ఇద్దరూ వెళ్ళి రిజిస్ట్రార్ వద్ద వివాహం చేసుకొని వచ్చేశారు. మామగారూ, అత్తగారి ఆశీర్వచనం పొందేడు. మోహన్ తర్వాత టాక్సీ చేయించుకొని, తన యింటికి తీసుకు వెళ్ళేడు.

అకస్మాత్తుగా మోహన్ కొత్త పెళ్లికొడుకయి పద్మను కూడా వెంటబెట్టుకురావడం యింట్లో అందరికీ నడ్డిమీద చరిచి లేపినట్లయింది!

ఇంకా ఏమిటో యిలా వస్తున్నారు అనుకొనేసరికి వారిక్రొత్త బట్టలూ దండలూ వ్యవహారం చూసి ఆశ్చర్యపోయారు.

అడగలేక అడుగుదామని కాశీపతి నోరు తెరుస్తూండగానే- "క్షమించండి నాన్నగారూ! మీకెవరికీ తెలియకుండా మేమిద్దరం 'రిజస్టర్ మారేజ్' చేసుకున్నాం అని ఇద్దరూ నమస్కారం చేశారు.

కాశీపతి ఏమనడానికీ తోచక ఏదోవిధంగా ఆశీర్వదించినట్టు చేయి ముందుకు చాపి వుండిపోయాడు.

కామాక్షమ్మ ఈ ఆగడం చూసి గబగబా వచ్చి దవడలమీద చేతులు వేసుకొని,

"ఏమిట్రా ఇది" అంది సహజధోరణిలో.

"మరేం లేదమ్మా ముందుగా చెబుతే మన శాఖ కాదని మీరెలాగూ ఒప్పరు. అందుకని మేమిద్దరం యిలా పెళ్లి చేసుకొని వచ్చాం. మరేమీ అనుకోకండి. యింక పద్మ మనతోనే వుంటుంది" అని ఖచ్చితంగా చెప్పేశాడు.

ఇంటిల్లపాదీ వచ్చి నిశ్శబ్దంగా చూస్తూ నిలుచుండిపోయారు. ఎవరూ సాహసించి ఒక్కమాట కూడా అనలేదు.

కామాక్షమ్మకు బాగా తెలుసు ఎవరిమీదనన్నా అధికారం, నోరూ చేయగలదుగాని మోహన్ దగ్గర ఆమె ఆటలు సాగవని. మోహన్ మొదటినుండి ఖాతరు చేసే రకం కాదు. అవసరంవస్తే తృటిలో సంబంధాన్ని తెంచుకొని వెళ్లిపోగలడు. ఎంతకయినా సాహసించగలడు.

ఇక ఏమన్నా రసాభాస. అల్లరి తప్పితే ప్రయోజనం శూన్యం అని గ్రహించింది కామాక్షమ్మ. కాని తన ఎదురులేని పెత్తనానికి ఆ రోజు పెద్ద విఘాతం కలిగినందుకు బాధపడింది. ఒకసారి ఎక్కడాలేని దుఃఖం పొంగివచ్చినా, కళ్లకి కొంగు అడ్డం పెట్టుకుని వూరుకుంది.

"పోనీలే నాయనా! యిప్పుడయినా తల్లీ దండ్రీ వున్నామని జ్ఞాపకం వచ్చింది. మీ అంతటివాళ్లు మీరయినాక యింక అనేదేముంది. చిన్నప్పటినుండీ పెంచి పెద్ద చేశాక కోరికలూ ముద్దూ ముచ్చటలూ తీరుతాయని అనుకున్నందుకు బాగానే చేశావు. ఏమిటో అనుకోడమేగాని... రానురాను కాలం మారిపోతూంది... మీరిద్దరూ సుఖంగా వుండండి అంతేచాలు. మా సంగతికేం" అని కళ్లు వత్తుకున్నది.

రాక్షసిలా మీద పడుతుందని అనుకున్న మోహన్‌కు ఈ మార్పు అత్యంతాశ్చర్యకరమనిపించింది.

కొంచెం పశ్చాత్తాపం కూడా కలిగింది.

"లేదమ్మా! మిమ్మల్ని నొప్పించాలని కాదు. మొదటే చెబుతే యింత ప్రశాంతంగా జరగదు అది నిజం. ఇప్పుడేమయిందీ. మీకు తెలియకుండా వచ్చినా పద్మ చాలా మంచిది. నువ్వే చూస్తావుగా!" అని మాట మార్చి తల్లిని మరిపించడానికి ప్రయత్నించాడు.

తర్వాత ఇద్దరూ అందరకూ నమస్కారం చేశారు.

"సుఖంగా వుండండి. అంతకన్నా మాక్కావలసింది ఏమిటి? " అని కామాక్షమ్మ కూడా ఆశీర్వదించింది.

తర్వాత ఎవరికివారే అందరూ వాళ్లతో కలిసి మెలిసి వున్నారు.

రెండుమూడు రోజులు పోయాక పద్మ మోహన్‌తో "మీకు ఏదో ఒక జాబ్ దొరికే వరకూ నేను మా వాళ్ల దగ్గరే వుంటే మంచిదేమో" అంది.

మోహన్ ఆలోచించాడు. ఏదయినా లోటు కనిపిస్తే "కాణీ ఆర్జనలేదు, పెళ్లాం ఒకటి తక్కువయినట్టు తెచ్చి నెత్తిమీద పెట్టేడు" అని తన తల్లి ఏ నిముషానన్నా అనవచ్చు అంచేత ఆ మాట అనడానికి అవకాశం ఇవ్వకుండా ముందుగానే జాగ్రత్త పడడమే మంచిదని భావించాడు.

అందుకు పద్మ అన్నట్టుగా వాళ్లింట్లో వుంటేనే మంచిది అని అనుకుని,

"అవును.... నువ్వు చెప్పిందీ నిజమే! నీ ఇష్టం. అని ఆ మర్నాడే వాళ్ల వాళ్లు తీసుకు రమ్మన్నారని చెప్పి ఆమెను దిగబెట్టేసేడు... అప్పుడపుడూ వస్తూ వెళుతూ వుండవచ్చుని.

తన కొడుకు చెప్పాపెట్టకుండా పద్మను పెళ్లాడాడన్న కోపంకన్నా పద్మ తల్లిదండ్రులు యిప్పటికీ మర్యాదకయినా తమ యింటికి రాలేదుకదా అని కామాక్షమ్మ, కాశీపతి పుక్రోషంతో లోలోపల కుళ్లిపోతున్నారు.



సుశీల తన అత్తవారింటిలోని విశేషాలు ఒక్కొక్కటీ చెబుతూ వుంటే ఫిక్షన్ కథల్లా ఆశ్చర్య సంభ్రమాలతో విన్నారు పార్వతీ, కొండలరావూ.

ఈ ఏడాదిలోనూ సుశీల ఎన్ని బాధలు పడిందో అని విచారించడమా? మళ్లీ వెళ్లేక యింకేం బాధలు పెడతారో అని ఏడవడమా? అని పార్వతి యిప్పటినుండే బెంగ పెట్టుకుంది.

మంచీచెడు అన్నీ చూసి పెళ్లిచేశాక పిల్ల సుఖపడుతుందని అనుకుంటారుగాని, యిలా జరుగుతుందని ఏం తెలుస్తుంది. వాళ్లిలాంటి వాళ్లని రాసి వుంటుందా? ఏమయినా యిన్నాళ్లు యోగక్షేమాలు కనుక్కోకుండా అశ్రద్ధ చేయడం తమవల్లా తప్పే అని చెప్పింది పార్వతి భర్తతో.

వచ్చిన వెంటనే కులాసాగా చేరినట్టు మాధవరావుకి వుత్తరం రాసింది. కాని ఎన్నాళ్లయినా నీ కులాసాతో నాకేం ప్రమేయం అన్నట్టు జవాబేరాలేదు.

మరి కొద్దిరోజులకే సుశీల మగపిల్లవాడిని కన్నది. యింటిల్లపాదీ ఆనందించారు. ఈ రెండు నెలలూ సుశీల కాస్త ప్రశాంతంగా వుంది. అన్ని కష్టాలూ మరచిపోయి తల్లి దగ్గర హాయిగా వుంది.

పిల్లాడు పుట్టిన వెంటనే పదకొండో రోజుకు రమ్మని బారసాల జరిపిస్తామని కొండలరావు అల్లునికి రాసేడు. దానికి వస్తామని గాని, రామనిగాని వుత్తరంలో లేదుగాని ఆ వార్త విని ఆనందించామని ఒక ముక్క రాసి పడేశారు. అలాగే పదకొండో రోజు గడిచిపోయింది.

పార్వతి కొండలరావుల మనసు చివుక్కుమంది. అలాగే యిరవై ఒకటవరోజు కూడా గడచిపోయింది. సుశీల విచారానికి అంతే లేదు.

కన్నకొడుకును చూద్దామని అయినా తన భర్తకు లేకపోయిందే అని వాపోయింది. వాళ్ల తత్వం తెలుసుకాబట్టి సెలవు దొరకక రాలేదని సరిపెట్టుకోలేకపోయింది. తనంత నేరం ఏం చేసిందో అర్థం కాలేదు.

అలా నాలుగు నెలలు గడిచిపోయాయి సుశ్లా ఎన్ని వుత్తరాలు రాసినా మాధవరావుగాని, కాశీపతిగాని జవాబు రాయలేదు సరికదా ఫలానా నాడు తీసుకు రమ్మని కూడా రాయలేదు.

కొండలరావుకూ, పార్వతికీ ఏంచేయాలో తోచలేదు. వాళ్లనుండి ఏ కబురూ లేకుండా పంపడమా మానడమా? అన్న సందిగ్ధంలో పడ్డారు.

పార్వతి మాత్రం బెంగపెట్టుకుంది. యింట్లో ఎన్నాళ్లున్నా కూతురు తమకు బరువుకాదుగాని తీసుకు వెళ్లి దిగబెట్టకపోతే వాళ్లేమనుకుంటారో! అంచేత అయిదో నెలలో దిగబెట్టి వేయమని భర్తతో చెప్పింది.

పిల్లాడు పుట్టినవేళ మంచిది. శాంతిగాని, నీడగాని చూసుకోవలసిన పనిలేదు కాబట్టి బారసాల జరగకపోయినా ఫరవాలేదు. మంచిది చూసి దిగబెట్టేస్తే సరిపోతుంది. వాళ్ల మొహం ముందే అడిగి వేయవచ్చు అని నిశ్చయించుకున్నారు యిద్దరూ.

ఈ మారు దిగబెట్టడానికి కొండలరావు వెళ్లడానికి నిశ్చయించుకోలేదు. క్రిందటిసారి వెళ్లినపుడు జరిగిన అమర్యాద, అగౌరవం తలుచుకుంటే మరి తాను ఏ పరిస్థితుల్లోనూ అక్కడికి వెళ్లకూడదని నిశ్చయించుకున్నాడు. తను ఎలాంటివాడననీ! తనకున్న ఆత్మగౌరవం తనకున్నది. అనవసరంగా మాటలు పడే అవుసరంలేదు. అందువల్ల కూతుర్ని దిగబెట్టడానికి భార్యనే పంపడానికి నిర్ణయించుకున్నాడు.

ఒకరోజు మంచిది చూసి వున్నంతలో చీరలు, సామానులూ కొని పెట్టి సుశీలని, పార్వతిని పంపించాడు.

కాశీపతి, వాళ్లూ సుశీలను, ఆమె తల్లినీ చూసి ఆహ్వానించకపోయినా తలుపులు మాత్రం వేసుకోలేదు. అందుకు సంతోషించారు తల్లీకూతుళ్లు.

కోడలు మామూలుగా ఎవరింటికో చూడ్డానికి వెళ్లి వచ్చినట్టుగా ప్రవర్తించారు. వాళ్లు కొత్తగా పురుడు పోసుకువచ్చిన కోడలిని ఆ విధంగానేనా చూసేది? అని కుమిలిపోయింది పార్వతి.

వస్తూనే పిల్లవాడిని అత్తగారి చేతుల్లో పెట్టింది సుశీల.

విధిలేక కామాక్షమ్మ తీసుకుని "వెధవ అచ్చంగా మా వాడి పోలికేనే!" అంది. కొడుకు పోలికలు కొట్టవచ్చినట్టు కనబడేసరికి సంతోషించిందామె.

వెనకాలేవున్న కాశీపతి "ఏడీ యిలాతే" అంటూ ఒడిలోకి తీసుకున్నాడు. "ఆ ముక్కూ... మూతీ" అంటూ ముద్దులాడబోయేసరికి..

"ఆ... అంతా మీ పోలికే!" అని ఎగతాళి చేసింది కామాక్షమ్మ.

"ఏం తాతగారి పోలికలు రాకుండా పోతాయా? " అని మాటలు కలిపింది పార్వతి.

"ఒరే మాధవరావూ చూడరా" అంటూ అప్పుడే వస్తున్న మాధవరావు చేతికిచ్చేడు.

మాధవరావు తీసుకుంటూ బుగ్గమీద చిటికవేసి సుశీలకు అందించాడు. సుశీల సిగ్గుపడుతూ తీసుకుంది.

కృష్ణారావు "వచ్చేరామ్మా!" అని మాత్రం పలకరించాడు.

మాలతీ, పద్మా నవ్వుతూ నిలుచుండడం చూసి పద్మను పలకరించాలని సుశీల అనుకున్నా ఆమె ఎవరో ఏమిటో అని వూరుకుంది. మాలతిని కళ్లతోనే పలకరించింది.

సుశీల తమ గదిలో వుయ్యాల వేయడానికి చీర దూలానికి వేలాడదీస్తూ బాబును మంచం మీద పడుకోపెట్టింది.

మాలతీ, పద్మ వెనకాలే వచ్చారు.

"సుశీలా చాలా చిక్కిపోయావ్!" అంటూ బాబును ఎత్తుకుంది మాలతి.

సంతోషంతో సుశీల "నీ కంటికి అలా

కనబడుతున్నానుగాని బాగానే వున్నాన క్కయ్యా" అంటూ పద్మవయిపు ప్రశ్నార్థకంగా చూసింది.

"ఎవరో చెప్పుకో చూద్దాం" అని హాస్యం చేసింది మాలతి. పద్మ నవ్వి వూరుకుంది.

"తెలీదు" అన్నట్టు తలవూపి "మీ చెల్లెలా? " అని అడిగింది అమాయకంగా సుశీల.

"అవును! మన చెల్లెలే" అర్థంకాక తెల్లబోయి చూసింది సుశీల.

"మోహన్ మనకెవ్వరికీ చెప్పకుండా పెళ్లి చేసేసుకున్నాడు తెలుసా? "

"ఎవర్ని" అని యింకా వెర్రిమొహం పెట్టి ఆశ్చర్యంగా అడిగింది.

"బావుంది! యింకెవర్ని? యీ పద్మనే"

"అలాగా ఆ సంగతే నాకు తెలీదే? " అంది ఆశ్చర్యపోతూ.

"ఇక్కడున్న వాళ్లం మాకు మాత్రం తెలుసా ఏమిటి? ... గప్‌చుప్‌గా ప్రేమించేసుకుని పెళ్లి చేసుకొని మరీ వచ్చేరు యిద్దరూ. మనలాగనుకున్నావా ఏమిటి? "

"నన్నేమీ అనకండి, మీ మరిదిగార్ని అడగండి ఎందుకలా చేశారో!" అని తప్పుకుంది పద్మ.

"అమ్మా! ఎంత నంగనాచివమ్మా! మా మరిదిని ముందే కొంగున కట్టేసుకుంటివి. యింక ఎవరేంజేస్తారు? "

"మీ మరిదిగారే నా కొంగు పట్టుకు వదల్లేదు" అనగానే అందరూ గొల్లున నవ్వేరు.

"నాకెంతో సంతోషంగా వుంది. ఎలాగయినా యిద్దరూ కలిసి వుండడం కావాలి" అంది సుశీల పద్మ చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ.

"ఎన్నాళ్లయింది వచ్చి" అని అడిగింది మళ్లీ.

"ఏదీ నువ్వు వెళ్లిన నెల్లాళ్లకు రిజిష్టర్ మేరేజ్ చేసుకుని వచ్చేరు. తర్వాత రెండు రోజులుంది, పుట్టింటికి వెళ్లిపోయింది. ఈ రోజే వచ్చింది. ఆమెకేం... ఈ వూరేగా పుట్టిల్లు. అక్కడే వుండి అప్పుడప్పుడు వచ్చిపోతుంది. ఇష్టమయితే వుండవచ్చు లేకపోతే వెళ్లిపోవచ్చు. మనలా పడివుండాలన్న బాధలేదు. నాన్నా, అమ్మా వచ్చి తీసుకు వెళ్లాలన్న బాధ అంతకన్నా లేదు. మరిదిగారు కూడా పట్టించుకోరు" అంది మాలతి.

"అదేం కాదు అక్కయ్యా! మీ మరిదిగారికి అప్పట్లో ట్రైనింగ్ యింకా పూర్తికాలేదు. అతనే వీళ్ల మీద ఆధారపడి వుంటుంటే ఇంక నేను కూడా బరువు ఎందుకని వెళ్లిపోయాను. ఆయనకి ఉద్యోగం అయింది. అందుకని వచ్చేసేను. అంతేగాని పుట్టిల్లు ఇక్కడే అని రోజూ పరిగెడతామా? " వివరించింది పద్మ.

"అవునమ్మా! ఏదో హాస్యానికన్నాను అంతే" అని సర్దుకుంది మాలతి.

"అక్కయ్యా ఒక సంగతి అడుగుతాను చెబుతావా? " అంది సుశీల అంతవరకూ లోన వున్న అనుమానం తీర్చుకుందికి.

"ఏమిటి చెప్పు" అంది మాలతి.

"మరేమీ లేదు పిల్లాడు పుట్టేడని ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు రాసేరుకాదు. బారసాల కూడా జరిపించుకోలేదు. నీకేమయినా తెలుసా!" అని అడిగింది.

"ఏమోనమ్మా ఆ సంగతులు నన్నడక్కు. ఈ ఇంట్లో అందరూ ఒక్కలాటివారే! ఎవరికని చెబుతాం. అందరూ మొండివాళ్లే. మీ దగ్గర్నుండి వుత్తరం వచ్చిందంటే చాలు యింట్లో ఒక పెద్ద కురుక్షేత్రం అయ్యేది అనుకో! ఒకరు అవునని ఒకరు కాదని యిదే గోల! ఆఖరుకు మీ ఆయనే వెళతాను అని అన్నా అత్తగారు పడనిచ్చేరుకాదు. పోనీలే యిప్పటికయినా వచ్చేవు సుఖంగా. అదేచాలు మంచిపనిచేశావు!" అంది ఎవరూ వినకుండా.

"మరేం చేసేది? ఎన్నాళ్లు చూసినా ఎవరూ రాలేదు, ఉత్తరమయినా రాకపోయేసరికి పిల్లడు పుట్టినవేళ మంచిదేకదా అని బారసాల లేకపోతే పోయిందని వచ్చేసేను!

అంది సుశీల కంటతడిపెడుతూ.

"బావగారు ఉత్తరం కూడా రాయలేదా?" అని అడిగింది పద్మ. "లేదు బారసాల చేసుకుందికి రమ్మన్నా రాలేదు. ఉత్తరమయినా లేదు. ఎన్నాళ్లు పుట్టింట్లో వుంటాను. అందుకని చూసిచూసి వచ్చేసేను" అని అంది సుశీల.

"నయమే వచ్చేక ఏ గొడవా జరగలేదు" అంది మాలతి.

అవన్నీ ఆశ్చర్యంగా విన్నది పద్మ. కాసేపు మాటాడి మాలతీ, పద్మ వెళ్లిపోయారు.

సుశీల కొడుకుకి విజయకుమార్ అని పేరుపెట్టాడు మాధవరావు. అందరూ ముద్దుగా బాబూ అని పిలవసాగేరు.

పద్మను చూశాక సుశీల మనసులో కాస్త నిబ్బరం కలిగింది ఎందుచేతో! తమలాగే ఆ యింట్లోకి మాడిపోడానికి చేరిన శలభం అని మొదట అనుకున్నా తర్వాత కాదని తెలుసుకుని ఆనందించింది. ఆ యింట్లోకి రావడమే ఒక గొప్ప మార్పుని వెంటేసుకు వచ్చిన పద్మని చూస్తే ఆ యింటికి రావలసిన కోడలే వచ్చిందనీ అదొక శుభసూచకమే అనీ భావించింది.

పద్మ మాటలూ, తీరూ చూస్తే సంస్కారం, చదువు, కావలసినంత మనోధైర్యంగల వ్యక్తిగా కనిపించింది. ఆమె మాటల్లో ఎంత నమ్రత, ప్రవర్తనలో ఎంత జాగ్రత్త వుందో అంత నిశితమయిన పరిశీలనా దృష్టీ, విచక్షణా జ్ఞానం వుందనుకుంది.

పద్మ ఏ విషయంలోనయినా అంత వేగిరం తేలిపోయే మనిషి కాకున్నా అట్టే పరిచయం లేకపోయినా ఆ కొద్ది రోజుల్లోనే తనకు మిగతా వారికన్నా ఆత్మీయురాలిగా తోచింది సుశీలకు.

ఒకరోజు రాత్రి పనులన్నీ చేసుకు వచ్చి బాబును నిద్రపుచ్చుతూ వుంది. అంతలోనే మాధవరావు వచ్చేడు. నిద్రపోతూవున్న బాబును నిశ్శబ్దంగానే ముద్దులాడేడు. తర్వాత అతనికి భోజనం పెట్టి గదిలోకి వచ్చేసింది. ఆ రోజు మాధవరావు కోపంగా లేడు.

ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ "బారసాలకయినా వచ్చేరుకాదేమీ?" అని అడిగింది సుశీల.

"అదంతా యిప్పుడెందుకులే నాకిష్టంలేక రాలేదు!" అని సుశీలకు దగ్గరగా వచ్చి భుజంమీద చేయివేశాడు.

ఆ అవకాశం తీసుకుని, "మనిషి ఎదురుగా వుంటేనే లేకపోతే ఏమయిపోయినా అడగరు అంతేకదూ!" అంది ఎడంగా జరుగుతూ.

మరొకప్పుడయితే ఏమోగాని, ఆ సమయంలో మాత్రం మాధవరావు నవ్వేసి సుశీలను దగ్గరగా తీసుకున్నాడు.

ఆ మనిషిలో కోరిక తప్పితే ప్రేమాభిమానాలు లేవని సుశీల గ్రహించింది.

యిష్టంగానో అయిష్టంగానో భర్త సన్నిహితమయినందుకు అదే పదివేలని ఆనందించవలసి వచ్చింది సుశీలకు. అదే సమయంలో ఆవుపాలిచ్చినట్టూ, స్విచ్ ఆన్‌చేస్తే రేడియో పాడినట్టూ, తనుకూడా అతనికి అవసరార్థం పనికివచ్చే యంత్రంలాంటిదయిపోయినందుకూ అంతకన్నా తనకేప్రత్యేకతా లేనందుకూ విచారించింది.

ఇంతకు పూర్వం సంగతివేరు. తను ఒకత్తే ఎట్లా చూసినా బాధలేకపోయింది. యిప్పుడు తల్లి అయేక తన బాధ్యతలావయింది. తనమీద అభిప్రాయం కూడా మాధవరావుకు మారదా అనుకుంది. కాని ఆ తలపోతలన్నీ తల్లక్రిందులయినాయి.

మరో యింట్లో అయితే పెద్ద దిక్కు అంటూ వున్నాక ఆవిడే పసిపాపకు నీళ్లుపోయడం, కాపుకాయడం మొదలయినవన్నీ దగ్గరుండి చూసేవారు. కామాక్షమ్మ మనవడిమీద చెయ్యి అయినా వెయ్యలేదు. అను

భవంలేని తనే అన్నీ చూసుకోవలసి వస్తోంది. పూర్వం యింటి పనులే వుండేవి. యిప్పుడు యింటిపనీ, బాబు సంగతీ కూడా చూసుకోలేక నిమిషం తీరికలేక సతమతమ యిపోతోంది.

అక్కడ వున్న రెండు రోజులూ పనితో నలిగిపోతున్న కూతుర్ని చూసి శక్తిలేకపో యినా సాయపడేది పార్వతి.

"ఎంత కర్కోటకులే నా తల్లీ! నిన్ను చేతు లారా వీళ్లపాలు చేసేను" అని ఏడిచేది. సుశీల ఎవరయినా వింటారని వారిస్తూ తనకు అలవాటయిపోయింది కాబట్టి మరేమీ బాధపడవలసిన అవుసరం లేదని నిశ్చింతగా వుండమని చెప్పి సర్దుకునేది.

పార్వతి ఎన్నాళ్లని కూతురు ఇంట్లో వుంటుంది? ఒక వారం రోజులుండేసరికి కామాక్షమ్మ చిటపటలు, సూటీపోటీ మాటలూ ప్రారంభమయినాయి. భోజనం కూడా చేశావా! లేదా? అని అడిగినవారు లేకపోయినారు. సుశీల తప్ప ఎవరూ మాట్లాడకపోవడం పార్వతికి కష్టం అనిపిం చింది. అంతకుమించి కూతురు చేస్తున్న చాకిరీ పడుతున్న అవస్థ కళ్లతో చూడలేక పోయింది.

ఆ మర్నాడే వెళ్లిపోతానని కామాక్షమ్మతో చెప్పింది. మాటవరసకయినా ఎవరూ వుండమనలేదు సరికదా 'నీదే ఆలస్యం ఎంత వేగిరం వెళతావా అని చూస్తున్నాం' అన్నట్టున్నారు. సుశీల మనసులో బాధప డినా మరో నాలుగు రోజులుపాటు తన దగ్గర వుంటే బావుండు ననిపించినా ఆ స్వతంత్రం లేక కంటినీరు పెడుతూ వూరు కుంది.

సుశీల మీద బెంగతోనే పార్వతి వెళ్లిపో యిందిగానీ ఇంటికి వచ్చేక కూడా అవే ఆలోచనలతో ఏడుస్తుంటే కొండలరావు,

"ఆడపిల్ల అత్తవారింటికి వెళ్లాల్సిందేకదా! యింక అది అక్కడ ఎలా వుంటుందో అది చేసుకున్న పూజాఫలం! ఏం చేస్తాం. యిలా అవుతుందని మనం అనుకున్నామా? అలా మనసులో పెట్టుకుని నీ ఆరోగ్యం పాడు చేసుకుంటే ఏమన్నా ప్రయోజనం వుందా! కాకపోతే కొన్నాళ్లు కష్టాలు పడినా వాళ్లే బాగుంటారు. రోజులు ఎప్పుడూ ఇలాగే వుంటాయా! అలా ఎంతమందిలేరు!" అని సమాధానపరచబోయేడు.

"బతికుండగా ఆ ముక్క వింటానా" అని నిట్టూర్చింది పార్వతి.

* * *

తల్లి వెళ్లిపోయినాక ఒంటరిదయిపో యింది సుశీల.

అత్తగారిని చూస్తే సింహస్వప్నం, మామ గార్ని చూస్తే మరీ భయం, యిక బావమ రదులు ఆడపడుచులూ ఎవరిదారి వారిదే.

మాలతి అప్పుడపుడయినా మాటాడుతూ వుండేది. రానురాను ఏమయిందోగాని ఇప్పుడు అట్టే మాటాడడంమాని అత్తగారికే అతి చేరికయినట్టుంది.

ఏవో గుసగుసలు సుశీల వెనకాల సాగు తున్నాయి. అయితే అదేమిటో మాత్రం సుశీల వూహించలేకపోయింది. అంతలా ఆమె పట్టించుకోలేదు. ఎంతసేపూ తన పనీ తన బాబు సంగతీ తప్పితే రెండో ధ్యాస లేదు.

పద్మ అట్టే దేంట్లోనూ కలుగజేసుకోదు. ఆమెకు ఎవరూ పనులు పురమాయించరు. ఆవిడ ఎంతసేపూ ఏదో పుస్తకమో పత్రికో పట్టుకు కూర్చుంటుంది. అత్తగారూ, మామ గారూ కూడా ఆమె దగ్గర భయపడుతు న్నట్లు వుంటారు.

తనూ ఎందుకలా వుండలేదు. అందుకు కారణం పద్మ భర్త. ఒకటి రెండుసార్లు పద్మకి అత్తగారు ఏదో చెప్పబోతే మోహన్ రావ్ జవాబిచ్చేడు. దానితో కామాక్షమ్మ మళ్లీ నోరు తెరవలేదు. ఒక్కొక్కపుడు మోహన్‌రావే కాఫీ పట్టుకు వెళ్లి పద్మకు అందిస్తాడు.

మరి తన భర్తో అంత సేపలు చేయన క్కర్లేదుగాని తల్లి తనని అంత హీనంగా చూస్తున్నా ఏమీ అనకపోవడమే తన యీ స్థితికి కారణం అనిపించింది. తనకు చదువా సంధ్యా! ఎదిరించి ఏం చేయగ లదు. పద్మ ఎదిరించినా ఆదరించే తల్లి దండ్రీ వున్నారు. లేకపోయినా తన కాళ్ల మీద తను నిలువగలదు.

అప్పుడు స్త్రీకి చదువెంత అవసరమో సుశీ లకు అర్థమయింది. పద్మ ఎవరి విష యంలో ఎలా వున్నా సుశీల అంటే ఒక విధమయిన సానుభూతి వుంది. చిన్నద యినా తనకు కొన్ని పనుల్లో సాయం చేస్తూ వుండేది తను అడక్కుండానే.

బాబుకి నీళ్ల పోస్తూ వుంటే తనూ కలు గజేసుకుని తుడిచి శుభ్రపరుస్తూండేది. ఒక్కోసారి ఆమె నీళ్ల పోస్తుండేది. చదువు కున్నది కాబట్టి అంతా సైంటిఫిక్ గా చేయాలని చెబుతూ వుండేది. ఎన్నో పద్ధ తులు మార్చి అలా ఇలా చెయ్యాలని చెప్పేది. సుశీలకు కూడా ఆ పద్ధతులే నచ్చేవి. నచ్చినా నచ్చకపోయినా అపాయ కరం కానంతవరకూ చేస్తే ఏంపోయిందీ? అనుకునేది.

అది చూసి కామాక్షమ్మ మెటికలు విరు చుకుని మూతి మూడువంకరలు తిప్పు కుంటూ చురచుర చూస్తుండేది. కాని పద్మకి భయపడి ఏమీ అనడానికీ సాహసిం చేదికాదు.

పద్మ సుశీల దగ్గరకు వచ్చేసరికి పద్మా అంటూ ఏదో పెద్ద పనివున్నట్టు పిలిచి ఏదో చెబుతూ వుండేది. కాని పద్మ ఏదో చేసినట్టు చేసి సుశీలకు సాయం చేస్తుం డేది.

పద్మ యిలా చేస్తుండడంతో యింట్లో చిన్న మార్పు వచ్చింది. సుశీల మీద కాక పోయినా బాబుమీద అందరికీ శ్రద్ధ కలి గింది.

పద్మ వెనకాలే మాలతి కూడా వచ్చి విజ యకుమార్ని తనూ ఎత్తుకుని ఆడించేది.

ఎన్నాళ్లయినా ఫలించని తన మాతృత్వం ఒక్కసారి పొంగి వచ్చినట్టు ఉద్రేకంతో ముద్దులాడేది. ఎందుచేతోకాని కామాక్షమ్మ మాలతిని కూడా ఏమీ అనేదికాదు.

కృష్ణారావుకి కూడా బాబు అంటే ఎంతో ముద్దు. తను వున్నపుడు తన దగ్గరే వుంచుకొనేవాడు. బిస్కట్లు, చాక్‌లెట్లు, బొమ్మలూ తెస్తూ వుండేవాడు.

తన పరిస్థితి మారకపోయినా తన బాబును ఆ యింట్లో అందరూ ప్రేమతో చూస్తున్నందువల్ల ఎంతో ఆనందించింది సుశీల.

ఆమె ఆ ఇంట్లో అందరికీ పనిమనిషి. భర్తకు క్షణికానందాన్ని ఇచ్చే ఒక యంత్రం అంతే! అయినా ఆ ముద్దుల పంటని చూసుకుని మురిసిపోయేది.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. సుశీల పరి స్థితి పూర్వమంత నికృష్టంగాలేదుగానీ అది కేవలం తన కొడుకు వల్లనే. తనమీద ఎంత కసివున్నా పిల్లవాడిని మాత్రం ఇంటి ల్లపాదీ వదలరు.

ముఖ్యంగా మాలతీ కృష్ణారావులకు అన్నే ళ్లయినా పిల్లలు కలగలేదేమో ఈ పసి వాణ్ణి చూసి ఆ ముచ్చట తీర్చుకుంటు న్నారు. సుశీల అంటే మాలతికి ఎలాటి అభిప్రాయం వున్నా బాబుకోసం మాత్రం సుశీలతో చనువుగా ఉంటోంది.

అయితే రానురాను పిల్లాడిని అస్తమానూ తన దగ్గరే వుంచుకొనడం, చాకిరీ మాత్రం సుశీలకు అప్పజెప్పడంతో పిల్లాడిని తన దగ్గరే వుంచుకుందికి ప్రయత్నించవలసి వచ్చింది. మాలతిని ఏమయినా అంటే, ఏం జట్టీలు వస్తాయోనని సుశీల భయం.

సుశీలకు ఒకరాత్రి హఠాత్తుగా మెళుకువ

వచ్చి అలవాటు ప్రకారం చేయి బాబు మీదకు పోయింది. కాని పక్క కాళీగా వుండడంతో సుశీలకు ఒళ్లు జల్లుమంది. గుండె బరువెక్కి పోయింది. కొంతసేపు ఏమీ తోచని స్థితిలో వుండిపోయింది.

తర్వాత భయంతోనూ గాభరాతోనూ లేచి "ఏమండీ ఏమండీ" అని లేపింది భర్తని.

మాధవరావు కంగారుగా లేచి "ఏమిటి? ఏమయింది? " అని అడిగాడు.

"బాబు కనబడలేదు" అని దుఃఖం ఆపుకుంటూ అంది.

మాధవరావుక్కూడా గాభరా కలిగింది. భార్య పక్కలో పడుకున్న బాబు ఏమవుతాడు?

"ఎందుకు గాభరా! వెళ్లి అమ్మకూ, వాళ్లకూ చెప్పు" అన్నాడేగానీ బాబును చూస్తేగానీ భయంపోయేట్టులేదు. సుశీల గబగబా అత్తగారి దగ్గరకు వెళ్లి లేపింది.

ఆమె లేస్తూ "ఏమిటిగోల" అంది.

"బాబు... బాబు కనబడలేదు" అంది.

"అంతేకదా! ఫర్వాలేదులే. పడుకో" ఆవిడ నిర్లిప్తంగా అనేసి తిరిగిపడుకుంది.

సుశీలకు ఆమె ధీమా అర్థం కాలేదు.

"అదేమిటండీ అలాగంటారు. నేను భయపడి ఛస్తూవుంటేను"

"మాలతి దగ్గరే వుంటాడేమోలే. ఎందుకంత గాభరా! వెళ్లి చూడు" అంది కామాక్షమ్మ.

ఆ మాటలు, ఆమె వైఖరి చూసి సుశీల నివ్వెరపోయింది. చంటిపాపడేమయినాడో అని తనకు నోటమాట రాకుండా వుంది. బెంగతో, భయంతో గుండెలు కొట్టుకుంటున్నాయి. వీళ్లకు మాత్రం చీమకుట్టినట్టయినా లేకుండా ధైర్యంగా వున్నారేమిటి? అని అనుకుంది.

ఇంకా అలా నుంచున్న సుశీలను చూసి కామాక్షమ్మ విసుగుతో, "మరేం బెంగపడనక్కర్లేదు. నీ బాబుని ఎవరూ ఎత్తుకుపోరు! మాలతి దగ్గర వుంటాడులే" అంది.

ఆ పక్కనే వుండి ఆ మాటలు విన్న మాధవరావుకి కూడా బాధ అనిపించిందేమో.

"బాబు కనబడక వెతుక్కుంటూ వచ్చి అడిగితే అలా అంటావేమిటమ్మా! పక్కలో పడుకున్నవాడు, వదినగారి దగ్గరకెలా వెళతాడు? " అనడిగేడు, తనూ ఆతృతతో వున్నాడు కాబట్టి.

"నాకు మాత్రం ఏం తెలుసు? పిల్లాడు ఏడిస్తే ఈవిడకు తెలివి రాకపోతే తీసిందేమో! అన్నానంతే"

అప్పటికప్పుడే సుశీల మాలతీ వాళ్ల గదిలోకి దారితీసింది. ఆ ఆతృతలో ఆమెకు సమయం, సందర్భం ఏమీ లెక్కలోకి రాలేదు. తన బాబు ఎక్కడున్నా చూడాలని తప్ప మరో విషయం ఆమెకు స్ఫురించలేదు. ఆమె హృదయం అందుకే తొందరపడుతోంది.

మెల్లిగా తలుపు తోసుకువెళ్లింది. మాలతి పక్కలో హాయిగా పడుకుని నిద్రపోతున్నాడు బాబు.

"తన పక్కలోని బాబును తనకు తెలియకుండా తీసుకుపోవడం ఏమిటి? ఆశ్చర్యంగా వుందే. ముద్దుకొద్దీ అలా చేసివుంటుందా? పిల్లలు లేనివాళ్ల బాధ ఇలాటిదా?

మెల్లిగా వెళ్లి పిల్లాడిని తీసుకుంది. పాలు చేపుకు వచ్చి గుండెల కదుముకున్నది. ఆ పక్కలో పాలసీసా చూసి గతుక్కుమంది. తన తోటికోడలు ఎందుకిలా చేసిందో బోధపడక ఆశ్చర్యపోయింది.

ఆ సందడిలో మాలతికి తెలివివచ్చింది, సుశీలను చూసి ఏమీ అనకుండా వూరుకుంది. సుశీల బాబును తీసుకుపోతున్నా లేవలేదు. ఒక్కమాట కూడా అనలేకపోయింది. ఏదో పొరపాటు చేసినదానిలా మొఖం చెల్లక వూరుకుంది.

సుశీల బాబుతో ఇవతలకి రావడం కామాక్షమ్మ చూసి ఏమీ అనలేదు. తన గదిలోకి వెళ్ళిపోయింది. మాధవరావు ఆశ్చ ర్యంగా చూశాడు.

"చూశారా! బాబును ఆఖరికి నా దగ్గర పడుకోనివ్వకుండా చేస్తున్నారు" అంది కోపంతో.

"అడగలేకపోయావూ"

"ఆమెకు తెలివి వచ్చినా మాట్లాడలేదు, ఇంక అడిగేదేమిటి? "

"పోనీ! అక్కడే పడుకోనివ్వలేకపోయి నావా? పాపం వదిన ఎంత కోర్కెతో తీసు కువెళ్లిందో"

ఆ మాటలు వింతగా తోచేయి సుశీలకు.

"మీరు కూడా అదే మాటా? "

"అదికాదు సుశీలా! బాబు వదిన దగ్గరు న్నాడని చూసేవుకదా! ఈ రాత్రప్పుడు తీసు కురాకపోతేనేం" అంటూ నవ్వుతూ వచ్చి ఆమె భుజంమీద చేయివేశాడు.

సుశీలకు అతని ఉద్దేశం అర్థమయి అసహ్యం వేసింది. ఒకవైపు బాబుకోసం తను ఆవేదన పడుతూవుంటే ఇతనికీ ఉత్సాహం ఏమిటి? అతని కోరిక కోసం బాబుని ఎవరి దగ్గరో పడుకోబెట్టాలా? బాగానే వుంది. ఈ మగవాళ్లకు బుద్ధిపు డితే, పరిస్థితులు, సమయం, సందర్భం, ముందూ, వెనకా, ఏమీ చూడరు.

"బావుందండి మీరన్నది. పాపం బాబుకు ఎంత ఆకలి వేసిందో ఏమో. తల్లిని నేను వుండగా సీసాపాలు వాడికేం ఖర్మ" అని బాబును ఒడిలోకి తీసుకుంది.

మాధవరావు మరేమీ అనలేదు.

బాబుకు కడుపునిండా పాలిచ్చి మీద చెయ్యి చుట్టు పెట్టుకొని, హృదయంలో దాచుకుని మరీ పడుకుంది సుశీల. ఆమెకు ఆ రాత్రి మరి నిద్రపట్టలేదు. ఎంతసేపూ ఎందుకిలా జరిగింది? మాలతి అట్లా ఎందుకు చేసింది? అత్తగారితో చెబితే ఆమె అంత ధీమాగా ఎలా చెప్పింది? ఇదంతా, చూస్తే తనకు తెలియకుండా అత్తగారూ, మాలతీవాళ్లూ కలిసి ఏదో పథకం వేస్తు న్నట్లు అనిపించింది సుశీలకు. ఈ ఆలోచ నలతోనే తెల్లారిపోయింది.

ఆ మర్నాడు మాలతి లేచి మామూలుగా తిరగజొచ్చింది. ఆ విషయమే ప్రస్తావించ లేదు. ఆ సంఘటనను ఆ ఇంట్లో ఎవరూ అంతగా పట్టించుకోలేదు.

కామాక్షమ్మ మాత్రం "ఏం సుశీలా రాత్రి ఏదో సరదాపడి పాపం మాలతి బాబును పడుకోబెట్టుకుంటే, కొంప మునిగిపోయి నట్టు వచ్చి పెద్ద కేకలు పెట్టి పక్కలోనుండి తీసుకున్నావు" అని అడిగింది.

ఆ మాటలు ఎక్కడలేని ఆశ్చర్యాన్నీ కలి గించేయి సుశీలకు. ఏం జవాబు చెప్పాలా? అని ఆలోచిస్తూవుంటే తిరిగీ ఆమె-

"దాని కడుపున ఒక కాయ లేకపోవడం చేతనేకదా ఆ బాధ! అంత మాత్రంలో ఏం పోయిందీ? " అని తిరిగి అడిగింది.

ఇంక వూరుకోలేకపోయింది సుశీల.

"అలాగని మొదటే చెప్పలేకపోయారా? నాకు తెలివి వచ్చేసరికి, పక్కలో పిల్లాడు కనబడకపోయేసరికి భయంవేసి మిమ్మల్ని లేపి చెప్పేను. అంతేగాని మరేంలేదు. పాలు తాగి చాలా సేపయింది, ఇద్దామని తీసుకున్నాను" అని అంది.

"ఆకలివేసి ఏడిస్తే అది చూసుకోదూ! సీసాపాలు వుండనే వున్నాయిగా" అంది కామాక్షమ్మ

"బావుందండీ, తల్లిని నేను వుండగా, నా దగ్గర పాలువుండగా పోతపాలేం ఖర్మ! అయినా బాబు నా దగ్గర లేకపోతే నాక దోలా వుంటుంది సుమండీ!" అనేసి వెళ్ళిపో యింది.

తర్వాత ఎండ చల్లబడ్డవేళకి సాయంత్రం కాఫీ తాగుతూ కామాక్షమ్మ.

"సుశీలా పాపం, మాలతి ముచ్చటపడు తోంది. దానికి మరి ఆ ఆశలేదుకదా!

బాబుని మాలతికి పెంపకం ఇస్తే బావుంటుంది. ఏమంటావు? "అంది ఎంతో నెమ్మదిగా.

ఆ మాటలు విని సుశీల అవాక్కయిపోయింది.

నమ్మలేక "ఏమిటండీ?" అని ప్రశ్నించింది.

మాలతి "ఏంలేదు చెల్లీ... నీకు తెలుసుగా మేమెంత బాధపడుతున్నామో! పైవాళ్లయితే, ప్రేమా? పేగా? విజయకుమార్‌ని ఇప్పటినుండీనా దగ్గర వుంచుకుంటే చనువు అవుతాడు. మా పిల్లవాడిలాగే వుంటాడు. మా సరదా, కోరికా తీరుతాయి. వాడు నీ వాడయితే ఒకటీ, మా వాడయితే ఒకటీనా? ఇంట్లోనే వుంటాడుగా. నువ్వు చూస్తూండవచ్చు అయితే కొంచెం ఎడంగా వుంచితే చాలు ఏమంటావు? నీవు కన్న దగ్గర్నుండీ మేమెంతో ఆశపడ్డాం" అంది.

బావగారు కృష్ణారావు కూడా అక్కడికి ఏదో పని వుండివచ్చినట్టు వచ్చి తనూ ప్రాధేయపూర్వకంగా చూశాడు.

మామగారు ఆత్రంగా వింటున్నా తనకు కాదన్నట్టు మాటాడలేదు.



భర్త మాధవరావు అప్పటికి అక్కడలేడు.

అంచేత సుశీల ఊహించలేని స్థితిలో వుంది. "కడుపుపండి, పిల్లవాడిని చూసుకుని మురిసిపోతూవుంటే ఇదేమిటీ విపరీతం! ఏమీటీ పిడుగులాంటి సమస్య. ఇలా లోకంలో ఎక్కడయినా జరుగుతుందా?

ఏదో వస్తువుని అడిగినంత చులకనగా ఇమ్మని అడుగుతున్నారు. ఎంతో ఆప్యాయంగా తెచ్చుకున్న వస్తువునే ఎవరయినా అడిగితే యియ్యమే అలాంటిది కన్నకొడుకుని, అదీ తొలినోము పంటని, ఇచ్చివేయడమా? అంత గతి తనకేం వచ్చింది?

వీళ్లందరూ మనుష్యులు కారా? అడగడానికి వీళ్ల నోరు ఎలా వచ్చింది? జాలి, అభిమానం, ప్రేమ, వీళ్లలో లేవా? వీళ్ళ స్వార్థానికి తన కన్నకొడుకుమీద వాత్సల్యం, ప్రేమ త్యాగంచేసి, అభిమానాన్ని చంపుకుని, వాళ్లకు ఇచ్చివేసి, లోలోన ఏడుస్తూ కుమిలిపోతూ తను బ్రతకాలా? ఇది నిజమా? హాస్యమా? అత్తగారు మాత్రం ఆడది కాదా? పిల్లలను కనలేదా? కడుపు తీపి తెలియనిదా?

పోనీ ఒకరిద్దరు పిల్లలు పుట్టేక ఈ మాట అంటే బాగానే వుండేది. ఇంకా తొలిబిడ్డ. తన ముద్దూ, ముచ్చటా తీరేది ఎలా? గుండె రాయి చేసుకోగలదా? లేక,

లేక చేసేదేముంది? ఇంట్లో అందరూ ఏకమయిపోయాక ఎదిరించి ఎక్కడ బతుకగలదు? ఎవరున్నారని, తనను వెనకేసుకురావడానికి.

అందుకని భయపడి, ప్రేమను చంపుకొని, కన్నకొడుకును మనోధర్మానికి వ్యతిరేకంగా త్యాగం చేయడమా? ఇదెక్కడి న్యాయం? లేదు అలా జరగడానికి వీల్లేదు. తను పుత్రప్రేమని హృదయంలోంచి తీసి పారేయలేదు. మనసు రాయి చేసుకోలేదు. అలా జరగడానికి వీల్లేదు అనుకుని

"ఈ బాబుని నా దగ్గరే వుండనివ్వండి. ఈసారి మీ కోరిక కాదనను" అని ఎదురులేని నిశ్చయంతో అన్నది మెల్లగా.

ఈ మాటలు విని అందరూ మూతులు ముడుచుకున్నారు. ఎవరూ ఏమీ అనలేదు. కృష్ణారావు చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయాడు. మాలతి కోపంతో లేచి వెళ్లిపోయింది. కామాక్షమ్మ మింగేసేలా గుడ్లెర్రజేసి వూరుకుంది. కాశీపతి నిర్లక్ష్యంగా చూసేడు.

సుశీల గుండె నిబ్బరం చేసుకుంది. ధైర్యం తెచ్చుకొని బాబుని గుండెలనదుముకుంది.

"నువ్వూ నేనూ ఒకటి. మనలను ఎవరు వేరుచేయగలరు? " అనుకుని బాబు పాలు తాగుతూవుంటే ఆ పారవశ్యంలో వుండిపోయింది.

ఆ తర్వాత మాధవరావు రాగానే ఆ విషయం చెప్పింది. మాధవరావు ఆశ్చర్యంగా విన్నాడు.

"అలాగని అమ్మ కూడా అందా? "

"ఒక్క మీ అమ్మగారేమిటి? ఇంట్లో అందరూ అదేమాట"

"సరే నేను అడుగుతాలే" అని అప్పటికి వూరుకున్నాడు.

ఆ తర్వాత మాధవరావూ, తల్లీ, కృష్ణారావూ ముగ్గురూ ఆ రాత్రల్లా ఏమిటేమిటో కలిసి మాట్లాడుకున్నారు.

మొత్తంమీద, కామాక్షమ్మ, కృష్ణారావూ కలిసి, మాధవరావుని ఒప్పించి ఒక దారిలోకి తీసుకువచ్చారు.

మాధవరావు ఎటూ అనలేకపోయావాడు తన అన్నగారు, తల్లి అంత ప్రాధేయపడుతూ వుంటే కాదనలేకపోయాడు.

మళ్లీ సుశీల ఆ సంగతి ఎత్తినప్పుడు,

"పోనీ వాళ్లంత ప్రాధేయపడుతున్నప్పుడు అలాగే అనలేకపోయినావా? మనకు మళ్లీ పిల్లలు కలుగరు కనుకనా? " అని అన్నాడు.

ఆ మాటలకు ఆశ్చర్యపోయింది సుశీల.

ఇక తనకు ఉన్న ఆ ఒక్క ధైర్యం ఈ

మాటతో పోయింది. ఇక తనకా ఇంట్లో దిక్కూ మొక్కూ లేదు. తన మాటకు విలువలేదు.

"అదేమిటండీ మీరూ అలాగే అంటారు. పోనీ, ఆ రెండవమాటు పుట్టిన పాపనే ఇచ్చేద్దాం" అని అంది కంటనీరు పెడుతూ.

"అబ్బబ్బ! ఏంటీ సోది! అటు వాళ్లకీ చెప్పలేను. ఇటు నీకూ చెప్పలేను. సర్దుకుపోవడం ఎవరికీ తెలియదు. వాళ్లేం పరాయివాళ్లా? అన్నయ్యే కదూ! అందుకనే ఆశ పడుతున్నారు. ఎవరినో ఒకరిని ఇవ్వడానికి ఇష్టపడ్డాక, ముందయితేనేం, వెనకయితేనేం! మహా నీకేగాని ఇంకెవరికీ పిల్లలు లేనట్టు అలా యిదయిపోతున్నావు" అని చిరాగ్గా అనేసేడు.

ఆ మాటలు విని సుశీల హృదయం చెదిరిపోయింది.



ఆ తర్వాత ఇంట్లో ఒక భయంకరమైన వాతావరణం ఏర్పడింది. ఇంట్లో ప్రతి ఒక్కరూ ఆమెను వెలివేసినట్టు చూడడం, ఏదో కసితో మాట్లాడడం మొదలుపెట్టేరు.

మాలతి మాటలే మానివేసింది. మాటిమాటికీ విసుక్కుంటూ వుండడం, లేనిపోని చాడీలు చెబుతూండడం, పని అంతా సుశీలమీద వదిలివేయడం జరుగుతోంది.

కామాక్షమ్మ నిప్పులు చెరగడం ప్రారంభించింది. అనేక విషయాల్లో ఆమె, మాలతీ, ఏకమయి సుశీలను సాధించడం మొదలు పెట్టారు.

ఈ బాధలన్నీ పైకి కనబడవు. ఎవరితో చెప్పుకుంటుంది?

పద్మతో ఎట్లాగయినా ఈ విషయం చెప్పాలనుకుందిగానీ ఈ సంఘటనలు జరిగినప్పుడు పద్మ లేదు. ఎందుకో వాళ్లవాళ్లు పిలిస్తే వెళ్లిపోయి ఆ మర్నాడు వచ్చింది.

సమయం చూసుకుని ఎవరూ వినకుండా ఈ విషయాలన్నీ చెప్పి ఏడిచింది సుశీల.

ఆ మాటలు వింటూనే ఆశ్చర్యపోయింది పద్మ.

"నిజంగానా సుశీలా అట్లా అడిగారా? నీ తొలిచూలు కొడుకునే పెంచుకుందికి ఇమ్మని అడిగారా?" అని నమ్మలేక అడిగింది.

"పద్మా, నేను అబద్ధం ఆడుతున్నాననుకున్నావా? నువ్వు తప్ప నా ఏడుపు వినేవారు ఈ ఇంట్లో ఎవరూ లేరని చెప్పేనుగాని" అని కళ్ల నీళ్లు తెచ్చుకుంటూ అంది.

"ఎంత అమానుషం, బావగారు ఏమన్నారు?"

"మొదట్లో తనకీ ఇష్టంలేదు, కాని తర్వాత తల్లీ, కొడుకూ, వదినగారూ మాట్లాడుకుని ఏమనుకున్నారో! అతనూ అదేమాట అన్నారు ఆఖరికి"

"బాగానే వుంది, పెద్ద బావగారేమన్నారు?"

"ఆయనా అక్కడే వున్నారు, అతనికీ ఆ ఉద్దేశం లేకపోతే ఏమీ అనకుండా వూరుకుంటారా?"

"ఆశ్చర్యంగా వుందే. అయితే అంతా ఏకమయ్యే ఈ ప్లాను వేసినట్టువుంది"

"అలాగే అనిపిస్తూంది?"

"మరి నువ్వేమిటన్నావు?"

"నేను ససేమిరా ఇవ్వనన్నాను. నా కంఠంలో ప్రాణంవుండగా ఇవ్వను కూడా!"

"మంచిపని చేశావు. ఆ ధైర్యంతోనే

వుండు, నిన్నేమి చేయగలరు. మళ్ళీ ఆ ప్రసంగం వస్తే చూద్దాం. నువ్వు మాత్రం బెంగపడకు. భయపడకుండా ధైర్యంగా వుండు"

"ఏమిటో పద్మా నాకు మాత్రం భయంగా వుంది" అని ఏడ్చింది సుశీల.

"ఛీ ఏడవకు సుశీలా! ఎవరయినా నిన్నేం చేయగలరు? నీకిష్టం లేనిది నిన్ను, నీ బాబునూ వేరుచేయడానికి ఎవరికి అధికారం వుంది? నేనూ మీ మరిది వుండగా వాళ్ళేం చేస్తారో చూద్దాం" అని ఓదార్చింది.

సుశీలకు అంతకన్నా చెప్పడానికి వ్యవధి దొరకలేదు, పద్మతో మళ్ళీ ఏకాంతమూ దొరకలేదు.

తర్వాత ఇంట్లో అట్టే గొడవలు జరగకపోయినా, సుశీల పనిలో కాస్త ఆలస్యం చేసినా, పిలిస్తే పలుకకపోయినా లేవడం ఆలస్యం అయినా-

"బిడ్డల్ని మేమూ కన్నాం! గాని ఈ విడ్డూరం ఎరగమమ్మా" అనీ "ఆ మా గొప్ప కన్నది. లోకంలో ఇంకెవరికీ బిడ్డలు లేరు" అని.

"ముద్దుకి బిడ్డ చెడ్డది, మురిపానికి మనవు చెడ్డది అని"

ఇలా సూటిపోటి మాటలు కామాక్షమ్మ.

"ఏం జేస్తామమ్మా! పెట్టి పుట్టని వాళ్ళం" అనీ.

"పెరటి చెట్టు మందంటే ఇల్లెక్కి కూర్చుందట అలా వుంది" అని.

"ఈ అపురూపాలు ఎంత సేపులే" అని మాలతీ దెప్పడం మొదలెట్టేరు.

ఎవరెలా అనుకుంటున్నా సుశీల లెక్క చేయలేదు. వినీ వినిపించుకోకుండా వూరుకొనేది. తన బాబు, తన లోకం ఇదే ఆమె ధ్యాస. ఇంటెడు చాకిరీ చేశాక కూడా ఎవరికయినా తృప్తా! సానుభూతిగాని, జాలిగాని చూపేవారు లేరు.

"అయ్యో తల్లీ! ఒక్క నిమిషం విశ్రాంతి తీసుకో అనేవారున్నారు గనుకనా! ఆఖరికి భర్త మాధవరావు కూడా చూసీచూడనట్టు పట్టించుకోకుండా తప్పించుకుంటున్నాడు. సుశీల మొరటుబారిపోయింది.

తెల్లవారుజామునే లేవడం, పాచిపనులు చేయడం, కాఫీలూ, ఫలహారాలూ, అందరికీ చేయడం, వంట వండడం, అందరికీ టైము టైములకు వడ్డించడం. తర్వాత మళ్ళీ కాఫీలూ, టిఫిన్లూ రాత్రివంట! వడ్డనలూ! ఇవన్నీ జరిగాక, ఇల్లు చక్కబెట్టుకోవడం అయ్యేసరికి ఏ రాత్రి పదకొండో అవడం... కాస్త నిద్రపోయేసరికి మళ్ళీ తెల్లవారుజామున ఈ చాకిరీ చక్రం, ఆమె జీవితంలో రోజూ తిరుగుతుంది. ఆమె దినచర్య అదే అయింది.

దయపుడితే అత్తగారు వంటలోనూ, మాలతి పైపనుల్లోనూ చేయి పెడతారు. లేకపోతే లేదు. ఈ విషయాలు ఎవరూ పట్టించుకోరుగానీ, ఏ లోటు వచ్చినా, ఆలస్యమయినా అక్షింతలూ, ఆశీర్వచనలూ తప్పవు సుశీలకు.

అంత ఊపిరి సలపని పనిచేస్తూనే బాబు సంగతి చూసుకోవాలి. ఇంట్లో అందరూ తిన్నాక ఏమయినా మిగిలితే అదీ సహిస్తే తినేది లేకపోతే లేదు.

భయంతో, బెంగతో ఎవరి సాయమూ, సానుభూతీ లేక ఆర్ద్రత లేని హృదయంతో, దుర్భరంగా రోజులు గడుపుకొస్తున్నది సుశీల. విసుగూ విరామం లేని పనితో, శక్తికి మించిన చాకిరీతో మనోవ్యధతో చిక్కిపోజొచ్చింది.

"ఏమలా వున్నావనేనా" అడగరు. కట్టుకున్న భర్త కూడా తనని అలాగే చూస్తున్నందుకు బాధపడసాగింది సుశీల. చెప్పినా ఏం లాభం? అనుకుని వూరుకుంది.

ఎప్పుడయినా ఏదయినా అంటే,

"వాడుంటే చాలు నీకు, మేమందరం ఎందుకు? ఇవతల మొగుడూ, వాడి అవసరాలూ, కావలిస్తేనా?" అని విసుక్కునే

వాడు.

కాస్త ధైర్యం చెప్పేది పద్మ. ఆ తర్వాత కొద్దిరోజులకే మోహన్‌కి హైదరాబాదులో ఉద్యోగం రావడంతో వెళ్ళిపోవడం కూడా పదిహేనురోజుల్లో జరిగిపోయింది.

ఇన్నాళ్లూ పద్మ కాస్త అండగా వుండేది. కష్టం, సుఖం చెప్పుకుని, హృదయం తేలిక పరుచుకొనేది. ఎప్పటికయినా ఆమెవల్ల ఇంట్లో మార్పు వస్తుందని ఆశపడేది. చదువుకున్న పద్మ, మంచీ, చెడూ ఆలోచించే మనసు గల మోహన్ వుండబట్టి వారికి భయపడి అయినా ఇంట్లో కామాక్షమ్మ, మాలతీ, ఎవరి హద్దుల్లో వారు వుండేవారు.

పద్మ వెళ్లిపోయాక ఆ ఇంట్లో అందరూ పగ్గాలు లేని గుర్రాల్లా తయారయ్యేరు. బాబుని మాలతికి పెంపకం ఇవ్వాలని వారి మనసుల్లో ఎలా ప్రవేశించిందోగాని, అది మంచిదా? కాదా? అన్న ఆలోచన, విచక్షణాజ్ఞానం వారిలో లేకపోయింది.

సుశీల ఎప్పుడయితే "నేను ఇవ్వను" అని చెప్పేసిందో అప్పటినుండి "నా మాట కాదంటుందా? " అని పంతంతో ఎలాగయినా, బాబుని మాలతికి ఇచ్చివేయాలనే కామాక్షమ్మ నిశ్చయించుకుంది.

మాధవరావేమో "ఏడాది తిరిగిందో లేదో పెళ్ళి అయి, కొంప మునిగిపోయినట్టు కనేసేవు, కాస్త వాళ్లు ఆడిస్తామంటే ఎందుకలా ఏడుస్తావు. హాయిగా వుండరాదూ? " అంటూంటే అతనిలో తండ్రి ప్రేమ వున్నదా అనిపించింది సుశీలకు.

★ ★ ★

ఒకరోజు ఆ వీధిలో పేరంటానికి అందరినీ పిలిచారు. సుశీల అక్కడకు వచ్చిన దగ్గర్నుండి పేరంటానికిగాని పిలుపులకుగాని వెళ్ళలేదు. భర్తతో కలిసి మార్కెటింగుగాని, సినిమాకుగాని వెళ్ళడానికి అసలే నోచుకోలేదు. ఎప్పుడూ ఇంట్లో వుండవలసిందే. అలాంటి సందర్భాలు వచ్చేసరికి అందరూ మొహాలు చిట్లించుకొనేవారు, ఎవరికీ యిష్టం వుండేది కాదు.

కాని ఆరోజు సుశీలను వెళ్లమని కామాక్షమ్మ అనడం, మాలతి తొందర పెట్టడం వింతగానే తోచింది. చిన్న మరదలు లక్ష్మినీ, తననూ వెళ్లమన్నారు. ఎప్పుడయినా కాసేపు ఎక్కడికయినా వెళ్ళి కాస్త ఊపిరి తీసుకుందామా అనిపించేది సుశీలకు. ఈ రోజు అవకాశం వచ్చేసరికి బయలుదేరింది.

బాబుకి బట్టలు తొడగబోయిందిగాని కామాక్షమ్మ వారించింది. "పేరంటానికి నలుగురూ వస్తారు, దిష్టి తగులుతుంది, వాడిని యిక్కడే వుంచి నీవు వెళ్ళు, మేం వున్నాంగా!" అని.

తనతో వస్తుందనుకున్న మాలతి రాలేదు, తనూ, మరదలు లక్ష్మి బయలుదేరారు.

ఆ పేరంటానికి వెళ్లడం సుశీల మనసుకు ఏదో తృప్తినిచ్చింది. హృదయం ఎంతో తేలికపడింది. నలుగురితోనూ హాయిగా మాట్లాడేక ఏదో బరువు దిగినట్టయింది. కలకలలాడుతూ ఉత్సాహంగా అందరూ ముచ్చట లాడుతూ వుంటే ఆనందించింది. ఒక గంటో రెండు గంటలో గడిపి సాయంత్రానికల్లా తిరిగి వచ్చింది.

ఇంట్లో అత్తగారు ఒక్కతే వుంది! మామగారు ఎక్కడికో వీధిలోకి వెళ్లేరు! అంతా నిశ్శబ్దంగా వుంది. మాలతి కనబడకపోతే బాబునెక్కడికో తీసుకువెళ్లి వుంటుందని, కొంతసేపు వూరుకుంది. అడిగితే ఏమంటుందో అన్న భయం చేత. కానీ రాత్రి ఎనిమిది అయినా మాలతిగాని, బాబుగాని జాడలేరు. సుశీలకు ఆతృత లావయింది.

బాబుకు ఆకలివేళ. ఈపాటికపుడే పాలు త్రాగి పడుకోవలసిన టైము, సుశీల మనసు తల్లడిల్లిపోయింది. ఆరోజున చీకటి పడినా భర్తగాని, బావగారుగాని, మామగారుగాని ఎవరూ యింటికి రాలేదు.

సుశీల మెల్లగా కామాక్షమ్మ దగ్గరకు వెళ్ళి,

"ఏమండీ బాబు... ఆకలివేళ అయింది!"

అని అడిగింది.

కామాక్షమ్మ వినీవినిపించుకోనట్టు వూరు కుంది.

"అత్తయ్యా బాబు ఏడీ? " అంది గట్టిగా.

"ఎందుకలా యిదవుతావు! వస్తాడులే! మరేం ఫరవాలేదు, నీ బాబుని నీకన్నా అందరూ బాగానే చూస్తారు లే!" అంది విసురుగా.

"అది సరే లెండి! బాబు ఏడి? ఎవరు తీసుకువెళ్లారు!"

"ఎవరో ఒకరు తీసుకువెళ్లారు, వస్తాడు గాని నువ్వెళ్ళి పడుకో!"

"బాబు లేనిదే... నాకు నిద్రపట్టడం లేదండి!"

బాబు నీదగ్గర పడుకోడు. నువ్వెళ్లి పడుకో!"

"పోనీలెండి... బాబు ఎక్కడికి వెళ్లేడో చెప్పండి!"

"నీకు కాదూ చెప్పేది? మేమేం నీ బాబును తినేయం లే! మాలతి సినిమాకు వెళుతూ తీసుకువెళ్లింది సరదాపడి! వచ్చేస్తారు! యింక పోయి పడుకో!" అని కసురుతూ అంది.

ఆ మాటలు విన్నాక సుశీల ఒళ్లు మండి పోయింది. పేరంటానికి తీసుకువెళతానంటే ఒద్దన్న మనిషి, మాలతి సినిమాకు తీసుకు వెళితే ఎలా వూరుకున్నది? తన బిడ్డను తన దగ్గర వుండనివ్వకుండా ఒకరికి యివ్వడానికి ఆవిడకేం హక్కువుంది? అని సుశీల కోపాన్ని సహించుకోలేకపోయింది.

"మీరు మనుషులా ఛీ!" అని అప్రయత్నంగా కోపం పట్టలేక అనేసింది.

"ఆ, ఏమన్నావ్! ఎంత పొగరు! నన్నే ఛీ అంటావ్? నీకెంత గుండెధైర్యం!"

అంటూ కామాక్షమ్మ కోపంతో కాళికలా తయారయి ఒక్కవూపుని సుశీల జుట్టు పట్టుకొని ఎడాపెడా దవడమీద వాయించింది.

సుశీలకు తను ఏమన్నదో, అది పొరపాటో కాదో, ఏమీ తెలియని స్థితిలో వున్నది. ఒక్కసారి అత్తగారు అట్లా మీద పడేసరికి ఏమీ తోచకపోయింది. దెబ్బలు చుర్ చుర్ మని తగలగానే అత్తగారి రెండు చేతులూ పట్టుగొని ఒక గోడకు చేర్చి నిలబెట్టేసింది. మరి కొట్టడానికి వీల్లేకుండా అడ్డుకున్నది.

కామాక్షమ్మ ఎంత రాక్షసి అయినా సుశీల నిలబెట్టేసరికి ఏమీ చెయ్యలేక వదిలేసింది, కాని యింకా కొట్టనివ్వలేదన్న రోషం సుశీల బలం ముందు తను ఓడిపోయానన్న చేతకాని తనం ఆమెని రేకెత్తించాయి.

"అమ్మో అమ్మో! నామీదే కలియబడతావటే! నీకెంత ధైర్యం వచ్చింది! నువ్వు కోడలివి కాదు నా పాలిటి కొరివి దయ్యానివి!" అంటూ పెద్దగా అరుస్తూ ఏడవడం మొదలెట్టింది.

అప్పుడే ఇంటికొచ్చిన కాశీపతి, మాధవరావు ఆ దృశ్యం చూసి నిలబడిపోయారు.

వాళ్లను చూసి సుశీల గదిలోకి వెళ్లిపోయింది.

కామాక్షమ్మ అదే అదును అనుకొని, "చూశారా! చూశారా! ఈ ముదనష్టపు ముండ ఎంతకు తెగించిందో! నన్ను చేతులు విరిచి గట్టిగా గోడకు అణచివేసి నిలబెట్టి కొట్టటమే తరువాయి! యింతలో మీరు వచ్చారుగాని లేకపోతే నన్నేం చేసేదో!" రాగాలు మొదలెట్టింది.

"ఏం జరిగిందేమిటి? " అని కాశీపతి అడిగేడు.

"మాలతి, కృష్ణ కలిసి సినీమాకు వెళ్లారు కదా, ముచ్చటపడి బాబును కూడా తీసుకు వెళ్లారు. యిప్పుడే వచ్చేస్తారు అని చెప్పేను దానికి 'అత్తేరీ! ... మీరు మనుషులా? నన్నూ పిల్లాడినీ వేరు చేస్తారా? రాక్షసి వెధవల్లారా? చూడు నిన్నేం చేస్తానో!' అంటూ నన్ను పట్టుకు కొట్టడానికి వచ్చింది! చేతులు విరిచేసింది..." అని లేనివి పోనివీ చెప్పింది.

"ఇన్నాళ్లూ ఏమిటో అనుకున్నాం... ఆఖరికి నిన్నే కొట్టడానికి సిద్ధపడిందీ?" అని కాశీపతి వంతపాడేడు.

ఆ మాటలు విని అసలు సంగతేమో తెలుసుకోకుండా మాధవరావు గభాలున గదిలోకి వెళ్ళి సుశీలను పట్టుకొని చేతికొచ్చినట్టు కొట్టడం మొదలెట్టేడు.

భర్త కొడుతూవుంటే సుశీల ఏమో చెప్పబోయింది కాని అతను, కోపంలో, చికాకులో వినిపించుకొనే స్థితిలో లేడు. చెయ్యి నొచ్చేంతవరకూ కొట్టి మంచంమీద కూర్చుండిపోయాడు. సొమ్మసిల్లిపోయిన సుశీల కిందనే కూర్చుండిపోయింది.

మాధవరావు మనసులో అలా చేసినందుకు దిగులుపడ్డాడు, గాని తల్లిని ఏమీ అనలేకపోయాడు.

"అయినా దాని సంగతి తెలిసివుండి ఎందుకమ్మా బాబుని తీసుకుపోనిచ్చేవు?" అని వూరుకోలేక తల్లితో అన్నాడు.

"అదేం విడ్డూరంరా నాయనా!... ఓ నాలుగయిదు గంటలకు ఏం కొంపలు మునిగిపోతాయి గనక? అయినా దానికి పిల్లలు కారనే కదా, ఈ ప్రారబ్ధం! లేకపోతే హాయిగా తనూ వుండేది! ఒక యింట్లో వున్నాక ఒకరి వస్తువు ఒకరు తీసినా చూడలేక, ఒకరి పిల్లని ఒకరు ఎత్తుకున్నా చూడలేకపోతే ఎట్లారా? బతకడం!... ఇదంతా చూస్తే, ఈవిడకు మనందరం కలసి వుండడం యిష్టం వున్నట్టులేదు, నీ చేత వేరింటి కాపురం పెట్టిద్దామనే యిలా చీటికీ మాటికీ జట్టీలు పెడుతూంది!" అని ఎవరూ వూహించనివి కలిపించి కొడుకు దగ్గర అన్నది.

"దానికీ... దీనికీ సంబంధం ఏమిటమ్మా, నువ్వు మరీని. ఈ యింట్లో సర్దుకొనే స్వభావం ఎవరికీ లేదు! ఎవర్నంటే వారికే కోపం!" అని మాధవరావు అన్నాడు.

"నా కంఠంలో ప్రాణం వుండగా అలా జరగనిచ్చేది లేదు!" అని కాశీపతి పెద్ద మొనగాడిలా అన్నాడు.

అందరి భోజనాలూ అయాయి. సుశీల మాత్రం పడుకున్నది మరి లేవలేదు, భోజనం కూడా చేయలేదు. ఆమెని అడిగిన వారూ లేరు.

భోజనం కాగానే మాధవరావు వచ్చి అలా క్రిందనే చాపమీద పడుకునివున్న సుశీలని చూసి లేపడం ఎందుకని వూరుకున్నాడు.

ఆ రాత్రి అంతా అత్తగారూ, భర్తా కొట్టేరన్న బాధతోనూ బాబు గురించి బెంగతోనూ ఏడుస్తూ గడిపింది సుశీల.

ఏ రాత్రికో మాలతి వచ్చినా బాబును మాత్రం యివ్వలేదు. ఒక విధమయిన విరక్తితో రోషంతో సుశీల సహించి వూరుకుంది.

ఉదయం లేవగానే భర్త అడగకపోయినా, అతను లేచి వెళుతున్నపుడు సుశీలే, "నేనేమీ అనలేదండీ! బాబు ఏడి అని అడిగేసరికి అత్తగారే నన్ను జుత్తు పట్టుకు వంచి కొట్టేరు! యింకా కొడుతూ వుంటే చేతులు పట్టుకుని, ఆపుతున్నాను అంతే!" అని అంది.

అతడు విన్నాడో లేదో ఏం జవాబు చెప్పకుండానే వెళ్ళిపోయాడు.

సుశీలకు తప్పుతుందా? ఆమె కూడా లేచి వెళ్లి కాలకృత్యాలు తీర్చుకుని యింటి చాకిరీకి సిద్ధమయింది. ఒకవిధమయిన నిరాశ ఆమెను ఆవరించింది.

తర్వాత కొంతసేపటికి బాబుని తీసుకువచ్చి, చేతుల్లో పెట్టింది మాలతి.

"సినీమాకు వెళుతూ తీసుకువెళ్ళాం. నీతో చెబుదాం అంటే నువ్వు పేరంటానికి వెళ్లేవు! వచ్చేసరికి పడుకుని వున్నావు. లేపడం ఎందుకని యివ్వలేదు!" అంది నవ్వుతూ.

"ఏవమ్మా! నీ కొడుకునేం తినేసిందా! లేక పట్టుకు పారిపోయిందా!... ఈపాటి దానికి ఎంత రాద్ధాంతం చేశావు! నా తల్లీ!" అని

యీసడించింది అత్తగారు

"ఎంత మనం యిదవుతున్నా, దానికి మరీ అంత యిష్టం లేకుండా వుంది! అసలు బాబుని మనం తియ్యకూడదు, ముద్దు చేయకూడదు కామోసు! యింట్లో ఒక చిన్న పిల్లడు కదా, అందరికీ ముద్దు! ఎవరి దగ్గర వుంటేనేం! ఎవరు తీస్తేనేం! మరీ ఎవర యినా ఏదయినా చేసేస్తారేమో అని కిట్టని వాళ్ళని చూసినట్టు చూస్తుందా! పైవాళ్లను అన్నట్టు నోటికెంతవస్తే అంతా అనేస్తుంది!" అన్నాడు కాశీపతి.

ఈ మాటలు మాధవరావు విన్నాడు!

"దానికి తోచదు, ఒకరు చెబితే వినదు! ఏం చేస్తాం!... దాని మాటలకేం? అసలు దాని దగ్గరగాని బాబు పెరిగితే ఈ బుద్ధులే వస్తాయి! వాళ్ళ యింటి వాతావరణమే అంత!" అన్నాడు.

భర్త మాటలు విని సుశీల గతుక్కుమంది. ఆశ్చర్యం, అసహ్యం, కోపం కలిగాయి. ఎంత మగవాడయినా, తండ్రి హృదయం కాదా? అని తలపోసింది. తన దగ్గర పెరిగితే పాడయిపోతాడా? తనూ తనవాళ్ళూ అంత చెడ్డవాళ్ళా? ఏమిటీ మాటలు?

తనకు మరి దారి ఏది? ఎవరితో చెప్పుకొని ఏడుస్తుంది? తనకు సహాయం చేసేది ఎవరు!

సుశీలకు మరే ప్రాపంచిక విషయాల మీదా ఆసక్తి నశించింది ఆ ఇంట్లో తన అవస్థను తలుచుకునీ బాబు భవిష్యత్తును ఆలోచించుకుని బెంగతో కుమిలిపోనారంభించింది. తననూ బాబునూ కలసి వుండ నివ్వరని భయపడసాగింది.

"పేరంటానికి తీసుకు వెళితే దిష్టి సోకుతుందని, చెప్పిన వాళ్లు మాలతి సినీమాకు తీసుకువెళితే ఏ దిష్టీ సోకదు! కన్నతల్లి దగ్గర పెరిగితే పాడయిపోతాడు. పైవాళ్ల దగ్గిర వుంటే బాగుపడతాడు! ఎంత బావుంది! హే భగవాన్!" అని తలచుకొని ఏడ్చింది.

ఎప్పుడయితే ఒకరోజున అలా తీసుకువెళ్లడం మొదలెట్టిందో, ఆ తర్వాత మరి ఎవరినీ అడగవలసిన పనిలేకపోయింది మాలతికి! తను ఎక్కడకు బయలుదేరినా ఆఖరుకు పొరుగింటికి బయలుదేరినా కూడా బాబుని చంకన వేసుకునే పోయేది.

సుశీల అదంతా చూస్తూ కూడా ఏమీ అనలేక వూరుకొనేది.

పొదుగున పాలు తాగుతున్న లేగదూడని అవతలకు లాగివేసి, బలవంతాన్ని పాలు పిండుకొనేటప్పుడు ఆవు మాత్రం ఏం చేస్తుంది?

తన స్వంత పిల్లాడిమీద తనకే హక్కు లేదు! ఎదుర్కొనే స్వతంత్రం, ధైర్యం అంత కన్నా లేవు. అందువల్ల సుశీల యిదంతా బాధతో సహించక తప్పలేదు.

ఇంట్లో మగవాళ్ళు ఎవరూ లేకుండా వుంటే, కామాక్షమ్మ, మాలతీ కలిసి, సూటీపోటీ మాటలు ఆడడం, సుశీల ఏమయినా జవాబు యిస్తే కలిసి కొట్టడం కూడా ప్రారంభించారు.

వాళ్ళకు ఎంత నేర్పు వున్నదోగాని ఆ దెబ్బలు చూసేవాళ్లకు కనిపించేవి కావు.

కాశీపతి ఇంట్లో వున్నా, కామాక్షమ్మా, మాలతీ పట్టించుకునేవారు కాదు. కాని, మాధవరావుగాని కృష్ణారావుగాని ఇంట్లో వుంటే ఇట్లా ఏమీ అనేవారు కాదు! ఏదో తిట్ల సంబరంతో కానిచ్చేవారు. మాధవరావు యింక వస్తాడనే ముందు సుశీలను మొహం అవీ, కడుక్కోమని, మంచి చీర కట్టుకోమని, శుభ్రంగా వుండమనేవారు. అలా చేయనంటే మరో రెండు వేసి భయపెట్టి బలవంతాన్ని చేయించేవారు.

వారు చేసేవేవీ భర్తతో చెప్పడానికి వీల్లేదు! అంచేత యివేవీ మాధవరావుకి తెలిసేవి కాదు. ఆ అవకాశం రాకుండా కామాక్షమ్మా, మాలతీ చాలా జాగ్రత్త పడే

వారు.

సుశీల కూడా చెప్పడానికి నమ్మదగిన రుజువులేదు. ఏమని చెబుతుంది? దెబ్బలు కనబడితేన్నా! చెప్పినా నమ్ముతాడా!

రానురాను బాబును రోజుకు ఒక పావు గంటయినా సుశీలతో వుంచడం కరువయి పోయింది.

ఏదో ఒక అపురూపమయిన వస్తువును పిల్లలు ఏడిస్తే ఒకసారి ఆడుకుందుకు యిచ్చి, వెంటనే లాక్కుని దాచేసినట్టుగా సుశీలతో ప్రవర్తించటం మొదలెట్టేరు. ఒక్కొక్కపుడు రెండు రోజులపాటు అసలు బాబు కనిపించకుండా దాచేసేవారు. కళ్లు కాయలు కాచేట్టు పిల్లవాడికోసం చూసిచూసి ఆశ నిరాశకాగా కళ్ళు వాచేట్టు దుఃఖించేది!

దొంగతనంగా బాబుని ఏదో మెరుపులా చూసి, కళ్లలో నింపుకుని అంతే చాలని ఆ ఆనందంతో సొమ్మసిల్లిపోయేది.

★ ★ ★

ఒకనాడు మాలతి తల్లీదండ్రి వచ్చారు, వాళ్ళతోపాటు వితంతువైన మాలతి పిన్నీ, ఆమె కూతురు సరోజ కూడా వచ్చారు.

సరోజకు యిరవై ఏళ్ళుంటాయి, యింకా పెళ్లికాలేదు. ఆమె ఒక్కతే కూతురు. మొగ దక్షతలేక సంబంధాలు చూసేవారు లేక ఎక్కువ కట్నాలు యిచ్చుకోలేక ఆలస్యమయిపోయింది.

మొదట్లో మాధవరావుకే యిద్దామనుకున్నా కాశీపతి కోరిన కట్నం యిచ్చుకోలేక తప్పిపోయింది. సరోజ స్కూలు ఫైనల్ పాసయింది. మరీ ఎక్కువ చదివితే అంతకు తగ్గ సంబంధాలు అసలే తేలేమని మానిపించేశారు.

మాలతి చెల్లెలు విశాలకు పెళ్లి నిశ్చయమయింది. అందుకని పిలవడానికి వచ్చేరు ఒక నెలముందుగనే.

ఇక మాలతి సందడికి అంతే లేదు, ఆవిడ సంతోషానికి మేరే లేదు. తన తల్లిదండ్రులతో ఎంతసేపు మాటాడేదో, ఏమిటేమిటి చెప్పుకొనేదో, ఎంత చనువుగా వుండేదో!

అది చూస్తే సుశీలకు ఎంత సంతోషమనిపించినా లోలోన తనకు ఆ భాగ్యం లేదన్న మనోవ్యధ కూడా కలిగింది. తన తల్లిదండ్రులు అట్లా రావడం, అంత అభిమానంగా వుండడం, ఆ ఆప్యాయతా వాటికి తను నోచుకోలేదు కదా అని బాధపడింది.

ఆ వచ్చిన వాళ్ల కడుపుచల్లగా, ఆ రోజుల్లా బాబు, సుశీల దగ్గరే వున్నాడు. ఒకటి రెండుసార్లు మాలతి తీసుకువెళ్లి తల్లి దండ్రులకు చూపెట్టినా వెంటనే తెచ్చి యిచ్చింది.

ఆరోజున తన మాతృత్వం ఫలించిందని భావించింది సుశీల. తనివితీరా తనూ, తన బాబూ హత్తుకుని వుండిపోయారు! ఆమెలో ఎన్నడూ లేని వుత్సాహం, మాతృకళ వచ్చింది.

అంత ఆనందంగా సుశీల వుండడం మాధవరావు చూసి ఎరగడు.

"ఏం యివాళ మొహం వికసించి వుంది!'' అని వెటకారంగా ప్రశ్నించాడు.

"ఎందుకో కనిబెట్టలేరా? " అని తిరిగి అడిగింది సుశీల.

"ఏమో నీ సంగతి ఒకనాడు నాకు బోధపడితేనా ఈనాడు చెప్పడానికి"

"నా బాబు నా దగ్గర వుంటే చాలు! యివాళ నిజంగా నాకు పండుగే" అని నవ్వుతూ అంది.

ఆ మాట విని మాధవరావు కొంచెం విసుగుతో-

"అవునుగాని సుశీలా! ఒకటి అడుగుతాను చెప్పు! వాళ్ళు అంతలా ప్రాధేయపడుతూ వుంటే- నీ వెందుకంత పట్టుపడుతున్నావు! వాళ్లు మాత్రం పైవాళ్లా, అన్నయ్యా, వదినా కదూ! మనం కాకపోతే వాళ్ళకు మాత్రం ఎవళ్లు? మా వదినకు- ఏదో

జబ్బు వస్తే ఆపరేషన్ చేశారట. దానివల్ల మరి పిల్లలు పుట్టరని డాక్టర్లు చెప్పేరు! కాబట్టి వాళ్ళు బాబుమీద అంత ప్రాణం పెడుతున్నారు! వాడిని పెంచుకుంటే అభిమానం, ఆశ వుంటుందని ఆశపడుతున్నారు. పోనీ వాళ్ళ కోర్కె ఎందుకు కాదనాలి! వాళ్ల దగ్గరే పెరగనివ్వకూడదా? మనకు మళ్ళీ సంతానం కలుగకపోతుందా? ఏడాది తిరగకుండా బాబు పుట్టేసేడు... ఏం ఆనందం అనుభవించాము? సరదాగా, నిశ్చింతగా కొన్నాళ్ళపాటు హాయిగా వుండకూడదా? " అని మెల్లిగా వివరంగా చెప్పేడు.

సుశీల హృదయం మళ్లీ దెబ్బతింది! అంత ఆనందంలో వున్న ఆమె మనసులోనూ ముఖంలోనూ విచార రేఖలు అలుముకున్నాయి.

"మీరూ అలాగంటే ఎలాగండీ! తొలికాన్పు బిడ్డ! నాకు ఆశ వుండదా! మళ్లీ మారు ఎవరు కల్గినా, మీ మాట కాదనను"

"మళ్ళీ మొదటికే వచ్చేవు నీకెంత చెప్పినా అంతే- అంత మొండిపట్టు కూడదు... నా మాట విను! బాబుమీద మమకారం తగ్గించుకుందికి ప్రయత్నించు... మా అన్నయ్యకు నేను మాట యిచ్చాను. బాబును పెంపకం యిస్తానని! మా యింట్లో అందరికీ అదే యిష్టం అని నీకు తెలుసు! నీ మనసు మార్చుకున్నావా సరి! లేదా నీకిష్టమయినా లేకపోయినా విజయకుమార్‌ను వాళ్లకివ్వడం జరుగుతుంది! బాబు మీద నీకెంత హక్కువుందో, నాకూ అంతే హక్కు వుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు.

సుశీల ఆ మాటలకు ఒణికిపోయింది. ఆనందం, ఉత్సాహం పోయి అక్కడే కూలబడిపోయింది. భర్త కూడా యింత అమానుషానికి ఒడికడతాడని అనుకోలేకపోయింది! అందరూ పిల్లలు లేని ఒక స్త్రీ హృదయానికి సానుభూతి చూపేవారేగాని, పిల్లలుగన్న తల్లి నుంచి పిల్లను విడదీస్తే, ఆ తల్లి హృదయం పడే వేదనను అర్థంచేసుకొనేవారు లేరే అని దుఃఖించింది

మాధవరావు 'బాబు' విషయంలో అన్న మాటలకు సగం కృంగిపోయిన సుశీలకు ఆ తర్వాత అతని ప్రవర్తనకు పూర్తిగా, మనసు విరిగిపోయింది!

బావ వరసేమో సరోజ మాధవరావుతో సగసాలూ ఛలోక్తులూ మొదలెట్టింది. ఎంతసేపూ యింట్లో గొడవలతో సుశీల ఏడుపు మొహంతో మనసంతా కలచి వుందేమో, సరోజ వచ్చి ఎంతో చనువుతో మాటాడుతూ వుండేసరికి, ఏదో వెలితి తీరినట్టయింది మాధవరావుకి. పైగా సరోజ అలా వుంటున్నాగాని ఎవరూ పట్టించుకున్నట్టు లేదు, అంచేత సరోజ ఒక అడుగు ముందుకువేస్తే తను రెండడుగులు వేయడం మొదలెట్టేడు!

సరోజని తీసుకుని వూరంతా తిప్పేడు. పార్కులకు, సినిమాలకు, క్లబ్బులకు తీసుకు వెళ్ళేడు. ఎవరికీ అనుమానం లేకుండా వూరు చూడడానికనే నెపంమీద వెళ్లి ఎక్కడెక్కడో తిరిగి వచ్చేవారు.

సినిమాలో మాధవరావు చేయి సరోజ మీద అప్రయత్నంగా వేయబోయేసరికి.

"బావగారూ, నేను సరోజని! అక్కను గాను!" అని నవ్వుతూ అంది. మాధవరావు చెయ్యి తీసుకుని నిట్టూర్చేడు.

"ఏమలా విచారంగా వున్నారు! ఏదో ఆలోచిస్తున్నట్టుంది"

"ఏం చెప్పేది! పెళ్ళి అయిన దగ్గర్నుండి యిప్పటివరకూ సుశీలతో నేను యిలా సినీమాకు వెళ్ళలేదంటే నమ్ముతావా? " అని అన్నాడు.

"నిజమా బావగారూ! ఏమీ పాపం! ఆవిడ రానంటుందా? "

"అంతే అలా జరిగిపోయింది! అది కాపురానికి వచ్చిన దగ్గర్నుండి యింట్లో ఏవో

కలతలు. దానికీ, మా వాళ్ళకీ నిముషం పడదు. రోజూ ఏదో జట్టీ, అల్లరి, ఏడ్పులు, ఎడమొహం పెడమొహం! ఇంటికి వచ్చేస రికి వాళ్ళ తగువులు రెడీ! అవి తీర్చేసరికి నా పని సరి! యింక సరదాలెక్కడ?"

"ఆవిడను మీరెప్పుడూ రమ్మనలేదా?"

"చెప్పేను కదా, మేమిద్దరం సరదాగా మాటాడుకొనే అవకాశమే లేదు. ఎంత సేపూ యింట్లో గొడవలతో, దానికీ మనసు పాడయిపోయిందో లేక ఆ సరదా లేదో గానీ ఎప్పుడూ విచారంగానే వుంటుంది, యిక మా సంసారం యింతే, ఏమిటో ఆ వుద్రేకంలో అలా నీమీద చేయివేసి వుంటాను, ఏమీ అనుకోవు కదూ!" అని మెల్లగా అన్నాడు!

ఆ మాటలు విన్నాక అతనిమీద జాలి, సానుభూతి కలిగింది సరోజకు.

"నన్ను మీకే యిద్దామని అనుకొనేవార టగా!" అంది సరోజ సిగ్గుతో.

"అవును సరోజా! అలాగయినా నా జీవితం బాగుండిపోయేది! కానీ నాకు యిలా రాసిపెట్టి వుంటే ఎలాగవుతుంది! ఏ అదృష్టవంతుడు నీకోసం పుట్టాడో!"

"మీకంత యిష్టంగా వుంటే నన్నే చేసు కుంటానని అనలేకపోయారా!"

"లేదు సరోజా! నాకప్పుడివన్నీ తెలీవు! ఫలానా వాళ్లని చేసుకోవాలి అన్న దృష్టీ లేదు! ఏదో పెద్దవాళ్ళు చేస్తున్నారు, వాళ్ల మాట వినాలి అన్న భావమేగాని యిలా అవుతుందని కలగన్నానా!"

"ఇప్పుడయినా మీ అదృష్టానికేమి వచ్చింది! పండంటి మగపిల్లవాడిని కన్నది!'

"దానికేం... పెళ్ళి అయిన తర్వాత ఏదో విధంగా సంసారం చేయడం నేను ఆఫీసుకు వెళ్లి జీతం తేవడం, ఆవిడ వంటచేయడం, పిల్లలని కనడం, యిదేగా జీవితం? మరి ఏ యితర సరదాలూ వుండవా!"

ఎంత చనువుగా వున్నా సమయం వచ్చి నపుడు సరోజ చాకచక్యంగా తప్పుకుంటూ వచ్చింది.

తన కొడుకు ఏదోవిధంగా సంతోషంగా కనబడేసరికి కామాక్షమ్మ వూరుకుంది.

తన కూతురుకు పెళ్లి అయివుంటే అల్లుడూ, కూతురు కూడా యిలా అన్యో న్యంగా వుండేవారు కదా అని అనుకుంది సరోజ తల్లి.

తన కోడలు కూడా యిలాటిదయితే, కొడుకూ, కోడలూ యిలా సరదాగా వుండే వారు కదా అని కాశీపతి అనుకోకపోలేదు.

మాలతి తల్లిదండ్రులున్నంతకాలం సుశీల మానసికంగా కాకపోయినా శారీరకంగా బాగుంది. నంటిమీద దెబ్బలు లేవు. అంతలా చీవాట్లు కూడా లేవు.

వాళ్ళు వెళ్ళగానే మళ్లీ మొదలయింది. సుశీల దీనికేమీ విచారించలేదు. గానీ మాధవరావు మాటలే సుశీల మనసులో పదేపదే ప్రతిధ్వనించి, భయపెట్టేయి. తన బాబుని తనకు కాకుండా చేస్తారని బెదిరిపో యింది, అట్లా జరగడానికి వీల్లేదని అంత రాత్మ ఘోషిస్తూంది. ఒకవేళ అట్లా జరిగితే మరి తను బతుకలేదు. అంచేత బాబును దక్కించుకోవాలి!

ఎట్లా? ఎవరు తన గోడు వినేవారు? ఎవరు సాయంచేస్తారు! ఆలశ్యం చేస్తే తన బాబునుతనకుకాకుండా ఏమయినా చేస్తారు! అంచేత ఆలశ్యం అమృతం విషం. తన బిడ్డే తనకు లేకపోయినపుడు తన జీవితం ఎందుకు? ఈ ప్రపంచం ఎందుకు? యింకెవరుండి ఏం ప్రయోజనం?

తనమీద ఎవరికీ ఏవిధమయిన అభి మానం, ప్రేమ, ఆత్మీయతా లేవు! యింక తన బిడ్డ తనకు కాకుండా పోతే? తనకు మిగిలినదేమిటి? బాబును దక్కించుకోవా లంటే ఒకటే మార్గం!

ఎవరికీ తెలియకుండా, బాబుని తీసు కుని- తల్లీదండ్రి దగ్గరకు వెళ్ళిపోడం!... వెళ్ళిపోవాలి! వెళ్ళిపోవాలి!... లేకపోతే తన

బిడ్డనూ తననూ వేరు చేస్తారు! వెళ్ళిపో వాలి! తప్పదు!!

ఆ రాత్రి మరి సుశీలకు నిద్రపట్టలేదు. అందర్నీ పడుకోనిచ్చి లేచింది, భర్త ఆ పక్కకి తిరిగి పడుకు న్నాడు. ఎక్కడా అలి కిడి లేదు. అంతా నిశ్శబ్దంగా వుంది.

సుశీల లేచి విజయ్‌కుమార్‌ను నింపా దిగా తీసుకుని ఎత్తుకుంది. చప్పుడు కాకుండా లేచి... వీధి తలుపు తీసుకుని బయటపడింది.

ఆ ఆతృతలో వీధి తలుపు తీసే వుండడం ఆమె గమనించనేలేదు, ఎంత వేగిరం యివతల పడదామా అన్న ఆలోచ నలో తలుపు ఎందుకు తీసివుంది. యింత రాత్రపుడు? అన్న వూహ రాలేదు.

తలుపు దగ్గరగావేసి గేటు దగ్గరకి వచ్చి గేటు తీయబోయి "అమ్మయ్యో" అని కేకవే సింది.

ఎదురుగుండా మామగారు భూతంలా ఎదురయాడు, ఒక చేతిలో చెంబూ, ఒక చేతిలో కర్రాతో బయటకు పోయివస్తున్నా డాయన.

అతనూ సుశీలను చూసి ఆశ్చర్యపో యాడు, కాశీపతిని చూసి భయంతో సుశీల వణికిపోతూ వేగంగా వెనక్కు గదిలోకి పారిపోయింది.

కాశీపతి గబగబా లోపలికి వచ్చి "ఏమేవ్! ఏమేవ్!" అని కొంపమునిగిపో యేట్టు కామాక్షమ్మను లేపేడు, గావుకేకలు పెడుతూ.

"ఏమండీ ఏమిటయింది అలా అరు స్తారు!" అంటూ లేచింది.

"ఇంకా ఏమవడం ఏమిటి? ... కొంప మునిగిపోను! మనయింటి మర్యాద గంగలో కలిసిపోను! రేపు ప్రొద్దున మన మొహం ఎవరికీ చూపెట్టలేకపోయి వుండే వాళ్ళం!" అని అంగలు తొక్కడం మొదలె ట్టేడు.

"ఏమిటయింది? అసలింతకీ ఏమంత కానిపని మనం చేశాం!"

ఇంతలో ఆ కేకలకి మాలతి, కృష్ణారావూ లేచి చక్కావచ్చారు.

"మనం కాని పనులు చేయకపోయినా ఇంట్లోవాళ్ళు చేస్తే చాలదూ"

"ఎవరండీ ఆ చేసిందీ? వేగిరం చెప్పండి చంపక!" అంది కామాక్షమ్మ.

"ఇంకెవరు మన ఇంట్లో లేదూ జేజెమ్మ! పిలూ, నీ రెండోకోడల్ని... పిలిచి అడుగు తెలుస్తుంది!"

"ఏంచేసిందేమిటి? "

"ఏం చేయాలి? అర్ధరాత్రి అందరూ పడు కొ న్నారని అనుకుంది కామోసు, కొడుకుని తీసుకుని లేచి పోదామనుకుంది. దైవ వశాత్తూ మనలో దేముడుండి నేనూ ఆ వేళకే బయటకు పోయి వస్తూ ఎదురయి పోయాను! లేకపోతే ఈ పాటికి అందరి నోట్లోనూ పడిపోదుం!"

అంటూ కాశీపతి, బందిపోటు దొంగను పట్టిన డిటెక్టివ్‌లా గొప్పగా చెప్పడం మొద లెట్టేడు.

"ఆc! ఆc! ఎంత గుండెలు తీసిన పని!... సుశీలే! దీని మొహం యీడ్చా యింత పని చేసిందా? అనుకుంటూనే వున్నాను. ఎప్పుడో ఒకప్పుడిలాటి పని చేస్తుందని!" అని తిడుతూ.

"ఏయ్ జెష్టాయిలారా అని కామాక్షమ్మ ఇల్లు దద్దరిల్లేట్టు అరిచింది"

సుశీల తనంతటతాను రానక్కర్లేకుండానే, మంచంమీదనుండి అంతా విన్న మాధవ రావు అప్పటికప్పుడే లేవడం, ఒణికిపోతూ నిలుచున్న సుశీలను ఒక్క చెంపదెబ్బ వేయడం జరిగిపోయినాయి. ఆ దెబ్బకు సుశీల గుమ్మంలోనుండి తూలుతూ వచ్చి యివతల అందరిముందూ పడిపోయింది.

ఆ పడ్డంతో తలకు బలమయిన గాయం తగిలింది. నెత్తురు కూడా స్రవించనారంభిం చింది.

కామాక్షమ్మ అందుకుంది.

"మమ్మల్ని యిలా బతకనివ్వవా రాక్షసీ! మా యింటి కెక్కడదాపురించేవే! శనిలాగ! నువ్వు చచ్చినా బాగుండిపోను!" అని నాలుగు వేసింది.

"వెళ్ళిపోనిండి! అంత యిష్టం లేనిది ఎందుకు ఇక్కడ వుండి!" అంటూ మాధవ రావు.

"ఊం చెప్పు! ఎందుకు వెళ్ళిపోదాం అనుకున్నావు!" అని సుశీలను పట్టుకొని గుంజేస్తూ అడిగాడు.

"లేదండీ! బాబు ఏడిస్తే ఊరుకోపెట్టడానికి అవతలకు తీసుకువెళ్ళేను. ఇంట్లో అందరూ పడుకున్నారు లేచిపోతారని! యింతేనండి!" అని ఏడుస్తూ చెప్పింది.

"అబద్ధాలు కూడానా నంగనాచీ! అర్ధరాత్రపుడు భయం లేకుండా అవతలకి ఆడించడానికి వెళ్ళేవా? ఓహోహో! ఎవరయినా నమ్మవద్దా!" అని కామాక్షమ్మ బుగ్గలు పొడుస్తూ అడిగింది.

"అసలేం తీసి దిగేసింది. నీకు... అలా చెప్పకుండా పారిపోడానికి" అని అడిగేడు కాశీపతి.

"చెప్పు, ఏ రంకు మొగుడింటికి లేచిపోదామనుకున్నావు? చెప్పు, చెబుతావా లేదా? " అని జుత్తు పట్టుకొని కోపంలో కొట్టేడు మాధవరావు.

"లేదండీ! అలాటి మాటలనకండి! నాకలాటి వుద్దేశ్యంలేదు. నిజం చెబుతున్నాను నమ్మండి... బాబును మీరు పెంపకం యిస్తామన్నారని, యింక వాళ్ళు కూడా నాకు కాకుండా చేస్తారని భయంతో బాబును తీసుకుని, మా ఇంటికి వెళ్ళిపోదామని అనుకున్నాను నమ్మండి, మరెక్కడికీ, ఎప్పుడూ వెళ్లను. నన్ను క్షమించండి... నన్ను కొట్టకండి!" అని ఏడుస్తూ భర్త కాళ్ళూ, కామాక్షమ్మ కాళ్ళూ పట్టుకు బతిమాలింది.

"ఓసి నీ అబద్ధాలు కూలా! అందితే జుట్టూ అందకపోతే కాళ్ళూ, ఎంత ఆలోచనతో బయలుదేరావు మాకు నిష్ఠూరం తేడానికా? అదుగో కోడల్ని నానా బాధలూ పెట్టి తగిలేసేరు. లేకపోతే చంపేశారు అని మమ్మల్ని నలుగురిలో తలెత్తకుండా, చేయడానికా? అదేనా నీ వుద్దేశ్యం... ఛీ... మా యింటికి దరిద్రంలా దాపురించేవు... ఏనాడు ఇంట్లో కాలుపెట్టేవో ఆనాడే ఈ ఇంట్లో శాంతి నశించింది! నీ మొహం చూడకూడదు ఫో అవతలికి! నీ వాళ్ళదగ్గిరికే పోతావో! ఎక్కడికి పోతావో!" అని కాలితో తన్నేడు మాధవరావు!

"లేదండీ మీ పాదాలసాక్షి ; నేనెక్కడికీ వెళ్లను క్షమించండి! ఈ తప్పుకి" అని కాళ్ల మీద పడింది. తిరిగి అతను విదుల్చుకొని వెళ్లిపోయాడు.

"ఎంతకయినా తగుదువులే! అలావున్నావనా!... నీ దగ్గర వుంటే ఆ పిల్లడు బాగు పడ్డట్టే!"

అని కామాక్షమ్మ అంటూ బాబును తీసుకుని మాలతి చేతికిచ్చేసి సుశీలను లాక్కుని పోయి, దేముడిగదిలో పడేసి బయటగొళ్ళెం పెట్టేసింది.

"ఏమో యింకా రాత్రి ఏ అఘాయిత్యం చేస్తుందో ఎవరు కనిపెట్టుకు కూర్చుంటారు? యిందులో పడి వుంటే సరి! ఎలా బయటకు వస్తుందో చూద్దాం. యింక ఈ భాగోతం రాత్రికి చాలుగాని, పదండి పడుకుందాం!" అని దారితీసింది.

అందరూ వెళ్ళి హాయిగా పడుకున్నారు!

ఆ చీకటి కొట్లో సుశీలనువాళ్ళు కొట్టిన దెబ్బలు ఒక పక్కనుండి బాధపెడుతూ వుంటే మరొకపక్క హృదయంలో తుఫాను రేగుతూనే వుంది. అనుకున్నదొకటీ అయినదొకటీ జరగగా, ఏం చేయడానికీ తోచక కంటినీరు యింకిపోయేవరకూ దుఃఖించింది.

ఆ చీకట్లో, అలాగే తెల్లవార్లూ గడిపింది.

ఆ మర్నాడు తెల్లవారుజామున కామాక్షమ్మ తలుపుతీసి, "ఓసి దరిద్రగొట్టూ లేవే తెల్లవారింది!" అని సుప్రభాతం పాడేవరకూ తెలివి రాలేదు సుశీలకు

ఆ అరుపులకు అదిరిపడి లేచింది. ఎదురుగా ఒకవైపు దేముడు, మరోవయిపు దెయ్యం, ఏం చేయాలో బోధపడలేదు. మనసులో దేవుని స్మరించుకుని, దయ్యానికి భయపడుతూ లేచింది.

"ఇవతలకు తగలడూ" అని కామాక్షమ్మ అరవగానే బైటకు వచ్చేసింది.

ఆ సంఘటనతో సుశీలకు ఆ యింట్లో వున్న కాస్త గౌరవం కూడా పోయింది. చిన్న పిల్లలకు కూడా లోకువయిపోయింది తనేదో ఆ ఇంటి పరువూ, మర్యాదా గంగలో కలిపేయబోతూవుంటే- కాశీపతి అడ్డుకొని ఆ కుటుంబగౌరవం కాపాడినట్టు ప్రచారం జరిగింది.

బిడ్డకూ తనకూ కాకుండా ఎక్కడ వేరు చేస్తారో అని సుశీల భయపడితే పిల్లవాడిని తీసుకుని ఎప్పుడు వుడాయిస్తుందో అని ఇంట్లో వాళ్ళూ అంతగా భయపడ్డారు.

బాబుని వదిలి వుండలేదు, ఎక్కడికీ వెళ్ళ లేదు కాబట్టి ఆ బాబుని చేరనివ్వకుండా చేస్తే యింక సుశీల ఆటకట్టు. అని వాళ్లు వూహించి బాబును సుశీల దగ్గరకు రానివ్వకుండా జాగ్రత్త చేసేరు.

ఈ విధంగా చేసేసరికి మనసంతా వికలమయిపోయి పిచ్చిదానిలా తయారయింది సుశీల. అసహాయతతో కృంగిపోయింది.

పూర్వమయితే ఎప్పుడయినా తనను వెనకేసుకొచ్చే భర్త మాధవరావు కూడా, ఆ సంఘటనతో కోపంగా వున్నాడు.

బాబు ఏడుపు వినబడేసరికి సుశీలకు నరనరాలూ తోడుకుపోయేవి, ఆవేదనతో, ఉద్రేకంతో, పిల్లవాడు ఎక్కడ వున్నా చొరబడి బలవంతంగా తీసుకుని ఏ మూలకో పోయి దాక్కునేది. ఎవరయినా వచ్చి తీసుకుపోతారేమో అన్న భయంతో రెండు చేతులతో గుండెలకు హత్తుకునేది. సుశీలను అదుపులో పెట్టడం వారికి ఒక సమస్య అయిపోయింది. అంచేత కామాక్షమ్మ, మాలతీ కలిసి ఆమెను ఒక పిచ్చి దానికింద జమ కట్టి, బలవంతాన పిల్లవాడిని లాక్కుపోయేవారు.

సుశీల పెనుగులాడితే కలిసి కొట్టి మరీ లాక్కుపోయేవారు. భోజనానికి పిలిచేవారు కాదు, ఆమె వస్తే యింత పడేసేవారు, లేకపోతే లేదు, సుశీల మనసు బాగులేక భోజనం మానివేస్తూ వుండేది.

విజయకుమార్‌కోసం సుశీల ఎదిరించి, ఎదిరించి, ఆఖరికి నెగ్గలేక లొంగిపోయి వూరుకొనేది. తనమీద తనకే శ్రద్ధ తగ్గిపోయింది. తనలోతాను నవ్వుకోడం, పిచ్చిపిచ్చి మాటలాడుతూ వుండడం ప్రారంభించింది.

కామాక్షమ్మా, మాలతీ కలిసి సుశీలను పెట్టే బాధలు, ఇంట్లో మగవాళ్ళకు తెలియకుండా అతిచాకచక్యంగా చేసేవారు, వాళ్ళు వుండగా ఆమెను ఏమీ అనేవారు కాదు.

ఇంట్లోంచి వెళ్ళిపోడానికి సుశీల ప్రయత్నించిన దగ్గర్నుండి మాధవరావు మనసు పూర్తిగా మారిపోయింది. యింతకు పూర్వం సుశీలమీద కొంచెం జాలి, సానుభూతి వుండినా, యిప్పుడు అది పూర్తిగా పోయి కోపం వచ్చింది. దానికి తోడు, తల్లి కామాక్షమ్మ దుర్బోధ బాగా తోడయి ఒకవిధమయిన విముఖత్వం ఏర్పడిపోయింది. అంచేత సుశీల ఆ ఇంట్లో ఎలావున్నా ఎవరేమన్నా పట్టించుకోడం మానివేసేడు. తన ఎదురుగుండా తల్లిగాని, మాలతిగాని ఆమెను ఏమీ అనకపోడంవల్ల యింత అమానుషంగా ప్రవర్తిస్తున్నారని, అసలు బాబును దగ్గిరకు చేరనివ్వడం లేదని, తిండి కూడా పెట్టలేదని తెలీదు. ఏదో రోజూ వువ్వదే కదా అని వూరుకొనేవాడు.

సుశీల తనతో ఏ సంగతీ చెప్పుకొనే అవకాశమే తను యివ్వలేదు, ఏదయినా చెప్పు

కుందికి వస్తే, ఏదో కోపం తెప్పించే మాట రావడం ఆమెను కసిరికొట్టడం జరిగేది.

సుశీల కూడా యింక అతనితో ఏం చెప్పీ లాభంలేదని భావించి పూరుకుంది.

చెల్లెలు పెళ్లికి మాలతి పుట్టింటికి బయలుదేరింది. సుశీలకు బుద్ధిరాడానికి, కొన్నాళ్ళపాటు బాబు మాలతి దగ్గరే వుండడం మంచిదని, అది పిల్లవాడి బాగుకోసమే అని మాధవరావుకు నచ్చచెప్పి ఒప్పించారు.

బాబు కొన్నాళ్లపాటు దగ్గర లేకపోతే సుశీల మనసు కొంత మారడానికి అవకాశం వుండవచ్చు అని మాధవరావూ సరే అన్నాడు.

ఆ సంగతి తెలిసిన నుండి సుశీలకు భోజనం కూడా సహించలేదు. ఆ సంగతి ఎవరూ పట్టించుకోలేదు.

మాలతి బాబును తీసుకువెళ్లిపోయింది. సుశీలపైకి ఏడ్వలేక ఏం చేయలేక లోలోనే మనోవ్యాధితో కృంగిపోసాగింది. రానురాను తను ఏమిటి చేస్తున్నదీ కూడా ఆమెకు తెలియకుండా పోయింది. నిర్జీవంగా తయారయింది. నిస్సహాయంగా బోనులో పెట్టిన సివంగిలా కోపాన్ని అణుచుకుంటూ, ఆవేదనతో, మనసులో క్షోభించసాగింది.

తల్లీ పిల్లలను వేరుచేసి, ఎదురుగుండా వున్నా, చేరదీసి, ఎత్తుకుని ముద్దాడడానికి గాని, కడుపారా పాలివ్వడానికిగాని కన్నకొడుకుమీద ఏ హక్కూ లేకుండాచేసి తిరిగి తనను నానా మాటలూ అనడం, చూస్తుంటే ఆమెకు ఏంచేయాలో ఎలా బతకాలో బోధపడలేదు.

ఏ తల్లి యిటువంటి పరిస్థితుల్లో మామూలు మనిషిలా వుండగలదు?

అంతవరకూ రోజుకు ఏ ఒక్కసారయినా దొంగతనంగానో బలవంతంగానో, అయినా బాబును చూసుకు తృప్తిపడేది. దూరంగా వాడి ఏడుపు వినిపిస్తే, ఆ గొంతు విని తృప్తిపడేది. ఎప్పుడయినా ధైర్యంచేసి, ఎవరూ చూడకుండా, బాబును తీసుకొని హృదయానికి హత్తుకుని గుండెలబరువు తీర్చుకొనేది.

ఇప్పుడా అవకాశం కూడా లేకుండా, తన బిడ్డ తాలూకూ గాలికూడా తగలకుండా వాడి నీడ అయినా కనబడకుండా, చేసేసరికి సుశీలకు ఈ జీవితమే శూన్యమయిపోయింది. యింక ఆ ఇంట్లో ఒక క్షణమయినా వుండబుద్ధికాలేదు.

ఆ సంగతి ధైర్యంచేసి మాధవరావుతో చెప్పింది.

"నన్ను మావాళ్లింట్లో దిగబెట్టండి! బాబు వచ్చేక వస్తాను!" అని.

"బాబులేకపోతే ఇక్కడ వుండవన్న మాట?" అని ప్రశ్నించాడు.

"నాకిక్కడేం తోచదు నేనుండలేను!"

"మేమందరంలేమా? రెండ్రోజులు బాబును వదిలి వుండలేవా? వారం పదిరోజుల్లో వచ్చేస్తాడు, ఈ లోపున ఎక్కడికి వెళతావు?"

"లేదండీ నన్ను దిగబెట్టేయండి! నా బాబు మీకు అక్కర్లేకపోయాక నేను మాత్రం ఎందుకు?" అని కోపంతో అంది.

"చూశావురా! ఎలాటి మాటలంటూందో? ఇక మనమంచరం ఒకటి తనొక్కతీ ఒకటీ అయినట్టు! ఏం నీకిక్కడేం తీసి దిగేసింది! ఇప్పుడు పుట్టింటికి వెళ్లిపోడానికి?" అని కామాక్షమ్మ అందుకుంది.

"నేనేమీ మరో ఉద్దేశ్యంతో అనలేదు. మా వాళ్లని చూడాలని వుంది చూసి వస్తాను! తప్పా?"

"తప్పా, తప్పున్నరా! ఏం మీ వాళ్ళేం పిలిచి పింగళించారా? ఏరోజు పెళ్లిచేసి పంపించారో ఆనాడే నిన్ను లేవనుకొని వదిలేసేరు! లేకపోతే వాళ్ళూ ఒక తల్లీ తండ్రీనా! ఈ దిక్కుమాలిన సంబంధం కోరి చేసుకున్నాం! ఎలాగున్నావనయినా అడగరు. ఒక పండుగలేదు. ఒక పబ్బం లేదు. యిహ నువ్వు చూస్తే, ఎప్పుడూ ఏడుపు ముఖమూ నువ్వూ. చాల్లే కరువు తీరిపోయింది.

"వెళితే వెళ్ళనీవే అమ్మా! కొన్నాళ్ళయినా అదీ మనమూ కూడా సుఖపడతాం" మాధవరావు అన్నాడు.

"పంపివేయడమే వుత్తమం లేదా మళ్లీ ఏరాత్రో లేచి చక్కాబోతుంది. ఆ అప్రతిష్ట కన్నా బండి ఎక్కించేస్తే మేమే పంపామని చెప్పుకోవచ్చు ఆనాడంటే అదృష్టవశాత్తు చూసేం కాబట్టి సరిపోయింది. రోజూ ఎవరు కనిబెట్టుకు కూర్చోగలరు? " అన్నాడు కాశీపతి.

"అవును ఆమాటా నిజమే!" అంది కామాక్షమ్మ.

ఏవో రెండు మూడు చీరలు సంచీలో పెట్టుకుని బయలుదేరింది సుశీల. మాధవరావు టిక్కెట్టు కొనియిచ్చి బండీ ఎక్కించేసేడు, రెండు రూపాయలు దారి ఖర్చుకని చేతిలో పెట్టేడు.

అంతవరకూ నయమే అనుకుని సుశీల బండి ఎక్కింది. దారిలోనూ, ప్లాట్ ఫారం మీద కూడా యిద్దరూ మాటాడుకోలేదు. అసలు మాధవరావు బండి బయలుదేరేవరకయినా వుండలేదు.

ఉత్తరం రాస్తాను వచ్చేయి అనిగాని, వెళ్లగానే కులాసాగా చేరినట్టు ఉత్తరం రాయి అనిగాని ఏమీ అనలేదు. మరోసారి అయినా పోనీ "ఎందుకీ ప్రయాణం వుండిపో!" అని కూడా అనలేదు.

సుశీల లోలోనే అతని ప్రవర్తనకి కోపంతో వుడికిపోయి తనూ ఏమీ మాటాడకుండానే బండి ఎక్కేసింది. అతను, బండి ఎక్కించేసి వెనుదిరిగి వెళిపోతున్నప్పుడు మాత్రం.

"బాబు వచ్చేక ఉత్తరం రాయండి, వాడిని చూడనిదే వుండలేను, వచ్చేస్తాను!" అంది. దానికతడు "ఊ" అని మాత్రం అని వెళ్ళిపోయాడు.

ప్రయాణం చేస్తున్నంతసేపూ ఆమెకు తిండిమీదగాని, మరి దేనిమీదా ధ్యాసలేదు! మనసులో బాబు మెదులుతూవుంటే కంటి నీరు పెట్టుకుంది.

సాయంత్రానికల్లా బండి దిగి తన వూరు చేరుకున్నది. ఎవరొస్తారూ తనని తీసుకువెళ్లడానికి. తన వాళ్ళకి మాత్రం తెలుస్తేనా? తనే రిక్షా మాటాడుకొని యింటికి వెళ్ళిపోయింది.

అనుకోకుండా వచ్చిన కూతుర్ని చూసి తల్లి పార్వతమ్మ ఆశ్చర్యపోయింది. చాలా కాలం తర్వాత చూసినట్టు సుశీల తల్లిని పట్టుకొని భోరుని ఏడ్చింది. యిద్దరూ అట్లా ఎంతోసేపు వుండిపోయారు. ఈ లోకం మరచిపోయి! చంటిపిల్లని ఓదార్చినట్టు ఓదార్చింది పార్వతి సుశీలను.

ఆ తర్వాత తండ్రి కూడా వచ్చి సుశీలను చూసి పలకరించాడు, విచారంతోనూ, బెంగతోనూ, బాధల తోనూ చిక్కిపోయిన కూతుర్ని చూసి పార్వతి గుండె తరుక్కుపోయింది.

"తల్లీ! ఎలాగయిపోయావమ్మా!" అని అడిగింది.

తన స్థితికే ఏడవాలో, పూర్తిగా అనారోగ్యంతో, నిలబడడానికి కూడా శక్తి లేని తల్లిని చూసి దుఃఖించాలో సుశీలకు అర్థం కాలేదు, ఆమెను చూడగానే "యింక అమ్మ దక్కుతుందా? " అనిపించింది సుశీలకు.

పార్వతి అంత బలహీనంగా అశక్తురాలయిపోయింది. ఆమె ఆరోగ్యం మరి బాగుపడలేదు. సుశీలను చూసి వుండలేక బలవంతాన్ని అతికష్టంమీద లేచివచ్చి పలకరించిందిగాని అప్పటికే చాలా రోజులనుండి మంచంమీదే వున్నది. సుశీలను చూడ్డానికే ఇన్నాళ్లూ బ్రతికి వుందేమో అని అనిపించింది.

సుశీల తన గోడంతా చెప్పుకొని ఏడ్చింది.

"ఏదిఏమయినా మరి నాకు వెళ్లాలని లేదు నాన్నా! అక్కడ వుంటే ఏం సుఖం? బాబును నా దగ్గరకు రానివ్వరు, అతనా అభిమానంతో వుండడు. పనిమనిషికున్న గౌరవమయినా నాకు ఆ ఇంట్లో లేదు. పని

మనిషికి మర్యాద ఇవ్వకపోయినా పనిచేసి వెళ్లిపోతుంది. అడ్డుపెట్టేవారు లేరు, మాటంటే పడదు. ఇష్టమయితే మళ్లీ వస్తుంది, లేకపోతే లేదు. కాని నా సంగతి అలాక్కాదు. పనిచేయడం చీవాట్లు దెబ్బలూ కూడా తినడం! ఆశలూ, అభిమానాలూ లేని ఆ ఇంట్లో ఎందుకు బాధపడడం?" అని తన మనసులో వున్నదీ చెప్పింది సుశీల.

తల్లీ, తండ్రీ మౌనం వహించారు.



పద్మ, మోహన్ ఏ కబురూ లేకుండా ఒక నాడు అకస్మాత్‌గా రావడంతో కామాక్షమ్మ, కాశీపతి ఆశ్చర్యపోయారు.

"ఏమిటిలా వచ్చేశారు ఉత్తరం పత్తరం లేకుండా?" అని అడిగింది తల్లి.

"ఏం లేదమ్మా పద్మని వాళ్ళింటికి తీసుకు వచ్చాను. నిమ్మల్నందర్నీ ఒకసారి చూసి పోదామని" అన్నాడు నవ్వుతూ.

"పెట్టె, సామానూ ఏదీ?" అని అడిగాడు కాశీపతి.

"లేదు నాన్నా బండిదిగి వాళ్ళింటికే తిన్నగా పోయాం. అక్కడనుండే వస్తున్నాం" అన్నాడు.

ఈ మాటలకు కామాక్షమ్మ, కాశీపతి ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"అదేవిటిరా? మేం ఇక్కడ వుండగా అక్కడ దిగి రావడం ఏమిటి?"

"ఎక్కడయితేనేంలే అమ్మా నీదంతా చాదస్తంగాని"

"ఏమిటో నాయనా మా రోజుల్లో అత్త వారు ఆరు పిలుపులు పెడితేనేగాని అల్లుడు వెళ్లేవాడు కాదు. ఈ రోజుల్లో తల్లీ తండ్రీ పిలుస్తేనేగాని కొడుకులు రారు. అలా మారిపోయినాయి రోజులు" అని నిట్టూర్చాడు కాశీపతి.

"ఆ పట్టింపులేమీ మాకు తెలీవుగాని నాన్నా పద్మని చూడడానికని వాళ్లు నాలుగయిదుసార్లు వచ్చేరు. ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు. పద్మ నెల తప్పిందని రాయగానే తీసుకురమ్మన్నారు. అందుకని తీసుకువచ్చేను. వాళ్లంత అభిమానంగా వున్నప్పుడు మనమూ మర్యాదగానే వుండాలి. నెలరోజులు సెలవు పెట్టేను. పద్మను ఇక్కడ వుంచేవెళతాను. వాళ్లు ఇప్పటినుండే వుండమంటున్నారు" అని చెప్పేడు.

"అట్లాగా మరి చెప్పేవు కాదేమి? సంతోషం నాయనా! అయినా నువ్వు తీసుకురావడం ఏమిటి? వాళ్లే వచ్చి తీసుకురావడం ఆచారం"

"ఆచారాలకేం? నేనే తీసుకువస్తే ఏంపోయింది. ఇప్పుడేమయింది. నేనూ ఇంటికి వచ్చి అందర్నీ చూసినట్లయింది. ఆమెను దిగబెట్టినట్లూ అయిందిగా!"

"ఏమో బాబూ మీ ఇష్టం! ఈ రోజుల్లో ఎవరికీ చెప్పలేం! అలా చెప్పడం, రావడం, తీసుకువెళ్లడం, గౌరవం, మర్యాదకింద పూర్వం చూసేవారు. ఇప్పుడు అది తప్పంటున్నారు" అంది కామాక్షమ్మ.

"నేనున్న నెల్లాళ్లూ మనింట్లోనే వుంటుంది. తర్వాత వాళ్ళింట్లో దిగబెట్టి నేను వెళ్లిపోతాను" అంటూ గదిలోకి దారి తీశాడు మోహన్ అతని వెనకాలే నడిచింది పద్మ.

"ఏం విడ్డూరమమ్మా!" అన్నట్టు కామా

క్షమ్మ మెటికలు విరుచుకుంది.

మోహన్ తిరిగి వచ్చి "అమ్మా పద్మ మందులు తీసుకుంటూ వుంది. నీరసంగా వుందంటేనూ డాక్టరు మందులూ టానిక్కులూ ఇచ్చేడు. కొంచెం పాలు వేడిచేసి ఇస్తావా? మందులోకి" అన్నాడు.

కొడుకూ కోడళ్ల ప్రవర్తనకి ఆశ్చర్యపోయింది కామాక్షమ్మ. ఎంత ఇదయినా అంత పెళ్లాన్ని వెనకేసి తిరగడం నచ్చలేదు. అయినా ఏమీ అనలేదు.

"అలాగే నాయనా" అంటూ కాగుతున్న పాలు తెచ్చి ఇచ్చింది. వాటిని అందుకుంటూ,

"సుశీల వదినా, మాలతి వదినా ఏరమ్మా! కనబడరు? " అని అడిగాడు.

"పెద్ద వదిన చెల్లెలు విశాలకు పెళ్లి అందుకని వాళ్లింటికి వెళ్లి పది రోజులవుతోంది. ఇంక చిన్న వదినా... అడక్కు నాయనా!" అంటూ నిట్టూర్చింది కొంచెం సేపు ఆగి.

"అది పెట్టిన రాద్ధాంతం, యింతా అంతా కాదు నాయనా కడుపు చించుకుంటే కాలు మీద పడుతుంది" అని అంటూండగా పద్మ టానిక్ సీసాతో ఇవతలకి వచ్చి పాలను భర్త దగ్గర్నుండి అందుకుని టానిక్ కలుపుకుంటూ వినసాగింది.

"వాళ్ల వాళ్లు రమ్మని పిలవకపోయినా సుశీల మాత్రం 'నేను మా వాళ్లింటికి వెళ్లిపోతాను దిగబెట్టండి' అని ఒకటే ఏడుపు. ఆఖరికి ఒకనాడు అర్ధరాత్రి లేచి వెళ్లిపోబోయింది. మీ నాన్నగారు చూశారు కాబట్టి గాని లేకపోతే మన పరువు ఆనాడే పోయేది. ఎందుకలా చేశావని అడిగేమని, నిద్రాహారాలు మానేసి మొండితనం చేసింది. ఇక లాభంలేదని అన్నయ్య వెళ్లి దిగబెట్టి వచ్చేడు" అని కంటనీరు పెట్టుకొని చెప్పింది.

ఈ మాటల్లో నిజమెంతో, అబద్ధమెంతో వాళ్లకు తెలియలేదు. ఏమీ అర్థంగాక వూరుకున్నారు. తిరిగి ఇద్దరూ గదిలోకి వెళ్ళిపోయారు.

ఇంకెవరూ లేకపోయేసరికి కామాక్షమ్మ, భర్త దగ్గరకు వెళ్లి "చూశారా! చూశారా! అది టానిక్కు తాగడానికి నేను పాలు అందివ్వాలట. అయ్యో! ఇన్నాళ్లకు వెళుతున్నాను. ముసలిది తల్లి ఎలా వుందో, ఇదిగో ఈ పండు తినమ్మా! అని అనడం పోయి అయ్యో! ఖర్మ" అని నెత్తి కొట్టుకుంటూ చెప్పింది.

"ఇస్ వూరుకో! వింటాడు. ఏం చేస్తాం! వాడలాటివాడు నీ పనిచేసుకో. ఏమన్నా అంటే ఇద్దరూ కలిసి పద్మ ఇంటికే వెళ్ళిపోగలరు" అని వారించాడు.

"బాగానే వుంది. ఏం సూకరాలమ్మా! మరీ ఇంత ఇదా? మేం మాత్రం కనలేదా? ఈ మందులూ, టానిక్కులూ, డాక్టర్లూ! అయినా కొందరికలా చెల్లుతాయి. పెళ్లాం ఎక్కడ ఇదయిపోతుందో అని ఒకరు చెప్పాలా ఏమిటి? హుం! ఎందుకు నా బ్రతుకు ఎప్పుడూ ఒక్కలాగే వుంది. ఒక అచ్చటా, ఒక ముచ్చటా! ఏనాడు ఈ ఇంటికి వచ్చేనో, వచ్చిన దగ్గర్నుండి ఎలా వున్నావనేనా అడిగేరా? మీకూ, మీ పిల్లలకీ చేయడంతోనే సరిపోయింది. అలా భోజులు కురుస్తున్నారు ఏం అదృష్టమో! ఒకనాడు వుంది కనుకనా ఈనాడు అడగడానికి! ఆఖరికి కోడళ్లకి కూడా చేయవలసి వచ్చింది" అని కాశీపతిమీద ఆ నాలుగూ అనేసి, వంటింట్లోకి వెళ్లిపోయింది. అప్పటికిగాని తన కసి పోలేదు.

కొడుకలా పెళ్లాం వెనక తిరగడం, గ్లాసులు అందించడం ఆమెను ముద్దుగా, ప్రీతిగా చూసుకోవడం ఆమె చూడలేకపోయింది.

కాశీపతి కిమ్మనకుండా వాలుకుర్చీలో కూలబడ్డాడు.

తర్వాత భోజనాలకు రమ్మన్నది కామాక్షి.

తన ఒక్కడికే వడ్డించడం చూసి మోహన్రావు...

"అమ్మా! పద్మకు కూడా వడ్డించు. పెందరాళే తినడం దానికి అలవాటు. మేమిద్దరం ఒకేసారి తింటాం. తగినంత రెస్టు తీసుకోవాలని డాక్టరు చెప్పేడు" అన్నాడు.

"అలాగే నాయనా! అని అంటూ మరో పీట, కంచం వేసింది లోలోపల ఉడికిపోతూనే.

"రా! పద్మా" అంటూ పిలిచాడు పద్మ వచ్చి కూర్చుంది. విధిలేక కామాక్షమ్మ వడ్డించింది.

భోజనం అవగానే పద్మకు వాంతి వచ్చింది. గబగబా చెయ్యి కంచంలోనే కడిగేసుకొని అవతలకు వెళ్ళిపోయింది.

తర్వాత తిన్నగా గదిలోకి వెళ్లిపడుకుంది.

కామాక్షమ్మకి ఉక్రోషం ఎక్కువయిపోయింది.

"అదేం విడ్డూరంరా! తిన్న కంచంలో చేయి కడుక్కుని, ఆ కంచమన్నా తీయకుండా వెళ్లిపోయింది. బాగానే వుంది" అంది. అది విన్న పద్మ, ఇవతలకు వచ్చి

"నాకు వంట్లో బాగులేదు, మీకు ఇష్టం లేకపోతే ఆ కంచం అలా వుంచండి. తర్వాత నేనే తీస్తాను. ఆ మాత్రం దానికి విడ్డూరం ఏమీ చెందనక్కర్లేదు" అంది.

"అయ్యో! నా తల్లీ ఇప్పుడేమన్నానమ్మా! అలా అంటున్నావు. ఎంత శ్రీమంతురాలివయినా ఎంత తొలిచూలు అయినా, ఎవరి పని వారు చేసుకోలేనంత సూకరాలు మేం ఎరగమమ్మా. ఎవరయినా చూస్తే ఏమనుకుంటారు? "

"ఎవరేమనుకుంటారు? జాలిపడతారు. అంతేగాని మీలా విసుక్కోరు. ఇందులో సూకరాలకేముంది? అనవసరంగా ఏమేమో అని మనసు పాడుచేయకండి! మిమ్మల్నేమీ ఎత్తమనలేదు. ఎందుకలా విపరీతార్థాలు తీస్తారు. చిన్నబోతారు" అని అంది పద్మ.

"అయ్యో నాకేం చిన్నతనమమ్మా! ఇందాక పాలు ఇమ్మంటే ఇవ్వలేదూ. ఇప్పుడు మొగుడితో కూడా వడ్డించలేదూ. ఒకరికి చేయవలసిందేగాని మాకొస్తే ఎవరూ చేసేవారు లేరు. మీదుమిక్కిలి మాటలు కూడా పడడం" అంది కామాక్షమ్మ.

"ఒకరికి మీరు చేస్తే మీకు మరొకరు చేస్తారు, తిట్టుకుంటూ విసుక్కుంటూ చేస్తే వాళ్లూ అంతే చేస్తారు"

"అనమ్మా అను. ఆఖరికి చాకిరీ తప్పదు. మాటలూ తప్పవు? " అని కంఠం వణికిస్తూ రాగంలోకి దింపింది కామాక్షమ్మ.

ఇంక ఆ సంభాషణ శృతిమించి రాగాన పడుతోందని గ్రహించి, "వూరుకో అమ్మా! ఇంత చిన్న విషయానికి ఎందుకింత రాద్ధాంతం. ఆ కంచం అట్లాగే వుండనీ, ఎవరో ఒకరు తీసిపడేస్తారు లేదా పని మనిషి వచ్చి తీస్తుంది. అసలు ప్రతీదానికి నువ్వు నోరు పారేసుకుంటావు. తర్వాత ఎలాగూ చేస్తావు. అందుకే చెడ్డవుతావు" అని అన్నాడు మోహన్.

"నువ్వూ అన్నావా నాయనా! నన్ననకఏం చేస్తావు? నా రాత ఇట్లాగుంది. కట్టుకున్న మొగుడికే లేనప్పుడు కొడుకులకెట్లావుంటుందీ అభిమానం నా అజ్ఞానంగాని"

"ఒక దానికొకటి ముడివేస్తావేమిటమ్మా! ఇప్పుడేమయింది"

"లేకపోతే ఏమిట్రా! పెళ్లానికి అంత సేవలు చేయడం తెలుసూ? అదెక్కడ అలసిపోతుందో అని అన్నీ చెప్పి చేయించడం తెలుసూ! ఇన్నాళ్లు పోయాక వచ్చావుకదా! ఇదుగో అమ్మా! తిను అని ఒక పండు తెచ్చావూ! ఇంక నాకెలా వుంటుంది"

"అదా అమ్మా! నీ బాధ! అభిమానం లోపల వుండాలిగాని పైపైని ఆడంబరాలతో పనేమిటమ్మా! ఇంకా ఏదీ వచ్చి ఎంత సేపయిందని? అన్నీ నువ్వే అనేస్తున్నావు. నేనేం తెచ్చానో, లేదో చెప్పనిచ్చావా?

చూశావా? "

"ఏమో నాయనా! పెంచి పెద్దవాళ్లని చేశాం. అది మాకు తప్పదు. ఇక మీ ఇష్టం, ఏమయినా చేయండి" అని వూరుకుంది.

"మీ కొడుకు మీకు ఏమీ తేకపోతే, అడగకపోతే నేనా బాధ్యురాలను. వద్దని నేను చెప్పేననుకున్నారా? లేక నేను కొంగున కట్టుకుని తల్లినీ, బిడ్డనీ వేరుచేస్తున్నాననుకున్నారా? " అని ఖచ్చితంగా అడిగింది పద్మ.

"నువ్వూరుకో పద్మా. పోయి విశ్రాంతి తీసుకో! అమ్మ మాటలకేమిటి? అవి ఎప్పుడూ అంతే" అని సమర్థించేడు మోహన్రావు.

"నో! నో! ఇలాగయితే నేనిక్కడ వుండలేనండి. నేను మా ఇంటికి వెళ్ళిపోతాను. మీరే అక్కడకు వస్తూండండి. హాయిగా అక్కడ వుండక నాకెందుకీ బాధ"

"వెళ్లమ్మా వెళ్లు. అక్కడ జరిగినట్టు ఇక్కడెలా జరుగుతుంది? మేమేం నిన్ను కన్నవారిమా? ఎవరికన్నా నువ్వెక్కువ? తొంగి చూడకపోయినా, వంగి వాలకపోయినా ఆ సుశీల 'నావాళ్లూ' అంటూ వెళ్లిందికదా! నువ్వూ ఎంచక్కా వెళ్లవచ్చు. నేనేం వెట్టిచాకిరీ చేయడానికి తీరుబాటుగా లేను" అంది కామాక్షమ్మ రెచ్చిపోతూ.

"అమ్మా! ఏమిటా మాటలు? ఇన్నాళ్ల తర్వాత మిమ్మల్ని చూసిపోదామని ఎంతో ఆశతో వస్తే ఇలాగేనా అనేది? కోడలు నెలతప్పి వచ్చి లేవలేక ఏదో చేస్తే కాస్త భోజనం పెట్టేవని, ఇంతలా చెప్పుకోవాలా? సరేలే నేనూ వుండను. ఇంతకన్నా వాళ్లింట్లో అయితే నాకూ ప్రశాంతంగా వుంటుంది. ఛీ... ఛీ... అసలు మన ఇంటి సంగతి తెలిసివుండీ ఇక్కడకు తీసుకురావడం నాదే పొరపాటు. నీ పట్టుదల, అధికారం, నీ పెత్తనం, నీమాట అంతేగాని తోటివాళ్లమీద అభిమానం, సానుభూతి, మానవత్వం నీకు లేదు" అని కోపంతో అనేశాడు మోహన్.

కొడుకు కోపం చూసి ఏమనుకున్నాడో...

అంతవరకూ వింటూ వూరుకున్న కాశీపతి కలుగజేసుకున్నాడు.

"ఏమిటి కామాక్షీ వూరుకో రాకరాక వాళ్లు వస్తే ఏమిటీ గొడవ"

"కన్నాక పడక తప్పుతుందా? అంత కోపం రావడానికి నేనేమన్నానని. మిమ్మల్ని వుండవద్దని ఎవరన్నారు? నువ్వు కూడా ఎందుకు వెళ్ళిపోవడం, నేనే నోరు నొక్కుకు పడివుంటాను" అంది.

ఆ తర్వాత మరే గొడవా జరగకుండా అందరూ ఊరుకున్నారు, మోహన్ ఏం నచ్చచెప్పేడో ఏమో పద్మ కూడా సర్దుకుని వూరుకుంది

తర్వాత వాళ్లు వున్నన్నాళ్లు కామాక్షమ్మ నోరెత్తలేదు. మనసులో వినీవిననట్టు గొణుగుకున్నా పద్మగాని, మోహన్రావుగాని ఖాతరు చేయలేదు, అంచేత వారిద్దరికీ అడిగినది చేయక తప్పలేదు కామాక్షమ్మకి.

పగలల్లా ఉద్యోగం ఆ తర్వాత ఏ స్నేహితులతోనో గడిపి, ఏ రాత్రి తొమ్మిదో, పదికో మాధవరావు వచ్చి ఇంత భోజనం చేసి పడుకోవడం తప్పితే, ఇంటి గొడవ పట్టించుకోవడం మానివేశాడు. మాధవరావు తమ్ముడూ, మరదలూ వచ్చేరనేగాని తన తల్లికీ, పద్మకీ జరిగిన ఈ గొడవేమీ తెలీదు.

పగలల్లా పుస్తకాలు చదవడం విశ్రాంతి తీసుకోవడం, సాయంత్రం కాగానే భర్తతో షికారుకో, సినిమాకో వెళ్లి తిరిగివచ్చి భోజనం చేసి పడుకోవడం పద్మ దినచర్య.

కామాక్షమ్మ లోలోన ఎంత వుడికిపోతుందో, పద్మ అంత ఖాతరు లేకుండా వుంది. ఎన్నాళ్లని కామాక్షమ్మ సహించగలదు? ఆమెకు ఒకవంక రోషంగా ఉన్నా ఏమన్నా అంటే మోహన్రావు ఏమంటాడో అన్న భయంవల్ల వళ్లుమండుతున్నది.

పద్మ తల్లిదండ్రులు రెండు రోజులకోసారి చూసి పోవడానికి వస్తూండేవారు, వాళ్లు

వచ్చినప్పుడలా కాఫీలూ, టిఫిన్లూ, మర్యాదలూ చేయక తప్పేది కాదు. వాళ్లసలే గొప్ప ఇంటివారు. ఏం తక్కువ వచ్చినా మొహంముందే అనేస్తారు. కామాక్షమ్మ విలవిలలాడిపోతోంది.

★ ★ ★

పద్మ, మోహన్ వచ్చిన వారం రోజులకు మాలతీ కృష్ణారావూ పెళ్లినుండి తిరిగివచ్చారు. మాలతి చేతిలో విజయకుమార్‌ను చూసి సుశీల కూడా వచ్చిందేమో అనుకుంది పద్మ. కానీ ఆమె ఎక్కడా కనబడలేదు. పైగా ఆమెకు బదులు మరో అమ్మాయి వుంది వెంట! ఆ అమ్మాయి ఎవరో పద్మకు తెలియదు. అందువల్ల 'ఎవరు? ' అన్నట్టు చూసింది మాలతివంక.

మాలతి పద్మ ఇక్కడ వుంటుందని ఊహించలేదు. అంచేత కొంత ఆశ్చర్యపోయి పలకరించింది.

"ఈ అమ్మాయిని నువ్వెరగవుకదూ పద్మా! సరోజ మా పిన్ని కూతురు. అప్పుడప్పుడు కడుపునొప్పి వస్తుందిట. ఇక్కడ హాస్పిటల్‌లో డాక్టర్‌కి చూపాలని వచ్చింది'' అంది.

"ఓహో!" అన్నట్టు పద్మ సరోజవైపు చూసింది. సరోజ చిరునవ్వు నవ్వి పలకరించినట్టుగా ఊరుకుంది.

"బాబు నీ దగ్గర వున్నాడా? సుశీలక్క ఏదీ" అని అడిగింది.

"సుశీల వాళ్లింటికి వెళ్లినప్పుడు, ఇక్కడ వదిలివెళ్లింది"

తర్వాత కామాక్షమ్మ, కాశీపతి పలకరించారు. మోహన్, పద్మని కృష్ణారావు మరల ప్రశ్నలు వేశాడు.

కామాక్షమ్మకు మాలతిని చూడగానే ప్రాణం లేచివచ్చినట్టయింది.

"వచ్చావా నా తల్లీ! బాబు కులాసానా? ఓహో సరోజ కూడా వచ్చిందే" అని అడిగింది.

"అవునండీ అత్తయ్యా! ఒంట్లో బాగులేదట. ఇక్కడ హాస్పిటల్‌లో చూపించుకుందికి వచ్చింది. మందులు కొనుక్కొని వెళ్ళిపోతుంది" అంది.

పద్మ గదిలోకి వెళ్ళి భర్తను అడిగింది.

"ఏమండీ సుశీల కొడుకును ఈవిడ తీసుకువెళ్లడం ఏమిటి? "

"ఏమిటే ఆ గోల మనకెందుకు, ఆవిడకు యిష్టమయింది కాబోలు ఈవిడ వుంచుకుంది. మధ్య మనకేం!"

"లేదండీ! యిందులో ఏదో విపరీతం వుంది నాకు తెలుసు సుశీల ససేమీరా ఒప్పుకోదు!"

"ఎందుకని? "

"ఇంతకుముందు ఒకసారి సుశీలను అడిగేరట, విజయకుమార్‌ను మీ పెద్దన్నగారికి పెంపకం యివ్వమని. కాని సుశీల ఒప్పుకోలేదు!"

"ఏమీ! పెద్ద వదినకు పిల్లలు లేరు కదా! యిహ పుడతారన్న ఆశ కూడా లేదు. పైవాళ్ళేం కాదు కదా! తప్పేముంది మనలో మనకు? "

"బావుంది, మీ మగవాళ్ళకేం తెలుస్తుంది తల్లి ప్రేమ! అందులోనూ మొదట పుట్టిన బిడ్డను ఏ తల్లి పెంపకం యివ్వడానికి వప్పుకుంటుంది? సుశీల కూడా ఆ మాటే అన్నది. ఈ మారు కలిగే బిడ్డను యిస్తాను అని- బాబును మాత్రం యివ్వనని ఖచ్చితంగా చెప్పేసిందిట! అందువల్లనే కదా సుశీల అంటే ఈ ఇంట్లో ఎవరికీ పడకపోడం? అత్తగారూ, అక్కగారూ, బావగారూ, మామగారూ అందరూ బాబుని పెంపకం యిమ్మనేవారే! ఆఖరికి మీ చిన్నన్నయ్య కూడా అదే మాట! అంతేగాని ఆ అమాయకురాలి మనసు ఎంత బాధపడుతోందో ఎవరికీ అక్కర్లేదు!"

"అంత యిష్టం లేనపుడు ఎందుకంత నిర్బంధం!"

"అదే నేనూ అనేది. అలా యివ్వనని

అన్న సుశీల యిప్పుడు పుట్టింటికి వెళుతూ, మీ వదినగారికి బాబును యిచ్చి వెళుతుందా?"

"అయితే బలవంతాన తీసుకున్నారంటావా?"

"అదే నా అనుమానం!"

"ఏం జరిగిందో ఏమో! మనం లేము కదా! వాళ్లే పడతారు ఆ తంటాలు! మనకెందుకు!"

"ఏమయినా తల్లీ బిడ్డనూ వేరు చేయడం అన్యాయం!"

"నిజమే- కాని చిన్న వదిన కూడా అంత మొండి పట్టుపట్టడం బాగాలేదు, ఎంతమంది అలా మొదట పుట్టిన వాళ్ళనే పెంపకం యివ్వడం లేదు?"

"అది వేరే సంగతి. ఎవరి ప్రవృత్తి ఎలా వుంటుందో? వాళ్ళు ఏయే పరిస్థితుల్లో అలా చేశారో! సుశీల విషయంవేరు, యిలా సంతతి కలిగిందో లేదో అపుడే కంసుడు దేవకీ దేవిని అడిగినట్లు అడిగితే ఏమన్నట్లు?"

"పోనీ నువ్వు యివ్వరాదు!" అన్నాడు మోహన్‌రావు నవ్వుతూ.

"మీకు యిష్టమేనా?" అడిగింది పద్మ.

"ఓ! నాకేం అభ్యంతరం లేదు. నీ మనసు అట్లాయితే డైవర్ట్ అవదు! యిప్పటినుండీ ఏం తొందర!"

"ఛీ! మీ మగవాళ్ళు ఎంతసేపూ మీ సుఖం చూసుకోవడమేగాని, మాతృత్వంలో ఎంత ఆనందం వుంటుందో తెలుసుకోలేరు!" ఉద్రేకంలో అంది.

"వూరికనే అన్నాను పద్మా! కొత్తగా కొనుక్కున్న వస్తువునే ఎవరయినా అడిగితే, వెను తీస్తామే అలాంటప్పుడు కన్నబిడ్డను శాశ్వతంగా ధారపోయడం అంత సుళువు కాదని నాకు తెలియదా!"

"సుశీలకాబట్టి వూరుకుంది. నేనే అయితేనా?"

"తొందరెందుకు? ఉండు నిన్నూ అడుగుతారేమో!"

"నన్నా! నన్ను అడిగే ధైర్యం వీళ్ళకు వుండొద్దూ!"

"అప్పుడే ఎంత స్వార్థం!" అన్నాడు నవ్వుతూ

"మనస్ఫూర్తిగా అంటే అంతే మరి!" అనేసింది తనూ నవ్వుతూ.

మాధవరావు ఆఫీసునుండి వస్తూనే సరోజని చూసి మనసులో ఎన్నో వూహలు నింపుగొని ఆనందంలో మునిగిపోయాడు. మళ్ళీ సరోజ రావడం, అతనికి నిజంగా వసంతం వచ్చినట్టయింది పన్నీరు చిలకరించినట్టయింది.

"ఓహో సరూ! నువ్వు వచ్చావా?" అని నవ్వుతూ వుత్సాహంగా పలకరించాడు.

ఒక్కసారి కనుబొమ్మలు ఎత్తిచూసి చూపులు విసిరింది. విల్లు ఎక్కుపెట్టి వదిలినట్టు చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వు అతని హృదయాన్ని పరవశంలో ముంచింది. ఎన్నో అర్థాలు అతనికి వినిపించేయి.

"అవును బావా!" అని మెల్లిగా మోహనంగా అంది.

"ఆ పిల్లకు వంట్లో బావులేదట. హాస్పిటల్‌కు వెళదామని వచ్చింది! వాళ్ళమ్మ వచ్చే వరకూ వుంటుందిట" అంది కామాక్షమ్మ యిష్టంలేనట్టు!

"లేదండీ ఏం చెప్తారో చూసి మందులు కొనుక్కుని వచ్చేమంది అమ్మ" అంది సరోజ.

"అంత తొందరేంలే! వెళ్లొచ్చు" అన్నాడు మాధవరావు.

"మీకు తీరుబడి అయినపుడు నన్ను హాస్పిటల్‌కు తీసుకువెళ్లండి బావా! ఒంటరిగా వెళ్ళలేను!" అని మాధవరావుకి సూచన చేసింది సరోజ.

"అలాగే!" అన్నాడు ఆ అవకాశంకోసమే ఎదురుచూస్తున్న మాధవరావు.

కృష్ణారావుకు ఆఫీసు పనితోనే సరిపో తోంది. మోహన్ పద్మ విషయం తప్పితే, మరొకరి విషయం పట్టించుకోడు. యింక సరోజను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళడానికి మాధవరావుకు తప్పలేదు.

మాధవరావుకి లోపల తనే తీసుకువెళ్లా లని వున్నా పైకి మాత్రం అది తేలిపోవడం ఎందుకని రెండురోజులు వూరుకున్నాడు. అదీకాక ఆ హాస్పిటల్ పని కాస్త అయిపో యిందంటే, అప్పుడే సరోజ వెళ్లిపోతుం దేమో! ఆమె ఎలాగయినా నాలుగయిదు రోజులుండడమే తనకు కావలసింది.

ఆలశ్యం అవుతున్నకొద్దీ సరోజ తొందరచే సింది. అందువల్ల కామాక్షమ్మ ఆఖరికి మాధవరావుతో...

"సరోజ విషయం ఎవరూ పట్టించు కోరేం? అది ఒక్కర్తీ ఎలా వెళుతుంది? ఒరే మాధవూ! నువ్వేనా ఒకసారి తీసుకువె ళ్ళరా! పాపం ఆ పిల్ల తొందరపడుతూంది!'' అని అంది.

అదే అదును అనుకున్నాడు మాధవ రావు.

ఆ సాయంత్రమే యిద్దరూ బయలుదే రారు. దారిలో మాధవరావు సంభాషణ మొదలెట్టేడు.

"ఏం సరూ ఒంట్లో బాగులేదా! ఏమిట యింది? " అని.

"అబ్బే ఏం లేదు బావా! వూరికనే! పెద్ద అనారోగ్యమేం కాదు, నేనసలు వద్దనే అన్నాను! కాని మా అమ్మ పట్టుపట్టి వెళ్ళ మంది, మాలతి అక్కయ్య కూడా రమ్మంటే వచ్చేను!"

"పోనీ ఈ మిషమీదన్నా మళ్లీ చూశాను!''

ఆ మాట విని సరోజ సిగ్గుతో ఎర్రబ డింది. మళ్ళీ యిద్దరి మధ్యా నిశ్శబ్దం, యింకేం మాట్లాడాలో యిద్దరికీ తెలియ లేదు.

ఏదో ఒకటి మాట్లాడాలనే సరోజ...

"సుశీలక్కయ్య ఎప్పుడు వస్తుంది బావా? " అని అడిగింది.

"ఆ సంగతి అడగకు"

"అదేమిటలా విరక్తిగా అంటున్నావు"

"ఆవిడ వచ్చినా, రాకపోయినా ఒకటే. ఆవిడకోసం యిక్కడ ఎవరూ బెంగపడరు"

"అందరిమాటా అలావుంచు మరి నువ్వో!" అని కొంటెగా నవ్వుతూ చూసింది.

"హు!" అని నిట్టూర్చేడు మాధవరావు.

"అది అంతే సరూ! నేనూ అంతే. ఎంచేతో మా యిద్దరికీ యింక కుదరదనిపి స్తోంది. సుశీల వెళ్ళేముందు పెద్ద రాద్ధాంతం జరిగింది. అది తిరిగిరావడం యీ యింట్లో ఎవ్వరికీ యిష్టం లేదు. వచ్చినా యింట్లో ప్రశాంతత వుండదు!"

"అలా అనకు బావా! రోజులెప్పుడూ ఒక లాగవుండవు. నీ జీవితంలో పూవులు పూసే రోజులు రాకపోవు"

ఇంతలో హాస్పిటల్ రావడంతో ఆ ప్రసంగం ఆగిపోయింది. ఆమెను ఉమన్స్ వార్డుకు పంపి తను యివతల నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

కొంతసేపయ్యాక సరోజ వచ్చింది.

"ఏమయింది డాక్టరు ఏమన్నది? " అని అడిగాడు.

"మరేం లేదు! ఎగ్జామిన్ చేసి ప్రిస్క్రిప్షన్ వ్రాసియిచ్చింది. ఈ ఇంజక్షన్లూ, మందులూ ఇంటిదగ్గర వాడమని చెప్పింది!"

మళ్ళీ ఇద్దరూ కులాసాగా కబుర్లు చెప్పు కుంటూ యింటికి వచ్చేసారు.

మాధవరావుకు సరోజతో కలిసి తిరగడం, కబుర్లాడడం మనశ్శాంతినిచ్చింది. సరోజపై కోర్కె ఆరంభమైంది.

అప్పటినుండి ఆమె అంతరార్థం తెలుసు కోడానికి ప్రయత్నించడం మొదలుపెట్టేడు. "ఎప్పుడో చిన్నపుడు తనకి యిస్తామని అను కుంటే సరా! పెళ్ళి అయి, ఒక కొడుకు వున్న తనపై ఆమెకు యింకా కోర్కె వుంటుందన్న నమ్మకం ఏమిటి? ఆమె ప్రవర్తన చూస్తే

తనంటే యిష్టం వున్నట్లే అనిపిస్తుంది కాని దూరదూరంగానే మసులుతూంది. ఎలా ఆమెను తనదిగా చేసుకోవాలి?

సరోజ వున్న ఆ రెండు రోజులూ మాధవరావు చాలా వుత్సాహంగా వున్నాడు. యిద్దరి మధ్యా ఛలోక్తులూ, సరసాలూ, నవ్వు కోవడం జరిగి పోయినాయి. కామాక్షమ్మ చూసినా పట్టించుకోలేదు. కొడుకేకదా అన్న స్వార్థమేమో!

పద్మ ఒకటి రెండుసార్లు చూడటంతో, "మీ అన్నగారు అంత ఆనందంగా వుండడం ఎప్పుడూ చూడలేదే ఏమిటో విశేషం? " అని అడిగింది మోహన్‌రావుని.

"నీకలాగెందుకనిపించింది!" అని ప్రశ్న వేశాడు.

"ఏమయినా మీ మగవాళ్ళకు భార్య దగ్గరవుంటే లేని హుషారు మరో అమ్మాయి ఎవరయినా మాటాడితే చాలు పొంగుకొస్తుంది!" అంది నర్మగర్భంగా.

"అదేదో తిన్నగా చెప్పరాదూ? "

"లేకపోతే ఏమిటండీ ఆ సరోజ, మీ అన్నగారూ! వాళ్ల మాటల ధోరణీ, ప్రవర్తనా చూశారా? "

"ఓ అదా! చిన్నప్పటినుండి వాళ్ళిద్దరూ చనువుగా తిరిగినవాళ్లే. అందుకనే అలా వున్నారు. యిందులో అంత ప్రత్యేకత ఏముంది? "

"ఏమీ అనిపించలేదా? పెళ్ళికాని అమ్మాయి, పరాయి మగవాడితో అట్లా కులాసాగా తిరుగుతూ వుంటే అది బావుందా? "

"ఇంతకీ ఏమయిందీ? "

"పాపం సుశీలను తలుచుకుంటే నాకు నిద్రపట్టదు. సుశీల లేకపోడం, ఈ సరోజ రావడం, మీ అన్నగారి ప్రవర్తన యివన్నీ ఏదో తీవ్రపరిణామంగా తోస్తోంది! సుశీలకు ద్రోహం జరుగుతున్నట్టు అనిపిస్తోంది"

"అదంతా నీ భ్రమ. అలాటిదేం జరుగదు భయపడకు!"

"పోనీ మీరయినా మీ అన్నగారికి కాస్త చెప్పిచూడండి. మీ అమ్మగారు చూసి కూడా పూరుకున్నారు. అదే తన కూతురు అయితే పూరుకొనేదేనా? "

"పద్మా! మనకెందుకీ గొడవలు! అంతగా శృతిమించితే చూద్దాం"

ఏమనడానికీ తోచక పద్మకూడా తనకెందుకని పూరుకుంది. ఆ తరువాత సరోజ కూడా అట్టే రోజులు వుండలేదు. రెండు మూడు రోజులు వుండి వెళ్ళిపోయింది.

రానురాను విజయకుమార్‌కు మాలతి దగ్గర చనువు ఏర్పడింది. అప్పుడపుడు అమ్మకోసం ఏడ్చినా, మాలతి ఏదో మరిపించి వాడి దృష్టిని, మనసును మళ్ళించేది. బాబు ఏడ్చినపుడల్లా పాలసీసా అందిస్తూ వుండేది. పద్మకు అనుభవం లేకపోయినా చదువుకున్నది కావడంచేత అలా చేయవద్దని చెప్పి, అజీర్తి చేస్తుందని హెచ్చరించేది. ఏదో ఒక నిర్ణీతమయిన వేళకు మాత్రం పాలు పడుతూ వుండాలి అనేది. కాని మాలతి అశ్రద్ధవల్లో, బద్ధకంవల్లోగాని అట్లా చేసేదికాదు. అంచేత పద్మ కలుగజేసుకొని బాబుని ఆడిస్తూ శ్రద్ధగా చూసేది.

బాబుకూడా రెండు మూడురోజుల్లోనే పద్మదగ్గరకూడా ఎక్కువ చనువుగా వుండేవాడు. మాలతి దగ్గర ఏడ్చినా పద్మ తీసుకొనేసరికి నవ్వుతూ ఆడుకుంటూ వుండేవాడు.

అది చూసి, "వాడికీ ఆ తల్లిపోలికే... మన దగ్గర వుండడం అంటే ఎందుకో అంత అయిష్టం!" అంటూ వుండేది కామాక్షమ్మ.

విజయకుమార్‌ను తను తీసుకోడం యిష్టం లేదన్న విషయం పద్మ గ్రహించింది.

ఒకనాడు బాబు ఏడుస్తూంటే పద్మ తీసుకోబోయింది. అప్పుడు మాలతి...

"అక్కర్లేదులే నేనూరుకోబెట్టగలను!" అని

యివ్వడానికి అయిష్టత చూపింది.

"నువ్వే బాబును యివ్వడానికి అంత యిదవుతూవుంటే పాపం సుశీల కన్నకొడుకుని వదిలి ఎంత బాధపడుతోంద్దో!" అంది పద్మ.

ఆ మాటకు గతుక్కుమంది మాలతి.

"నేనేం బలవంతాని తీసుకోలేదు. ఆమె యిష్టపడే విడిచి వెళ్లింది. కావలిస్తే అత్తగారూ వున్నారు అప్పుడు" అని అన్నది మాలతి.

ఇంతలో ఎక్కడ విన్నదో కామాక్షమ్మ వచ్చింది.

"చూశారా మనం బలవంతాన్ని బాబుని వుంచేసుకొని, సుశీలని పుట్టింటికి పంపేశామని పద్మ అనుకుంటూంది" అని తన తప్పేమీ లేనట్టు అత్తగారితో చెప్పింది.

"నేనన్నదాంట్లో తప్పేమిటి? నేను బాబును ఒకసారి తీసుకోబోతే ఏదో నీవే కన్నట్టు నాకు యివ్వనన్నావ్! మరి సుశీల వద్దనుండి మీరు తీసుకుంటాం అన్నపుడు ఆమెకు ఎలా వుంటుంది? ఆమెది కడుపు తీపి కదా? బాబును విడిచి ఆమె అక్కడ ఎంత ఏడుస్తూవున్నదో! అని అన్నానంతే!" అని నిర్భయంగా చెప్పింది పద్మ.

"అవునమ్మా అంటుంది అనదూ? నీ అదృష్టం అలా బద్దలవబట్టి ఎన్నయినా అంటుంది. నీ కడుపే పండి ఒక బిడ్డ పుట్టి వుంటే యిలా అనిపించుకొనే గతి వుండేది కాదుకదా!" అని మాలతిని వెనకేసుకువచ్చింది కామాక్షమ్మ.

"నేనేమీ తప్పు మాట అనలేదు. అన్నీ మీరే అనుకుంటున్నారు. సుశీలకు తప్పించి బాబుమీద మీకెంత హక్కువుందో, నాకూ అంతే వుంది, ఏం నేను తీసుకుంటే తప్పా? చెప్పండి!" అని ఖండించి అడిగింది పద్మ.

"అలాగని ఎవరన్నారు. కాకపోతే బాబుని మాలతికి పెంపకం యిద్దామని, దానివద్దే వుంటే చనువు పెరుగుతుందని, మాలతిదగ్గరే వుంచుతున్నాం!" అని కామాక్షమ్మ అంది.

"ఏమిటీ? బాబుని మాలతికి పెంపకమా? సుశీల వప్పుకుందా?"

"అదే వప్పుకుంటుంది? అయినా దాని వప్పుదల ఎవడిక్కావాలి? నా కొడుకు అంగీకరించాడు. మేం అందరం యిష్టపడ్డాం!" అంది కామాక్షమ్మ.

"అంటే బలపంతాన్ని ఒప్పిస్తారన్న మాట! ఏం మనుషులు?" అని కోపంతో అంది.

"ఏదో సామెత చెప్పినట్టు మధ్య నువ్వెందుకు యిదయిపోతున్నావు. నీ సలహా ఏమీ అడగలేదు కదా?" అని కామాక్షమ్మ అంది.

పద్మ మరేమీ అనడానికి యిష్టపడక అక్కడనుండి కోపంతో వెళ్ళిపోయింది.

తర్వాత మోహన్ ఎన్నాళ్లో వుండలేదు. సెలవు అయిపోవడంవల్ల పద్మను వాళ్ల యింటిదగ్గర దిగబెట్టి తాను హైద్రాబాదు వెళ్ళిపోయాడు.



సుశీల వచ్చిందని తెలిసి ఆమె అక్క భారతి, బావ గోపాలరావూ, యిద్దరు పిల్లలోసహా చూడడానికి వచ్చారు.

అక్కను చూసి సుశీల దుఃఖం ఆపుకోలేక భోరున ఏడ్చేసింది. తన గోడంతా అక్కాబావలతో చెప్పుకొని ఏడ్చింది.

"అక్కయ్యా నేను మరి మా అత్తవారింటికి వెళ్లకూడదనే నిశ్చయించుకున్నాను. మీరందరూ వుండగా నేనామాత్రం బతకలేకపోతానా? " అంది.

"అలాగనకే సుశీ! ఏదో కలతలు వచ్చేయని కాపురం చెడగొట్టుకుంటామా? వాళ్ళకేం? మొగవాళ్ళు! మేమందరం వున్నాం సరే! నీకు భయం లేదనుకో అయినా నీ సంసారం నీది! నీ సుఖం నీది! ధైర్యంగా వుండు. వాళ్లను సమాధానపరిచి ఏ గొడవా లేకుండా పంపే పూచీ మాది!" అని ఓదార్చజూచింది.

"లేదక్కయ్యా ఎవరెన్ని చెప్పినా వాళ్ళ మనసు మారదు. వాళ్ళు కిరాతకులుకన్నా కనాకష్టం. వాళ్ళు పెట్టే బాధలు యీ నోటితో చెప్పలేను అవి భరించేకన్నా యిక్కడ వుంటేనే మంచిదనిపించి ఈ నిర్ణయానికివచ్చేను"

"మరి బాబుని అక్కడ ఎందుకు వుంచేసేవు! వాడిని వదిలివుండగలవా? "

"వాడు నా కడుపున ఎందుకు పుట్టాడో! పుట్టకపోయినా బావుండేది! పేరుకు తల్లినిగాని వాళ్ళు వాడిని నా దగ్గర వుండనిస్తారా? తనివితీరా చూడనయినా చూడనివ్వరు. యింక అక్కడ వుంటే మాత్రం ఏం ప్రయోజనం? బాబు నా దగ్గర వుండడం అన్నది వుత్తిది! అందుకే దగ్గర వుంటూ చూడలేక, దగ్గరకు తీసుకోలేక యమబాధపడేకంటే గుండె రాయి చేసుకొని యిక్కడ దూరంగా వుండడమే మంచిదనుకున్నాను!" అని వెక్కివెక్కి ఏడ్వనారంభించింది.

"తల్లినీ పిల్లనీ వేరు చేస్తున్నారా? ఎంత కర్కోటకులు? "

"అక్కడితో ఏమయింది? వాడిని మా తోడికోడలుకి పెంపకం యిచ్చేస్తారట! అందుకే ఆవిడ దగ్గర వుంచుతున్నారు. నన్ను మరచిపోడానికీ, ఆమె దగ్గిర చనువు కావడానికీ వాళ్ల పథకం అది!"

"ఎంత దారుణం! నీవు ఇష్టపడ్డావా? "

"నువ్వూ అట్లాగే అడుగుతున్నావా అక్కయ్యా! యిష్టపడేవుంటే గ్రంథం యింత వరకూ ఎందుకు వస్తుంది? అందుకే కదా నేను అందరికీ చెడ్డదాన్నయిపోయాను!"

"మీ ఆయన ఏమంటాడు? "

"ఆ యింట్లో అందరూ ఒకటే మాట! నన్నూ నా మాటనూ ఎవరూ లక్ష్యపెట్టరు"

"ఇంత అమానుషమా? " అన్నాడు గోపాలరావు.

"ఇంకా వెళ్లమనే అంటావా? అక్కయ్యా"

"ఏంచెప్పేది సుశీ! భర్తనూ, పిల్లలనూ వదులుకోమని ఎలా చెప్పేది? చూస్తూ చూస్తూ ఆ నరకంలోకి వెళ్లమనీ ఎలా చెప్పేది! నాకు ఏమీ తోచడం లేదు! కాని, నీముందు జీవితం సంగతి ఆలోచించావా? "

"అందుకనే నేనొకటి నిశ్చయించుకొన్నాను. యిక్కడ వుంటూ అందరికీ బరువయి కూర్చోలేను. నా కాళ్ళమీద నేను నిలబడాలి. నేను ఎవరికీ బరువుగా బతకదలచుకోలేదు"

"ఏం చేయదలచుకున్నావు? "

"ఇక్కడ నా చిన్ననాటి స్నేహితురాలు లెక్చరర్‌గా వుంది. నేను ఎలాగూ తర్డు ఫారం ప్యాసయివున్నాను కదా. ప్రైవేటుగా మెట్రిక్‌కి కట్టి టైపూ, షార్టుహాండూ నేర్చుకుంటాను"

"అదే మంచిది, నాన్నగారితో చెప్పేవా? "

"ఆయన యిష్టం లేకపోయినా నా బలవంతంమీద ఒప్పుకున్నారు!"

"తప్పకుండా అలాగే చేయి. ఫీజులకు, ప్రైవేటు ఫీజులకు ఏమయినా అయితే బావగారు పంపుతారులే! నీకెప్పుడు డబ్బు అవసరం వచ్చినా ఒక్క కార్డుముక్క వ్రాయి, మేము పంపుతాము!" అని ధైర్యం చెప్పింది భారతి.

ఆ మాటలు విని సుశీలకి కొంత ధైర్యం

కలిగింది.

★ ★ ★

ఆ మర్నాడు మళ్ళీ తండ్రితో ఆ మాట చెప్పింది.

కొండలరావు మరేమీ మాటాడలేకపోయాడు.

సుశీల మనసులో కాస్త వూరట కలిగి స్నేహితురాలు శకుంతల సలహాతో కావల్సిన పుస్తకాలన్నీ తెచ్చుకుంది. రోజూ ఆమె దగ్గరకు వెళ్ళి చెప్పించుకుంటోంది. శకుంతల ఆమెనెలాగయినా పాస్ చేయించాలనే పట్టుదలతో శ్రద్ధగా చెప్పింది.

సుశీలకు మొదట్లో కొంచెం కష్టం అనిపించినా పట్టుదలతో చదవడంవల్ల చదువు సునాయాసం అయింది.

ఆమె ఆసక్తి, చదువుపై శ్రద్ధ చూసి కొండలరావు, పార్వతి కూడా ఆశ్చర్యపోయారు. థర్డ్‌ఫారం పాసయి మానేసినా, ఇప్పుడు మళ్ళీ అన్నీ కొంచెం కొత్తగా అనిపించినా, శకుంతల చెప్పే పద్ధతివల్ల, సుశీల పట్టుదలవల్ల అట్టే కష్టమనిపించలేదు. పొద్దున్న ఇచ్చిన పాఠం సాయంత్రానికే క్షుణ్ణంగా అప్పజెప్పేది.

చదివినంతసేపు చదివి తల్లికి సాయంచేసేది. పార్వతి ఆరోగ్యం బాగులేకపోయినా, ఎలాగో చేసుకొనేది. ఇద్దరు తమ్ముళ్ళూ అప్పటికి కొంచెం పెద్దవాళ్లవడంవలన వాళ్ల గురించి ఏం చేయవలసిన అవసరమూ లేకపోయేది. అయినా సుశీల తమ్ముళ్లనిద్దరినీ స్కూళ్లకు పంపి వాళ్ల అవసరాలు తీరాకే తను చదువుకునేది.

సుశీల అన్ని పనులూ చూసుకోవడం కొండలరావుకి కూడా కాస్త సులువుగా వుంది. పార్వతికి సరేసరి. కాస్త విశ్రాంతి లభిస్తోంది.

సుశీల అప్పుడప్పుడు బాబు జ్ఞాపకానికి వచ్చినా మనసు రాయి చేసుకొనేది. ఏ రాత్రో ఒంటరిగా ఏడ్చి గుండెభారం తీర్చుకునేది.

ఒకనాడు నిద్దర్లోనే సుశీల వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టింది, బాబు కలలోకి వచ్చి.

పార్వతికి తెలివివచ్చి సుశీలను తట్టి లేపింది. "లేమ్మా... లే... ఏమిటలా ఏడుస్తున్నావ్ లే" అంటూ.

సుశీల తెలివి తెచ్చుకొని సిగ్గుపడిపోయింది.

ఊరడిస్తున్న తల్లిని చూడగానే సుశీలకు దుఃఖం పొంగివచ్చింది. అమ్మను వాటేసుకుని తనివితీరా ఏడ్చింది. పార్వతి గ్రహించింది సుశీలకు బాబు జ్ఞాపకానికి వచ్చి ఏడుస్తున్నదని. ఆమె కూడా కంటనీరు పెట్టుకుంది.

"అలా ఏడవకమ్మా. ఊరుకో" అని మాత్రం అనగలిగింది.

"లేదమ్మా! ఏడవను. నువ్వూ, నాన్నా నన్ను కడుపులో పెట్టుకు చూస్తున్నారు కాబట్టే ఇన్నాళ్లూ బాబుని మరచిపోయి వుండగలుగుతున్నాను. ఏమిటో నిద్రలో అలా అయింది అంతే!" అని కంటనీరు తుడుచుకుంది.

"మేం ఎంత చేసినా నీ ఇల్లు, నీ సంసారం ఎలా కుదుట పడుతుందా అని మా విచారం తల్లీ! నువ్విక్కడ, పిల్లాడు ఒక దగ్గిరా ఆ బాధ మాకు తెలియదా తల్లీ" అని పార్వతి ఓదార్చింది.

ఆరు నెలలు దాటిపోయింది. సుశీల పరీక్ష ఫీజు కట్టేసింది. ఆమె తప్పకుండా పాస్ అవుతుందని శకుంతలకు నమ్మకం కుదిరింది. అప్పుడప్పుడు స్లిప్‌టెస్టులు పెట్టేది. వాటిల్లో సుశీలకు మంచి మార్కులే వచ్చేవి.

ఆలోచించి ఆలోచించి కొండలరావు అల్లుడికి ఉత్తరం రాసేడు.

"చిరంజీవులు అల్లుడు మాధవరావును ఆశీర్వదించి రాయునది.

అమ్మాయి వచ్చిన తర్వాత ఉత్తరం రాసినా కూడా నీ వద్దనుండి జవాబు రాలేదు. కారణం తెలియక సుశీల బాధప డుతూవుంది. చి॥ విజయకుమార్ క్షేమం రాయించవలెను.

మీ అత్తగారికి వంట్లో ఏమీ బాగులేదు. ఈ పరిస్థితుల్లో నాకేమీ పాలుపోవడం లేదు.

చి॥సుశీల వచ్చి 8 నెలలు కావొస్తోంది. బాబు కోసం బెంగపెట్టుకుంటోంది. ఆరోగ్యం అంతగా బాగుండడంలేదు. మేమెన్ని ఉత్తరాలు రాసినా మీ దగ్గరినుండి జవాబు రాకపోవడం శోచనీయంగా వుంది.

ఇక్కడ ఊరికనే కూర్చోవడం దేనికని ప్రయివేటుగా మెట్రిక్ పరీక్ష కట్టింది. ఏరోజు కారోజు మీ వద్దనుండి ఏదయినా జవాబు వస్తుందా అని ఎదురుచూస్తున్నది.

ఈ ఉత్తరం అందిన వెంటనే నీవు సెలవు తీసుకొని రావలసింది. తప్పులు ఎవరివల్లనయినా వుంటే వాటిని క్షమించి వచ్చి సుశీలను తీసుకు వెళ్ళవలసింది. వెంటనే జవాబు రాయించవలెను.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి
కొండలరావు

అని రాశాడు.

ఈ ఉత్తరం అందుకొని, మాధవరావూ, ఇంట్లో అందరూ తోకతొక్కిన త్రాచుల్లా లేచారు-

"పిలవకుండా కుక్కలా వెళ్లింది. మళ్ళీ అలాగే రాక వెళ్ళి పిలుచుకురావాలా? "అంది కామాక్షమ్మ,

"పోనీ వెళ్ళినది ఒకటి రెండు రోజులుండి రాక చదువు వెలిగించడమా? " అని మాలతి,

"చదువు వెలిగించి ఏం చేద్దామని చెప్మా" అని కాశీపతి,

"ఏదో ఉద్యోగం చేసి, మొగుణ్ణీ సంసా రాన్ని వదిలెయ్యాలని కాబోలు" అని కామా క్షమ్మ,

"మరీ మంచిది అందుకే నేనూ చూస్తు న్నాను. అలా అడిగితే నేనే ముందు విడా కులు ఇచ్చివేద్దును" అన్నాడు మాధవరావు. అందరూ అన్న ఎత్తిపొడుపు మాటలకు అతనికి పట్టరాని కోపం వచ్చింది.

"అయ్యో... అయ్యో... యింటా వంటా లేనిది దీనికి ఎలాంటి బుద్ధులు పుడుతు న్నాయి? వయసులో వున్నది, మొగుడూ, సంసారం వదిలేసుకుని పుట్టింట్లో వుంటుందా? ఎన్నాళ్ళు వుంటుంది? అవ్వ నలుగురూ వింటే మన పరువేమన్నా వుంటుందా? ఛీ... ఛీ... ఇంత బరితెగించి నదాన్ని మరి ఈ గుమ్మం తొక్కనివ్వకూ డదు" అని రెచ్చిపోయింది కామాక్షమ్మ.

"చతువుతుందిట చదువు. ఇదంతా నా మీద కక్ష సాధించడానికే కానీ... ఇప్పుడే ప్లీడరు దగ్గరికి వెళతాను. ఒక నోటీసు ఇచ్చి పీడ వదిలించుకుంటాను" అని కోపంతో ఉడికిపోతూ అన్నాడు మాధవరావు.

తర్వాత మామగారికి ఈవిధంగా ఉత్తరం రాసాడు.

శ్రీ కొండలరావుగారికి-

మీ ఉత్తరం చదివి మేమంతా ఆశ్చర్యపో యాము.

మీరింత విశాల హృదయులని మేము ఇప్పుడే తెలుసుకున్నాము. మేము వద్దం టున్నా సుశీల మా మాటలు పెడచెవిని పెట్టి తనకుతనే వెళ్ళిపోయినది. కన్నకొడు కుని కూడా వదిలి వెళ్ళినది. మరి ఇప్పుడు ఇక్కడకు రావడానికి మేము రావలెనా? రమ్మనడానికిగాని, వద్దనడానికిగాని మా అదుపాజ్ఞలలో లేని ఆమెకు ఏమి అవుస రము?

ప్రైవేటుగా ఆమె మెట్రిక్‌కి కడుతున్నట్టు ఆమెను విద్యావంతురాలిగా చేయదలచినట్టు రాసినారు. తప్పకుండా అంతపని చేయవల సినదే.

ఆమె ఇన్నాళ్ల తరువాత నేర్చుకొనే ఈ చదువువలన మాకేమీ ప్రయోజనము లేదు. ఎందుకంటే ఆమె ఆర్జనపై బతుకవలసినవారెవరూ ఇక్కడ లేరు. ఇహ ఆ చదువువలన ఎవరికి ప్రయోజనమో! అందులో ఆమె ఉద్దేశమూ, మీ ఉద్దేశమూ కొంచెం ఆలోచిస్తే అర్థమవుతూనే వున్నది.

త్వరలో ఓ ఆహ్వానం పంపుతాను. అప్పుడు ఎవరి త్రోవ వారు చూసుకొనవచ్చును.

ఏమయినా మీ వంటి పెద్ద మనుషులు ఇలాంటి విషయాల్లో కొంచెం ఆలోచించి వుంటే బావుంటుంది.

ఇట్లు
మాధవరావు

సుశీల పట్టుదలతో కష్టపడి చదివింది. పరీక్షలలో బాగా రాశాక సుశీలకు ధైర్యం వచ్చింది. తప్పకుండా పాస్ అవుతానని నమ్మకం కలిగింది.

ఇంతలో పార్వతికి ఆయాసం, దగ్గు ఎక్కువయి మంచం పట్టింది. భారతికి ఉత్తరం రాసేరు, పార్వతికి ఒంట్లో బాగు లేదు అర్జంటుగా రమ్మని.

తల్లి సేవలో నిమగ్నురాలయింది సుశీల. అప్పుడే డాక్టరు ఇంజక్షను ఇచ్చి వెళ్లేడు. మందు తాగి పడుకున్నదల్లా భారతి, ఆమె భర్త వచ్చేరని తెలిసేసరికి తెలివి తెచ్చుకుంది.

"అమ్మా" అని భారతి పిలిచేసరికి అటు వైపు తిరిగింది. కూర్చోమని సంజ్ఞ చేసింది. సుశీల కూడా ఆ పక్కనే వుంది. కూతుళ్లనిద్దర్ని చూస్తూ దుఃఖం ఆపుకోలేకపోయింది.

"ఒంట్లో ఎలా వుందమ్మా!" అని భారతి అడిగింది పార్వతి కంటినీరు తుడుస్తూ.

"ఇంక మరి బతకనమ్మా" అని అంది పార్వతి.

"అలాగనకమ్మా! నీకేం ఫర్వాలేదని డాక్టరుగారు నాన్నగారితో చెప్పేరు. మేమందరం ఇక్కడే వున్నాంగా" అని అన్నది భారతి.

"నేను చచ్చిపోతానని కాదే నా భయం. ఈ సుశీల గురించే భయం. దీని కాపురం చక్కబడితే ఇహ నాకే బెంగా లేదు" అన్నది పార్వతి నీరసంగా.

"ఆ విషయంలో నీవేమీ బెంగపడకమ్మా! అవన్నీ మేం చూసుకుంటాం. సుశీలను మళ్లీ అత్తవారింటికి పంపే పూచీ నాది" అని భారతి ధైర్యం చెప్పింది.

"మీ నాన్నగారి సంగతి తెలుసుకదా అమ్మా. అతనేమీ పట్టించుకోరు. ఇహ మీరే దాని సంగతి చూడాలి. చూశావా రమ్మనమని ఉత్తరం రాయగానే మీరు వచ్చేరు. బాగులేదని రాసినా ఆ అల్లుడు రానేలేదు. ఏం చేసేమని ఇంత కక్షో తెలియదు"

"పోనీలెండి. మీరు నిశ్చింతగా వుండండి' అని భారతి భర్త అన్నాడు.

"ఏమిటో అతను వచ్చి సుశీలను తీసుకు వెళతాడన్న ఆశ నాకు లేదు"

"మామగారికి చెప్పి మళ్లీ ఉత్తరం రాయిద్దాంలెండి. సుశీల గురించి మీరు మనోవ్యాధి పెట్టుకోకండి. అతనే వచ్చి తీసుకువెళతాడు"

పార్వతి నిట్టూర్చి "నీ కడుపు చల్లగా అలాగయితే ఇంకేం కావాలి?"

ఆ తర్వాత పార్వతిని ఎక్కువ మాటాడించక, విశ్రాంతి తీసుకో అని చెప్పి సుశీలా, భారతి వెళ్లిపోయారు పనులు చూసుకుందికి.

అప్పటికప్పుడే వారంరోజుల బట్టి ఆమెకు బాగుండలేదని సుశీల అక్కకు చెప్పింది. పెద్దది భారతి వచ్చాక తమ్ముళ్లిద్దరికీ కూడా భయం పోయింది.

తర్వాత పార్వతి పరిస్థితి రోజురోజుకీ నిరాశ కలిగించజొచ్చింది. అందువల్ల భారతీ ఆమె భర్త కూడా వెళ్లడానికి వీలులేకపోయింది. కొండలరావు పైకి

గంభీరంగా వున్నా లోలోపల ధైర్యం కోలు పోయి విచారంగా వున్నాడు.

ఇలాటి పరిస్థితుల్లో మాధవరావు దగ్గిర నుండి ఒక రిజిస్టర్డు లెటర్ వచ్చింది.

అందులో తమ కుశలంగాని, పార్వతి ఎలాగుందనిగాని ఏమీలేదు సరికదా అది ఒక ప్లీడరు నోటీసులా వుంది.

"నాకు భార్య అయిన సుశీల అనగా మీ కుమార్తె మా ఇష్టం లేకుండా మీ ఇంటికి వచ్చి రమారమి ఒక ఏడాది అయింది. ఇప్ప టివరకూ తిరిగిరాలేదు. ఎన్ని ఉత్తరములు వ్రాసినా జవాబు కూడా లేదు.

హిందూధర్మ శాస్త్రం ప్రకారం, మన ఆచార వ్యవహారాల దృష్ట్యా పెళ్ళి అయిన స్త్రీ భర్త వద్ద అత్తవారి ఇంట్లోనే వుండడం అన్నది చట్టబద్ధమయిన విషయం.

ఒక ఏడాది దాటిపోయినా తిరిగి రాకపో వడంలో ఆమె ఉద్దేశం, పంపకుండా మీ వద్దే వుంచుకోవడంలో మీ ఉద్దేశం మాకు తెలియరావడంలేదు.

అంతేగాకుండా ఆమె ఒక్కగానొక్క కొడు కుని కూడా మమకారం లేకుండా ఇక్కడే వదిలి చదువుకుంటున్నది. అంత అవసరం, అగత్యమూ ఏమి కలిగినదో మాకు అర్థం కాలేదు.

ఆమెకు భర్త, సంసారమూ ముఖ్యమో, చదువూ ఎడబాటూ ముఖ్యమో తేల్చుకొనవ లసిన పరిస్థితి కలిగినది.

నాతో సంసారము ఇష్టం లేనప్పుడు, దానిని చట్టప్రకారమూ తీర్మానించుకొని విడాకులు పొందవచ్చును.

ఈ ఉత్తరం అందిన వెంటనే సకాలంలో నాతో కాపురం ఇష్టమో, లేక అక్కడే వుండి పోవడం ఇష్టమో మీ కుమార్తె అభిప్రాయం తెలుపవలెను.

ఈ ఉత్తరం అందిన పదిరోజుల్లో ఆమె రావడమో, ఆమె నిశ్చయమేదో అది మాకు తెలియనిచో ఆమెకు నాతో కాపురం చేయడం ఇష్టం లేనట్టు కొడుకును కూడా వదులుకున్నట్టున్న భావించి చట్టప్రకా రమూ విడాకులు ఇచ్చి తెగతెంపులు చేసు కుని మరొక వివాహము చేసుకొనే అధి కారం కలిగియున్నానని తెలియపర్చడమై నది.

ఇదీ ఆ ఉత్తరం సారాంశం

అది చదివేక కొండలరావుకు అమితమ యిన కోపం వచ్చింది. కాని ఏం చేయగ లడు?

"చూశావా? ముందు చెప్పాను విన్నావు కాదు. దీనికేం జవాబిస్తాం" అన్నాడు.

"పుట్టింట్లో ఎన్నాళ్లయినా వుంటుంది. అంతమాత్రంలో విడాకులు పుచ్చేసుకున్న ట్టేనా? " అంది భారతి.

"ఇన్నాళ్లూ ఒక ఉత్తరం ముక్కయినా వ్రాయకుండా మీదుమిక్కిలి అతగాడు వ్రాసిన ఉత్తరాలకు జవాబు లేదంటున్నాడు

"తొందర పడకండి! దానికి తగినవిధంగా ఆలోచించి జవాబు రాద్దాం" అన్నాడు భారతి భర్త.

"ఖచ్చితంగా నేను రానని రాయండి నాన్నగారూ! నేను మళ్ళీ వెళ్లి ఆ బాధలు పడలేను. అంతకన్నా ఆ విడాకులే నయం నిశ్చింతగా వుండవచ్చు. నా రాత ఎలా వుంటే అలా వుంటుంది. నేను మాత్రం వెళ్లేది లేదు" అంది సుశీల.

"నానా బాధాపడి పెళ్లి చేసింది ఇందుకా. బుద్ధిగా సంసారం చేసుకొని, సుఖంగా వుండాలిగాని" సుశీలను కసిరేడు కొండల రావు.

"దానినేమీ అనకండి, అది అసలే మనసు పాడయి బాధపడుతోంది. కొడుకూ లేక, భర్తా లేక దానికిలా వుండడం ఏం సుఖమా? ఇక్కడ వుండిపోవడం మాత్రం ఇష్టమా? అక్కడ వాళ్లు పెట్టే బాధలు పడ లేక అలా అంటున్నదిగాని, భర్తను వదు లుకుంటుందా? " అంది భర్తతో.



"వాళ్లేదో కోపంలో అన్నారని కొడుకుని సంసారాన్ని వదిలి వచ్చేస్తారా? ఇప్పుడేం చేయాలి? " అని అరిచేడు కొండలరావు.

"ఆడపిల్లని అత్తవారింటికి పంపించినంత మాత్రంలో మీ బాధ్యత తీరిపోయిందనుకున్నారా? ఆ తర్వాత ఆ పిల్ల అక్కడ ఎలా వుందో చూశారా? ఎంతసేపు మీ పట్టింపులేగాని, ఆడపిల్ల సౌఖ్యం, వాళ్లమంచీ అక్కర్లేదు. అసలు ఇంతవరకూ వచ్చింది అందువల్లే. నా సంగతి వదిలేయండి. అందరూ మా ఆయనలాగే వుండరు. చెల్లిని అక్కడకు పంపాక మీరొక్కసారయినా వెళ్లి చూశారా? ముచ్చటకయినా? తీసుకువచ్చారా? " నిలదీసి అడిగింది భారతి.

కొండలరావు ఏమీ జవాబు చెప్పలేకపోయాడు.

"ఏవో చికాకులు వస్తే సర్దుకోవాలన్నాను గాని, మరేమన్నాను. మీరు నా ఇంట్లో ఎన్నాళ్లు వున్నా నాకు బరువా? మన మాటకేమి లోకంలో అందరూ ఏమనుకుంటారు? " అన్నాడు.

"మరేం ఫర్వాలేదు నాన్నా, లోకం ఆడి పోసుకునేంత తప్పేమీ అది చేయలేదు. ఇక్కడ అమ్మకు వంట్లో బాగులేదని, అంచేత వుండిపోయిందని త్వరలోనే పంపి వేస్తున్నాం అని ఉత్తరం రాసి పడేయండి, తర్వాత చూద్దాం" అని భారతి చెప్పింది.

"రాస్తాననుకో. కాని ఆ ఉత్తరంలో అతను రాసిన తీరును చూస్తే ఏదో బాధ పెట్టి సుశీలకు అన్యాయం చేద్దామనే ఉద్దేశం కనబడుతోంది. అందుకే నేను భయపడుతున్నాను"

"అవును అట్లాగే కనబడుతోంది. దీనికి జాగ్రత్తగా ఆలోచించి రాయాలి. ఇంతవ రకూ వస్తుందని ఇంతకు తెగిస్తారని అను కోలేదు" అన్నాడు భారతి భర్త.

"ఇంక జవాబులూ అదీ ఎందుకు? వెంటనే సుశీలను పంపివేస్తే సరి! ఏ గొడవా వుండదు" అన్నాడు కొండలరావు.

"నాకు విషం ఇచ్చి చంపేయండి. అంతే గాని నన్ను అక్కడకు పంపకండి. నేను వెళ్లను" అని అంది సుశీల.

ఇంక ఎంత వాదించినా చెప్పినా సుశీల వినే పరిస్థితిలో లేదని అందరూ వూరుకు న్నారుగానీ, అసలే జబ్బుతో తీసుకుంటున్న పార్వతికి ఈ సంఘటన అశనిపాతంలా తగిలింది. ఆమె మనోవ్యాధికి మూడొం తులు కారణం సుశీల భవిష్యత్తు. ఇప్పుడా విధంగా ఉత్తరం వచ్చేసరికి పూర్తిగా ఆమె మనసు బెంగతో కృంగిపోయింది.

తెలివి వచ్చినప్పుడల్లా సుశీలను పిలిచి "మొండి పట్టు పట్టకమ్మా. నా మాట విని మీ ఇంటికి వెళ్లిపో" అనేది.

"అలాగే వెళతానులే కానీ నిన్నీ స్థితిలో వదిలేసి ఎలా వెళ్లేది? బెంగపడకు. నీకు కాస్త నయమయితే వెళతాను" అనేది సుశీల.

"నా సంగతి కేమిలే ఎప్పుడూ వున్నదే కదా, నీవూ నీ భర్తా, పిల్లలూ సుఖంగా వుంటే ఆ మాట విని హాయిగా వెళ్లిపో తాను. నాకు మరే కోర్కెలేదు" అని అంది.

ఆ తర్వాత పార్వతి ఎన్నాళ్లో బతక లేదు.

ఒకనాడు మధ్యాహ్నం భోజనాలయినాక ఆమె కూడా బార్లీ, రొట్టీ తిని పడుకు ంది. డాక్టరు వచ్చిచూసి, ఒక యింజక్షన్ యిచ్చి వెళ్ళేడు. అతనింకా గుమ్మందాటి వెళ్లేడో లేదో...

"అమ్మో! తల బద్దలయిపోతూంది!" అని అంటూ మంచంమీద వాలిపోయింది.

డాక్టరు మళ్ళీ వచ్చి ప్రాణం పోయిందని చెప్పి వెళ్ళిపోయాడు.

సుశీల, భారతి, పిల్లలూ పార్వతిమీద పడి ఏడ్వడం మొదలుపెట్టేరు. అక్కడ ఓదార్చేవారెవరు?

కొండలరావుకీ విషయం తెలిసి ఉన్నపా టునే కూలబడిపోయేడు. అల్లుడే ఓదార్చవ లసి వచ్చింది.



పార్వతి అంత్యక్రియలు అయేంతవరకూ వుండి భారతి భర్త వెళ్ళిపోయేడు. తండ్రికీ, పిల్లలకీ కాస్త ధైర్యంగా, సాయంగా వుంటుం దని భారతి కొన్నాళ్ళపాటు వున్నది.

కొండలరావు అల్లుడు మాధవరావుకు ఈ సంగతి రాస్తూ సుశీలను వెంటనే దిగబెడ దామనుకున్నా! అకస్మాత్తుగా జరిగిన ఈ సంఘటనవలన పంపడం జరుగలేదని,

కొంచెం స్థిమితపడ్డాక ఒకటి రెండు నెలల్లో తప్పకుండా పంపివేస్తామని, అందుకు మరోవిధంగా భావించవద్దని రాస్తూ యీ దుఃఖసమయంలో ఒకసారి వచ్చి సుశీలను కూడా చూసివెళ్తే మంచిదని కూడా రాసేడు.

కాని ఆ ఉత్తరానికి, అత్తగారు పోయిందన్న పరామర్శ ఉత్తరం తప్పితే సుశీల విషయంగాని, ఆమెను తీసుకువెళ్ళే విషయంగాని లేదు. ఎవరూ రానూలేదు.

తర్వాత కొన్నాళ్ళు చూసి కొండలరావు భారతితో కూడా ఆలోచించి, సుశీలను పంపడం ఆలశ్యంచేస్తే మంచిది కాదని భావించి ఒక నిర్ణయానికి వచ్చేరు.

కొండలరావు వెళ్ళడానికి నిశ్చయించుకొనలేదు. పార్వతి పోయిందని పరామర్శకు రాకపోయినా, అందుకని యీ పరిస్థితుల్లో వెళ్లడం యిష్టంలేకపోయినా, సుశీలకోసం భారతిని పంపేందుకు నిర్ణయించుకున్నారు.

పార్వతికోరిక కూడా అదే, సుశీలను దిగబెట్టివేస్తే ఆమె ఆత్మకూడా శాంతిస్తుంది. అందుకని భారతికూడా ఆమెతో వెళ్ళడానికి నిశ్చయించుకుంది.

ఇష్టంలేకపోయినా సుశీలకు తప్పింది కాదు. కాని విజయకుమార్‌ను తలుచుకొనేసరికి హృదయం అటుపక్క లాగజొచ్చింది. అంచేత మరేమీ అడ్డుచెప్పకుండా బయలుదేరింది.

ఒక మంచిరోజు చూసుకుని తిరిగి కొత్తగా అత్తవారింటికి పంపేటప్పుడు ఆడపిల్లను పంపుతున్న విధంగానే వాళ్లకు తోచినవేవో పెట్టి పంపేరు.

ఆడవాళ్ళు ఇద్దరూ వస్తున్నారని రాసినా స్టేషనుకు ఎవరూ రాలేదు. భారతి, సుశీలా రిక్షా చేసుకుని వెళ్ళేరు. సుశీలకు మనసులో బితుగు బితుకుగానే వుంది. భారతికూడా అంతకన్నా మనసులో ఎప్పుడో పెళ్లిలో చూసిన మొఖాలు! ఎలా మాట్లాడడమో ఏమిటో అనుకున్నది.

వాళ్ళింట్లో తన తల్లికీ తండ్రికీ జరిగిన ముచ్చట కూడా విన్నదామె, కొంచెం భయంగానే వున్నది.

సుశీలకు ఒక్కటే మొండిధైర్యం, ఆమె అన్నిటికీ తెగించింది. కాబట్టి మనసు రాయి చేసుకుంది. ఎప్పుడయితే తిరిగి రావడం తప్పలేదో అప్పుడే దేనిసయినా ఎదుర్కొనేందుకు సిద్ధపడింది.

ఇంటికి రాగానే వీరికోసం ఎవరూ అట్టే ఎదురుచూడకపోయినా "ఎందుకు వచ్చేరని మాత్రం అడగలేదు. అందుకు సంతోషించారు.

"పాపం! మీ అమ్మగారు పోయేరటగా! చాలా కష్టం వచ్చింది. యింత చిన్నపుడే నూరేళ్ళూ నిండిపోయాయి! వద్దాం అని అనుకున్నా దూరాభారం, రాలేకపోయాం" విధిలేక పరామర్శించింది కామాక్షమ్మ.

సుశీల, భారతీకూడా తలలువంచి కన్నీళ్లు తుడుచుకున్నారు.

"పాపం మీ నాన్నగారికి చాలా కష్టం, యింకా చిన్నపిల్లలూ, సంసారం ఎలా వెళుతుందో మరి! ఆవిడకేం హాయిగా పసుపూ కుంకుమతో వెళ్ళిపోయింది, ఏ చింతా లేకుండా అదృష్టవంతురాలు!" అని అన్నాడు కాశీపతి.

"ఇంకా మా తమ్ముళ్లకు జ్ఞానం రాలేదండి! ఎలా గడుస్తుందో ఏమిటో? " అంది భారతి.

ఇంతలో మాలతి వచ్చి సుశీలను కళ్లతోనే పలకరించింది... విచారం కనబరుస్తూ.

మరెవరూ అట్టే కలుగజేసుకోలేదు.

సుశీల వచ్చినదగ్గర్నుండి ఆమె కళ్ళు బాబు కోసమే వెతుకుతున్నాయి. కొంతసేపటికి మాలతి బాబును ఎత్తుకువచ్చింది.

బాబు మాలతిదగ్గర అతి చనువుగా ఆడుకుంటున్నాడు. ఆశ్చర్యం ఏమిటంటే సుశీలను చూసినా, 'అమ్మా' అని దగ్గరకు రాలేదు. ఎవరో పైవాళ్ళని చూసినట్టు

చూసి వూరుకున్నాడు.

సుశీలకది భరించరానిదయింది. అక్క భారతిని చూసి ఏడ్చేసింది. తర్వాత బాబును దగ్గరకు తీసుకుంది.

మాలతిగాని, కామాక్షమ్మగాని ఏమీ అన లేదు. కానీ బాబు ఏడవకపోయినా పరిచ యంలేని వాళ్ళదగ్గరకు వెళ్లినట్టు యిబ్బంది పడుతూనే వెళ్ళేడు.

సుశీల బాబును తీసికొని హృదయానికి హత్తుకుని, ముద్దులవర్షం కురిపించింది, బాబు వుక్కిరిబిక్కిరి అయి ఏడ్వడం మొద లుపెట్టేడు. తిరిగి మాలతి అందుకుంటేనే గాని వూరుకోలేదు.

ఈ మార్పు చూసి సుశీల, భారతి కూడా నిశ్చేష్టులయ్యారు. బాబు సుశీలను వదిలి ఏడాది కావొస్తుంది కదా. మరచిపోయి వుంటాడని భారతి చెల్లిని ఓదార్చింది.

తర్వాత కృష్ణారావు వచ్చి "మీరు సుశీల అక్కగారు కదూ! ఎప్పుడో పెళ్లిలో చూశాం. పాపం మీ అమ్మగారు పోవడం... ఎవరం కూడా యిలా జరుగుతుందని అనుకోలేదు" అని పరామర్శించారు.

మాధవరావు వచ్చి సుశీలను తిరస్కా రంగా చూసి, ఏమీ అనకుండా వెళ్ళిపో యాడు. కనీసం భారతిని కూడా పలుకరిం చలేదు.

తరువాత సుశీలను ఎవరూ ఏమీ అన లేదు, భారతికిది ఆశ్చర్యంగానే వున్నది. అయితే తను వుండడం వలన ఈవిధంగా వూరుకొని వుంటారని అనుకుంది.

కామాక్షమ్మ భారతిని మర్యాదగానే చూసినా ఏదో ఓ సందు చూసుకుని సుశీ లను, కొండలరావును విమర్శిస్తూనే వుంది.

"భారతీ నువ్వూ సుశీలా తోడబుట్టిన వాళ్లేనా? అయినా మీ యిద్దరికీ ఎంత తేడా వుందో చూశావా? నీ శుభ్రం, నీ పని, నీ మాట, మంచితనం బొత్తిగా సుశీలలో లేవ నుకో! యిలా అంటున్నానని ఏమీ అనుకో కమ్మా!" అంది.

"ఏమిటో చిన్నతనంలెద్దురూ! మీరు తల్లి లాంటివాళ్ళు సర్దుకుపోవాలి!" అని యుక్తిగా చెప్పింది భారతి.

"మన ఆడవాళ్ళం ఎలాగయినా సర్దుకు పోతాం అనుకో! మగవాళ్లున్నారు చూడూ వాళ్లు మనలాగే వుంటారా? నువ్వు దాని కన్నా పెద్దేకదా చూస్తే అదే నీకన్నా పెద్ద దానిలా వుంది. అలా వున్నందుకయినా ఈ కాలం పిల్లల్లా నాజూకుగా తయారవడం అదీ తెలీదు. మరి మగవాడి మనసు మారిందంటే... తప్పా! నా కొడుకుని అనడం కాదు!" అని వింత కారణం ఒకటి మెల్లిగా చెప్పింది.

అది విని భారతి ఆశ్చర్యపోయింది.

"దాని తత్వమే అంత! అయినా ఏమ యిందేమిటీ? " అని అడిగింది అర్థంగాక.

"అలాగడుగు చెబుతాను, ఎప్పుడూ ఎడ్డిలా వుంటుంది. ఒక శుచీ శుభ్రం వుండదు. ఒక షోకు అనదు. పెద్దమ్మలా నడకా అదీ, కాస్తయినా నాజూకు లేదు కదా! యిహ మాటాడిందంటే వూరంతా వినబడుతుంది. ఇక నవ్వు వస్తే మరి ఆగదు, ఎవరున్నా లేకపోయినా అంతే. ఈ అలవాట్లన్నీ మార్చుకోమంటే వినదు, మా వాడికి యిలాటివి అంటే చెడ్డకోపం!"

ఆ మాటలు విని భారతికి ఏమనాలో తోచలేదు.

"సుశీల కొంచెం ఎదిగిన మనిషిలా కని పించినమాట నిజమే! తనది కాయ శరీరం! సన్నంగా, ఆమెకన్నా తెల్లగా, పొట్టీ, పొడుగూకాక వుంటుంది. అయినా కామా క్షమ్మ వర్ణించినంత అధ్వాన్నంగా వుండదు. ఒక్కొక్కళ్ళది ఒక్కొక్క తత్వం. వీళ్ళ కంటికి బాగా కనబడేటట్టు తయారవలేదన్న మాట! బాగానే వుంది" అని తనలో అను కుంది.

"నే చెబుతాలెండి చిన్నతనం తెలీదు!" అని సర్దిచెప్పింది.

"చూడమ్మా! ఏదో కోపంకొద్దీ అంటామనుకో ఆమాత్రం దానికే ఎడీ అంటే పెడీ అని జవాబిస్తుంది. చిన్నాపెద్దా చూడదు. పెద్దదాన్ని ఎలా వుంటుంది చెప్పు!" అని కామాక్షమ్మ అంది.

భారతి వింటూ వూరుకుంది.

"నువ్వే అనుకో అమ్మాయీ! మీవాళ్ళ సంగతే తీసుకో ఇలా పెళ్ళిచేసి, మా ఇంటికి దిగబెట్టేరు. తర్వాత తిరిగి చూడలేదు. సారెలేదు, చీరలేదు! తొలిచూలు పిల్లని, తొమ్మిదో నెల వస్తేనేగాని పురిటికి తీసుకు వెళ్ళలేదు కదా! యిలా ఎవరయినా చేస్తారా? లోకంలో మరెవ్వరూ ఆడపిల్లలని అత్తవారిళ్లకు పంపలేదా? అదేనా మర్యాద!"

ఆ మాటల్లో నిజం లేకపోలేదనిపించింది భారతికి.

"మానాన్నగారు కొంచెం అశ్రద్ధ మనిషండీ! యిక మా అమ్మగారి సంగతి మీకు తెలుసుకదా! ఎదురు చెప్పలేదు, స్వతహా చేద్దామన్నా ఆమె మాట పడనివ్వరు! అంచేత అట్లా అయిపోయింది గానండీ! యిందులో మరోవిధంగా అనుకుందికి ఏమీ లేదండీ! మానాన్నగారికి తీరుబడిలేక రాలేదు. యిలా మీకేకాదు నన్ను పంపిన పుడూ యిదేవరస. అయినా సంబంధాలు చేసుకున్నాక తప్పుతుందా చెప్పండి! ఎలాగో సర్దుకుపోవాలి! ఒక దగ్గిర కాకపోతే మరో దగ్గిర పుచ్చుకోవచ్చు... లోపాలుంటే మీవంటి పెద్దలు సర్దుకోవాలిగాని ఆడపిల్లలం మేమేం చేయగలం!" అని తమాషాగా సర్దిచెప్పింది భారతి.

ఆమె సమాధానాలకు ఆశ్చర్యపోయింది కామాక్షమ్మ.

"చూశావా! నువ్వు ఎలా శాంతంగా, మర్యాదగా జవాబులు చెబుతున్నావు! ఈ మాటలే మీ చెల్లెలు దగ్గిర అంటే కొట్టవచ్చినట్టు మీదకు వస్తుంది. పెట్టుపోతలు లేకపోయినా ఆ మాత్రం అనుకోరటమ్మా? అనుకుంటే అదో పెద్ద తప్పా? పెట్టినా పెట్టకపోయినా నువ్వు ఎంత చక్కగా సమర్థించి చెప్పేవు? నీ మాటలు విన్నాక మళ్లీ ఎవళ్లయినా అడుగుతారా? ఆ మాట మంచితనం లేదు కదా!" అని అంది కామాక్షమ్మ.

కామాక్షమ్మ అన్న మాటలు సబబుగానే వున్నట్టు అనిపించేయి భారతికి. ఇందులో వుంటే సుశీల తప్పు కూడా కొంతవరకూ వుండవచ్చునేమో అనుకుంటుండగా, విజయ్ కుమార్‌ను తీసుకుని మాలతి వచ్చింది.

"ఇదో పెద్ద చిక్కు వచ్చిపడిందమ్మా... నువ్వే చెప్పు! మా పెద్దకోడలు కాపురానికి వచ్చి ఏడెనిమిదేళ్లవుతోంది, కాన్పులేదు. సుశీల కొడుకును చూసి ముచ్చటపడి తన దగ్గర వుంచుకుంటాననంటుంది! కాని మాలతి వాడిని ముట్టుకుంటే చాలు బాబు ఏమయిపోతాడో అన్నట్టు పెద్ద రాద్ధాంతం చేస్తుంది"

మాలతి జాలిగా చూసింది.

సుశీల దగ్గర్నుండి బాబును వేరుచేసి మాలతికి పెంపకం యిద్దామన్న వారి వుద్దేశ్యం పైకి స్ఫురించకుండా మాటాడినా భారతి అది గ్రహించకపోలేదు.

"ఏదీ దానికి మాత్రం తొలికాన్పేకదా! అందుకని తన దగ్గిర చనువుపోతుందని దాని భయం అంతేనండీ! దానికి మాత్రం ఎంతమంది వున్నారని" అని సమర్థించింది.

"అవునక్కయ్యా చూడు, ఒక ఏడాది అయిందోలేదో నేను వచ్చిననుండి నా దగ్గరకే రావడంలేదు. నన్ను కొత్త మనిషిలా చూస్తున్నాడు. యింకెన్ని చెప్పినా సరేగాని, బాబును విడిచి వుండలేనక్కయ్యా" అని అప్పుడే అక్కడికి వచ్చిన సుశీల అంది.

భారతి ఎవరికీ జవాబు చెప్పలేకపోయింది.

సుశీల రావడంతో అప్పటికా ప్రసంగం ఆగిపోయింది. కామాక్షమ్మ మరేమీ అన

కుండా లేచి తన పనిలోకి వెళ్లిపోయింది, మాలతి కూడా వెళ్లిపోయింది.

భారతి రెండు రోజులుకన్నా ఎక్కువ వుండలేదు. ఆ రెండు రోజులూ కూడా కామాక్షమ్మ దగ్గిర కూర్చోబెట్టుకుని, సుశీల మీద చెప్పవలసినవన్నీ చెప్పింది. వెళ్లిపోతున్నపుడు బొట్టు పెట్టి, జాకెట్టు బట్ట యిచ్చి పంపింది.

తాము భయపడినట్టు, ఏమీ జరుగనందుకు భారతి సంతోషించింది. పదేపదే సుశీలను జాగ్రత్తగా మసులుకొమ్మని చెప్పి వెళ్ళిపోయింది.

సుశీల వచ్చిన మొదటి రోజునే మాధవరావు వెటకారం ప్రారంభించాడు.

"ఏం చదువు పూర్తయిందా! డిగ్రీ పుచ్చుకువచ్చావా!" అని అడిగేడు.

ఏం చెబితే ఏమంటాడో అని సుశీల మౌనంగా వూరుకుంది.

"ఏం మాటాడవు? ఎవరు రమ్మన్నారు నిన్ను. అక్కడే వుండలేకపోయినావా? " అని తిరిగి అడిగాడు.

"అక్కడ వుండడానికేనా చేసుకున్నది!" అని వూరుకోలేక అంది.

"అబ్బో! అట్లా అయితే మరి చదువు వెలిగించిందెందుకో"

"వూరికనే కూర్చోడం దేనికని, ప్రయివేటుగా కట్టేనంతే యిప్పుడందరూ భార్యలని కూడా చదవమని ప్రోత్సహిస్తూవుంటే మీకూ యిష్టమే అని అనుకున్నాను"

"అభిప్రాయం మంచిదయితే బాధలేదు"

"మీరెలా అనుకున్నా... చదువుంటే ఎందుకయినా మంచిదికదా!"

"మంచిదే భర్తనీ, బాబునీ కూడా వదిలి ఎవరిని ఉద్ధరించాలనో ఆ చదువు? "

"వెళ్ళేక మీరు వచ్చి తీసుకు వెళతారని చూశాను. మీకా జ్ఞాపకమే లేదు. మీరు వచ్చేవరకూ ఆ పని అయినా చేద్దామని బుద్ధిపుట్టింది!"

"నోర్మూయ్! సిగ్గులేకపోతే సరి!"

"ఎందుకు సిగ్గు! నేనేం కూడని పని చేయలేదుగా. మా వాళ్ల యింట్లో వుండే చదువుకున్నాను!"

"ఏదో ఏడిచావు, మళ్ళీ యిక్కడికెందుకు వచ్చావు. యిప్పుడు నేను పిలప వచ్చానా? అంతా నీ యిష్టమేనా? "

"ఇష్టంలేనిది నాకు కాదు! మీకని చెప్పండి! అందుకేకాబోలు రిజిష్టర్ నోటీసు యిచ్చారు విడాకులు యిస్తానని!"

"ఆ భయం వల్లనే కాబోలు వచ్చావు. విడాకులు యివ్వనంతమాత్రంలో నన్ను అడ్డగలవా? ఏదో తెలియక అప్పట్లో నీ మెడలో తాళికట్టేను! లేకపోతే అందమనా? తెలివితేటలనా? ... యిప్పుడు ఆ పొరపాటు తెలుసుకున్నాను. యిక జీవితాంతం విచారిస్తూ కూర్చోలేను... నీకీ యింట్లో వుండాలంటే వుండు. నీకూ నాకూ మరి సంబంధంలేదు. నా విషయంలో జోక్యం కలుగజేసుకోవద్దు!"

"నేనేమంత పొరపాటు చేసేను మీరింతలా నన్ను కాదనడానికి" అని అతను అన్న మాటలకు ఏడుస్తూ అడిగింది సుశీల.

"అదంతా నీకు చెప్పాల్సిన అవుసరం లేదు. నీకు తెలియదు ఒకరు చెబితే వినవు! ఒకరిని చూసి అయినా నేర్చుకోవు! అంతే!"

"పోనీ నావల్ల తప్పేమిటో చెప్పండి!"

"నాకు ఎలా చెప్పాలో తెలియదు... ఒక విషయం - మీ అక్కయ్యను చూడు నీకన్నా పెద్దది. యిద్దరు పిల్లల తల్లి! ఎలా వుందీ. నీకన్నా చిన్నదానిలా వుంది! మంచీ మర్యాద, అందమూ అన్నీ వున్నాయి. మరి నువ్విలా వుండటానికి కారణం ఏమిటి? ఒక్క పిల్ల తల్లివి అయావో లేదో నలభైఏళ్ల దానిలా వున్నావు. అసలు యిప్పుడేమిటి నువ్వు మొదటినుండీ అలాగే వున్నావు!"

ఆ మాటలు విని నిశ్చేష్టురాలయింది

సుశీల.

"బావుంది ఎవరి శరీర తత్వం వారిది! ఒకరి అందం ఒకరికెలా వస్తుంది? భగవంతుడు చేసిన దానికి నేనేం చేస్తాను? యివన్నీ పెళ్లాడినపుడే చూసుకోలేకపోయారా! అపుడు కనబడిన అందం యిప్పుడు లేకపోయిందా? " అని వెక్కివెక్కి ఏడిచింది.

"ఇక చాలు వూరుకో ఇదంతా నా కర్మ!" అని మరి మాట్లాడకుండా పక్కకు తిరిగిపోయాడు.

సుశీల భర్త అన్న మాటలకు ఆ రాత్రల్లా ఏడుస్తూనే గడిపింది కంటికి కునుకు లేకుండా.

సుశీల అనుకున్నట్టే అయింది, అక్క భారతి వెళ్ళిన దగ్గర్నుండి ఆమెను ఎంత నికృష్టంగా చూడాలో అంత నికృష్టంగా చూడడం మొదలెట్టేరు. కామాక్షమ్మ సమయంకోసం కాచుకు కూర్చున్నట్టుగా భారతిని వెళ్లనిచ్చి సుశీలమీద విరుచుకుపడింది.

"పీడ విరగడయిందనుకున్నాం. యిన్నాళ్లూ హాయిగా వుంది ప్రాణం. మళ్ళీ మొదలయింది కొంపలో అనర్థం!" అని సమయం దొరికినపుడల్లా దేనిమీదో పెట్టి అంటూవుండేది.

ఏమన్నా సుశీల మాటాడకుండా వూరుకొనేది. సుశీల వచ్చిన నాటికే పద్మకు చక్కటి ఆడపిల్ల కలగడం, మోహన్ వచ్చి ఆమెను మళ్లీ తీసుకుపోవడం అన్నీ జరిగిపోయినాయి.

పద్మతోనయినా తన బాధ చెప్పుకుందామంటే ఆమె కూడా లేదు. పద్మ వుంటే తనకు ఎన్నో విషయాలలో అండగా వుండేది. ఎంతో ధైర్యంగా వుండేది.

ఇక యిప్పుడు తన బాధ తనలో అణుచుకోవలసిందే గాని ఎవరూ లేరు చెప్పుకుందికి.

నాన్నకుగాని, అక్క భారతికిగాని ఉత్తరాలు రాయడం అనవసరం అని భావించింది. రాయాలని వున్నా రాయనివ్వరు కూడా. కవర్లెలా వస్తాయి? సమయం ఎక్కడ కుదుర్తుంది? రాసినా పోష్టుచేయగలగడం ఎట్లాగ? యింతకు పూర్వం అయిన గొడవ చాలదా? అంచేత ఆ ఆలోచన విరమించుకుంది.

తను తిరిగి వచ్చేసరికి బాబు ఎడం అయిపోయాడు. తనను వింతగా కొత్త మనిషిని చూసినట్టు చూస్తున్నాడు! తన దగ్గరకు రాకుండా వున్నాడు. వచ్చినా భయం భయంగా ఒక్క ఘడియ వుండి ఏడ్చి మాలతి దగ్గరకుగాని, కామాక్షమ్మ దగ్గరకు గాని వెళ్లిపోతున్నాడు!

ఏమిటీ విచిత్రం! ఒక్క ఏడాది తల్లి దూరంగా వున్నంత మాత్రంలో పోల్చుకోలేనంతగా మారిపోతారా?

పసిపాప మనసులకు ఏమిటి తెలుస్తుంది? యింకా ఏదీ మనసులో ముద్రపడకుండానే తను వదిలి వెళ్ళవలసి వచ్చింది. తనదే తప్పు!

అయినా ఎంత విచిత్రం! తల్లినే మరిచిపోయేట్టుగా వాళ్ళు ఎంత మరిపించారు! ఇంక ఎలా బతకడం? ఇన్నాళ్లూ మనసు ధైర్యం చేసుకుని అక్కడ వుండిపోయింది. బాబు లేడు కాబట్టి అలా వుండిపోగలిగిందేమో! గాని బాబును ప్రత్యక్షంగా చూస్తూ ఈ బాధ భరించడం ఏ తల్లి తరం?

సుశీలకు యింక ఆ ఇంట్లోవారిని ఎదురించేశక్తి పూర్తిగా పోయింది.

ఏమన్నా ఆమెను వెనకేసుకువచ్చేవారు లేరు. పిల్లలదగ్గర నుండి పెద్దలవరకూ కడకు భర్త కూడా తనకు సాయంచేసేవారు లేరు. తన మాట లెఖ్ఖ చేసేవారు లేరు.

అంచేత చూస్తూచూస్తూ బాబును మాలతి పరం చేసుకోవలసి వస్తోంది సుశీలకు.

ఎన్నిరోజులయినా కన్నకొడుకు తల్లిని

మరిచిపోవడం ఎక్కడా జరుగనిది. కాని ఆమె విషయంలో ఎక్కడా జరగనివి, ఎవరూ నమ్మలేనివి జరుగుతున్నాయి.

బాబుగాని యిక్కడ ఈ వాతావరణంలో పెరిగితే తనమీద ఈ మాత్రం ప్రేమ కూడా లేకుండా చేస్తారు. తల్లి అన్న గౌరవం కూడా లేకుండా చేస్తారు. ఎలా సహించగలదు?

బాబు పెద్దవాడై తల్లిగా తనను గౌరవించాలి, ప్రేమించాలి! తన కోరికే అది. ఆ తర్వాత ఏమయిపోయినా ఏ బాధా లేదు... తన బిడ్డకోసం బతకక తీరదు! వాడికోసం ఏమయినా చేయాలి. ముందు ఈ ఇంటిలోనుండి వెళ్లిపోవాలి! ఎక్కడికి!

ఎక్కడికో, నాన్నదగ్గిరకో, అక్కయ్య దగ్గరకో? ఎక్కడికో అక్కడికి. తర్వాత ఆలోచించుకోవచ్చు. మొదట యిక్కడనుండి బయటపడాలి.

ఆ మర్నాడే మెట్రిక్ రిజల్ట్సు వచ్చినట్టు కృష్ణారావు పేపరు తెచ్చి చెప్పేడు. బయటకు చెప్పకపోయినా అందరికీ లోలోన సుశీల పరీక్ష ఏమయిందో అన్న మానవసహజమయిన ఆతృత మాత్రం వున్నది.

కృష్ణారావు అడగగా సుశీల నెంబరు చెప్పింది. ఆమె పాస్ అయినట్టు అతను చూసి చెప్పేడు.

"విన్నారా! సుశీల మెట్రిక్ పాస్ అయిందట!" అని మాలతి అత్తగారితో అంది.

"అయిందీ యికనేం!" అని యీసడించింది కామాక్షమ్మ.

"ఇక ఉద్యోగం చేయడమే తరువాయి" అని హేళనగా అన్నాడు మాధవరావు.

అన్నిటికీ నిర్లిప్తంగా చిన్న నవ్వు నవ్వేసింది సుశీల.

ప్యాసయినందుకు ఏ సంతోషమూ ఆమెకు కలుగలేదు. ఒక ప్రయోజనాన్ని ఆశించి చదివింది. ఆ ప్రయోజనం పొందడానికి వీలులేకపోయిన తర్వాత యింక ప్యాసు అయితేనేం! కాకపోతేనేం! అని విరక్తితో అనుకుంది. అయినా తను అంత కష్టపడి చదివినందుకు ఫలితం దక్కిందని సంతోషించింది.

"ఎక్కడన్నా ఉద్యోగం చూడమన్నావా?" అని అడిగాడు మాధవరావు.

"నాకేమీ అభ్యంతరంలేదు. ప్రయోజనం లేని చదువు. చదివితేనేం? లేకపోతేనేం! పాస్ అయినా కాకపోయినా నాకు ఒకటే" అని సుశీల అంది.

"ప్రయోజనం లేకపోతే ఎందుకు చదివినట్టు?"

"అప్పుడు చదువు అవసరం అనిపించింది చదివేను. యిప్పుడు అక్కర్లేదనిపించింది-అంతే!"

"యిప్పుడు మాత్రం ఆ ప్రయోజనాన్ని పొందడానికేం!"

"అలా పొందే సమయం వచ్చినపుడు చూద్దాం లెండి!"

మాధవరావు, మిగతావాళ్లూ ఆమె జవాబులకు ఆశ్చర్యపోయారు. సుశీల యెప్పుడు ఏమన్నా వూరుకోలేదు. సహించినంతకాలం సహించి ఏదో ఒక జవాబు సంకోచంలేకుండా చెబుతూంది.

ఆ తర్వాత సుశీలకు బాగా ధైర్యం కలిగింది. ఇహమీదట బాబును తీసుకు వెళ్లిపోయినా తన కాళ్ళమీద తను నిలబడి తననూ బాబునూ ఏ చిన్న ఉద్యోగమయినా చేసి పోషించుకొనగలదు.

బాబు పెద్దవాడయేవరకూ ఎలాగో కాలక్షేపం చేస్తే చాలు. వాడు చేతికందేక హాయిగా వుండవచ్చు అని భావించింది.

ఇలా కొత్త ఆలోచనలతో మనసు కుదుటపరచుకొనే సమయంలో ఒకనాడు, మాలతి పిన్నీ, ఆమె కూతురు సరోజా వచ్చేరు!

వాళ్లంటే ఎందుకోగాని కామాక్షికి అభిమానం. అందువల్ల వారు తరచూ వచ్చిపోడానికి అవకాశం కలిగింది.

"మళ్ళీ ఒకసారి డాక్టరుకు చూపించి, పోదామని తీసుకువచ్చాను!" అంది ఆవిడ.

"దానికేముందేలే! ఏదో ఈ మిషమీదన్నా వస్తున్నారు మాయింటికి! లేకపోతే మీరు వస్తారా!" అంది కామాక్షమ్మ.

ఈసారి కూడా మాధవరావూ, సరోజా కలిసి తిరగడం మామూలుగా జరిగే పని లాగే అందరూ భావించారు. వాళ్ళు ఎక్కడికి వెళ్లినా, ఎంతసేపు తిరిగివచ్చినా ఎవరూ పట్టించుకోలేదు.

అందువల్ల సరోజా, మాధవరావూ మరీ దగ్గరగా తిరగడం, ఎప్పుడూ ఒకరితో ఒకరు వుండడం, హాస్యాలూ, పరాచికాలూ, గుసగుసలాడుకోవడం లావయింది.

చూసీ చూడనట్టు అందరూ వూరుకుంటున్నారు!

సుశీలకు యిదేమీ నచ్చలేదు. తన భర్త పరాయి పిల్లతో అలా తిరగడం, ఆమెకు వళ్ళు మండిపోతూవుంది. వారి ప్రవర్తన చూస్తూ వుంటే సహించలేకపోతున్నది.

తన ఎదుటనే యిలా పెళ్ళికాని పిల్లతో సరసాలూ కబుర్లూ ఆడుతూ వుంటే తనకు ఎంతో అవమానం అనిపిస్తోంది. కాని ఆ అమ్మాయి తల్లికి మాత్రం చీమకుట్టినట్టయినా వుండకపోడం ఆశ్చర్యం అనిపించింది.

మాధవరావు సుశీలను ఒక మనిషిక్రింద లెక్కకట్టలేదు. ఆమెను ఏమీ ఖాతరు చేయలేదు. మీదుమిక్కిలి ఎంతో ధైర్యంగా ఆమె చూడాలనే చేస్తున్నట్టు సరోజతో మెలగడం మొదలుపెట్టేడు.

హాస్పిటల్ మిషతో రోజుకు రెండుమార్లు బయటకు వెళుతూ వుండేవారు. సాయంత్రాలు వెళ్ళినవారు ఎనిమిది, తొమ్మిది అయితేగాని వచ్చేవారు కాదు.

డాక్టరు చూడడం ఆలశ్యం అయిందనో, బస్సు దొరకలేదనో యింకేదో కారణం చెబుతూ వుండేవారు.

అసలు మాధవరావు ఆఫీసుకు వెళుతున్నాడా? అని అనుమానమే. ఎప్పుడూ యింట్లోనే వుండేవాడు లేదా సరోజతో తిరుగుతూ వుండేవాడు.

సరోజను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళడాని కని మూడురోజులు సెలవు పెట్టేడని ఆ తర్వాత తెలిసింది.

ఒకనాడు ఉదయమే లేచి- పనులు పూర్తి చేసుకుని స్నానం చేసి, చీర మార్చుకుందికి గదిలోకి వస్తోంది.

ఓరగా వేసి వున్న తలుపుతీసి వెళ్లేసరికి ఎదురుగుండా చూసిన దృశ్యం, ఆమె మొదట నమ్మలేకపోయింది. ఒకసారి తల తిరిగి పడిపోతుందా అని అనిపించింది.

మాధవరావు కౌగిలిలో సరోజ! ఛీఛీ... ఆ దృశ్యం చూసి ఒక్క నిముషం నిశ్చేష్టురాలయింది. వెనక్కు వెళ్ళిపోదామని అనుకొనేసరికి సరోజ, సుశీలను చూసి గబగబా యివతలకు వచ్చేసింది!

మాధవరావు ఏమీ ఎరుగనట్టు బయటకు నడవబోతున్నాడు.

"ఇంతకన్నా నాకు ఏ విషమయినా యిచ్చి చంపేయండిగాని ఎందుకిలా బతికుండగా చిత్రహింస చేస్తారు!" అని నిలబెట్టి అడిగింది.

"నా యిష్టం! మరేమీ గోలచేయకు! ఆమెకిష్టమయింది. నాకూ యిష్టమయింది! అంతే. నువ్వు నోరుమూసుకు వెళ్ళు తెలిసిందా"

"ఛీ... ఛీ.. ఎంత బరితెగించారు! కట్టుకున్న పెళ్ళాం ఎదురుగానే పెళ్ళికాని మరో పిల్లతో ఎంత ఘోరం! యింతకన్నా వేరే అన్యాయం ఏమయినా వుందా... ఆడదాన్ని ఏమీ చేయలేనుకదా అని అలుసుచేసి మీ యిష్టం వచ్చినట్లు చేస్తున్నారు"

"చాలు చాలులే నాకూ నీకూ సంబంధం లేదని, ఏనాడో చెప్పేను! నీకిష్టమయితే ఈ యింట్లో వుండు, నాకు అడ్డురాకు! కట్టుకున్న పెళ్ళామట! సిగ్గులేకపోతే సరి! అందరి భార్యలూ యిలాగేనా వుండేది? ఒక్కనా

డైనా నవ్వుతూ వచ్చి నాతో మాటాడేవూ! నీ ఏడుపు ముఖం కోసం నా సుఖం పాడుచేసుకోలేను!"

"అయినా ఆ పిల్లకేం జ్ఞానం లేదూ? వుండండి, వాళ్ల అమ్మనే అడుగుతాను!"

"అలాటి వెధవ వేషాలేం వేయకు! అంత మట్టుకు వస్తే పెళ్ళి కూడా చేసుకుంటాను! నా యిష్టం!"

ఆ మాటలు కూడా విని సుశీల ఒణికిపోయింది.

"ఎంతకయినా మీరు తెగిస్తారు!... అట్లానే కానివ్వండి!"

మాధవరావు అక్కడనుండి కోపంతో వెళ్ళిపోయాడు.

సుశీలలో ఒక విధమయిన విరక్తి, బతుకుమీద నిరాశ జనించింది.

ఆమె ముందే తన భర్త యిలా అన్యాయంగా ప్రవర్తించడమూ సమర్థించుకోవడం చూస్తే ఆమెకు అసహ్యం వేసింది.

ఆ తర్వాత సరోజ, ఆమె తల్లి వెళ్ళిపోయారు రెండు రోజులలోనే. ఆ రెండు రోజులూ కూడా మాధవరావు, సరోజా ఎప్పటిలాగే విచ్చలవిడిగా తిరిగారు. సినీమాల్కకు కూడా వెళ్లేరు.

సరోజను నిలబెట్టి వాళ్ల అమ్మదగ్గిర అడుగుదామని అనుకున్నా భర్త మర్యాద గురించి ఆలోచించి ఏమీ అనలేకపోయింది! ఒకవేళ చెప్పినా ప్రయోజనం వుండదని కూడా సుశీలకు తెలుసు.

అందువల్ల లోలోనే బాధపడి సహించి వూరుకుంది.

ఆమెను ఎంత నికృష్టంగా చూసినా, బాబును వేరుచేసినా, ఆదరించకపోయినా సహించిందిగాని తన ముందే తన భర్త ఈ విధంగా ఆ సరోజతో కలిసి వుండడాన్ని సహించలేకపోయింది.

స్త్రీ తన సర్వస్వాన్నీ అర్పించగలదేమో గాని, తన భర్తని మరొక స్త్రీ లోబరుచుకోవడం సహించలేదేమో!

ఈ అవమానం భరించేకన్నా అక్కడ నుండి నిష్క్రమించడమే ఉత్తమం అని నిశ్చయించుకున్నది.

సమయంకోసం ఎదురుచూస్తున్న సుశీలకు ఓ రాత్రి ఆ వీలు చిక్కింది. ఆ రోజున బాబు తన దగ్గరే నిద్రపోతున్నాడు. అందరూ గాఢ నిద్రలో వున్నారు.

కిందటిమారు జరిగినట్టుగా కాకుండా మామగారితోసహా అందరూ పడుక్కున్నారో లేదో అని చూసి మరీ బయలుదేరింది.

మెల్లగా బాబుని ఎత్తుకుని యివతలకు వచ్చింది. కాని... ఆమె జాతకచక్రం ఎటువంటిదోగాని ఈసారి కూడా విఫలమే అయింది.

బాబు ఒక్కసారి తృళ్ళిపడి లేచి ఏడుపు లంకించుకున్నాడు. ఎంత ఊరుకోపెడదామన్నా గుక్కపెట్టి ఒకటే ఏడ్పు. ఆఖరికి బలవంతాన నోరు మూసినా ప్రయోజనం లేకపోయింది.

ఆ ఏడ్పుకి యింట్లో వాళ్లందరూ లేవడం ఎంతసేపు? వాళ్ళు లేవడం, యివతలకు పరిగెట్టిరావడం, ఈ దృశ్యం చూడడం అంతా ఒక్క తృటిలో జరిగిపోయింది.

ఈమారు మాధవరావు మరి అటూ ఇటూ చూడకుండా, సుశీలను బరబరా ఈడ్చుకువచ్చి కొట్టడం మొదలెట్టేడు. "ఎందుకు? ఏమిటి సంగతి?" అని కూడా అడగలేదు.

"పాముకి పాలుపోసినట్టయింది ఆఖరికి. ఎప్పటికయినా యిది మన కొంప తీస్తుంది! ఎంతకి తెగించింది?" అని కామాక్షమ్మ వచ్చి తనూ చేయి కలిపింది.

"చావు ముండా! నా ఖర్మకొద్దీ దొరికావు. నీకూ శాంతిలేదు. మాకా అంతకన్నా లేదు!" అంటూ మాధవరావు యింకా కొడుతూనే వున్నాడు.

"అయినా నీకేం పోయేకాలం వచ్చిం

దమ్మా! యిలా ఇల్లు విడిచి మాటిమాటికీ వెళ్లిపోతున్నావు? " అన్నాడు కాశీపతి.

"బాబు ఏడ్వకపోతే వాడూ మనకి దక్క కపోను!" అంది మాలతి!

సుశీల దేనికీ జవాబు చెప్పలేదు. ఏమీ అనలేదు! ఎన్ని దెబ్బలు కొట్టినా అలా గొడ్డులా శరీరం అప్పజెప్పి మౌనంగా వూరు కుంది. అన్ని దెబ్బలూ భరించింది.

ఆ దెబ్బలకు ఆఖరికి తట్టుకోలేక, మొహం తిరిగి అక్కడే వాలిపోయింది.

దానితో కామాక్షమ్మకు భయం పట్టు కుంది.

"ఇంక కొట్టకురా బాబూ! చాలు! ఇదో చిత్రక్షోభ, ఇదుగో కిట్టక చంపేశారు కోడల్ని నానా బాధలూ పెట్టి అని లోకనింద మన మీద పడుతుంది. యింక వూరుకో!" అని చేతులు పట్టుకు ఆపింది.

"చావనీ... ముండని! పదండి లోపలికి! దీన్ని యిక్కడే పడివుండనీ లోపలకు తీసు కురావద్దు" అని లేచేడు.

"ఎక్కడికయినా పోతుందేమో! అదీ మనకే కదా!"

"పోతే పోనీ పీడ వదులుతుంది"

అని అందరూ సుశీలను యివతలే వదిలి, బాబును తీసుకొని తలుపులు వేసు కొని లోపలకు వెళ్ళిపోయారు.

కొంతసేపటికి సుశీలకు తెలివివచ్చింది. వళ్లంతా పచ్చి పుండులా అయిపోయింది మాధవరావు కొట్టిన దెబ్బలకు. లేచి చూస్తే అంతా చీకటి- లోపలకు పోదామంటే తలుపులు వేసి వున్నాయి.

ఆమెకంతా అర్థమయింది. తన ఆఖరి ప్రయత్నం కూడా వ్యర్థమయింది. యింక ఆ యింట్లో తన పరిస్థితి దుర్భరం అని తెలుసు. ఇంత జరిగేక తనను ఆ యింట్లో వుంచుకుంటారనేది కల్ల బాబును మరి తన దగ్గరకు రానివ్వరు. యిది తప్పదు. ఛీ యిలా జీవించేకన్నా ఛస్తే నయం అందరికీ తన బాధ వదిలిపోతుంది.

వీధుల్లో నడిచి తిన్నగా ఆ దారి ఎక్కడికి తీసుకువెడితే అక్కడకు వెళ్ళిపోతూంది. ఎక్కడయినా నూయిగాని, చెరువుగాని కన బడుతుందేమోనని! గాని అది మహాపట్నం! అన్నీ యిళ్లూ, మేడలూ, చుట్టూ గోడలూ. అయినా అలా నడిచిపోతూనే వుంది... పిచ్చిదానిలా...

ఆఖరికి తెలతెలవారిపోయింది. పట్టణం మేలుకుంది. ఇళ్ల తలుపులు తెరుచుకు న్నాయి.

పనివాళ్లూ కొందరు యిల్లాళ్లూ ముంగిళ్ల కళ్లాపిజల్లి, ముగ్గులు పెడుతున్నారు. సుశీల అందర్నీ చూస్తూ ఎంత అదృష్టం? ఇల్లా లుగా, యిలాటి హాయి అనుభవించడానికి! అని అనుకుంటూ పోతూంది.

సైకిల్ రిక్షాలూ, మోటార్లూ అక్కడక్కడ బయలుదేరుతున్నాయి. కాఫీ హోటళ్లు వేడి వేడి తాజా పదార్థాలతో, ఆహ్వానిస్తున్నాయి.

పక్షులు కిలకిల లాడుతూ గూళ్లలోంచి బయటకు వస్తున్నాయి.

ఫ్యాక్టరీసైరను ఏడు కొట్టేసింది.

మేడల గోడల మీద, రోడ్లమీద బంగారు పూత పూసినట్టు సూర్యకాంతి పడుతోంది.

సుశీల యింకా నడుస్తూనే వుంది. ఒక గమ్యం అంటూ లేదు. కాళ్లు లాగేస్తు న్నాయి. ఒంట్లో నీరసం ఎక్కువయింది. ఆకలి దహించుకుపోతోంది. అయినా లెక్క చేయలేదు. ఏదో తీవ్రమయిన పట్టుదల మాత్రం ఎక్కువవుతోంది.

ఎక్కడా నూయిగాని, చెరువుగాని కనబడ కపోడంతో మనసు రైలు స్టేషన్‌వయిపు పోయింది...

పరుగెత్తే రైలు క్రింద...

ఒక్కక్షణం కళ్లు మూసుకుంటేచాలు, బాధలన్నీ పటాపంచలయిపోతాయి... అనుకున్నది.

ఒక ఇంటి గుమ్మంలో ఒక కుక్క పడుకొ నివుంది. నాలుగు పిల్లలు పొదుగు పట్టుకు

పాలు తాగుతున్నాయి. ఆ తల్లి కుక్క కళ్లు మూసుకు మైమరచి పడుకొనివుంది.

ఆ దృశ్యం చూసి సుశీల కొంతసేపు అలా వుండిపోయింది. తల్లి ప్రేమ సమస్త జీవాల్లోనూ ఒకలాగే వుంటుంది కదా అని అనుకుంది... తను ఎందుకు చావాలి? తన బాబు ఎప్పటికయినా తనకు కాకపో తాడా? బాబు కోసమయినా బతకాలి. ఛీ ఆత్మహత్య ఎంత నీచమయింది! అని తర్కించుకుంది.

కాని తనవాళ్లూ, భర్త, అత్తగారూ ఈ నరకం జ్ఞాపకానికి వచ్చి బతుకుమీద రోత పుట్టి గబగబా అడుగులు ముందుకు వేస్తోంది.

ఒక డాబా యిల్లు కనిపించింది. దాని ముందు ఒక కొళాయి వుంటే మొహం కడు క్కుని ఇన్ని నీళ్లు తాగి కొంగుతో మొహం తుడుచుకుంది. మళ్లీ బయలుదేరి వెళ్లబోతూంటే-

ఆ ఇంటి గుమ్మంలోనుండి చిన్న పిల్లాడు తప్పటడుగులు వేస్తూ వీధిలోకి వచ్చి మెట్లు దిగుతున్నాడు.

ఆ కుర్రవాడు అచ్చంగా తన బాబులాగే కనబడ్డాడు. ఇంచుమించు అదేవయసు, అదేలావు, అదే పొడవు, అదే వుంగరాల జుట్టు. సుశీలకు ఆ కుర్రవాడిని చూడగానే హృదయం ప్రేమతో నిండిపోయింది.

అట్లా చూస్తూ పరవశంతో వుండిపో యింది. ఇంతలో ఆ బాబు దిగుతూ దిగుతూ కాలు మెలికబడి మెట్లమీదనుంచి, దొర్లి పడిపోయాడు.

అది గమనిస్తూ సుశీల ఒక్క ఉదుటున పోయి ఆ పిల్లవానికి దెబ్బలు తగలకుండా పట్టుకొని ఎత్తుకుంది. వాడు భయపడి పోయి బిగ్గరగా ఏడ్వడం మొదలుపెట్టేడు.

ఆ బిడ్డ తల్లి పరుగెట్టి వచ్చింది కేకలు వేసింది. నలుగురూ చేరి సుశీలను పట్టుకు న్నారు. ఆ తల్లి సుశీల ఒడిలోని బిడ్డను లాక్కుని గుండెలకు హత్తుకుంది.

"ఎంత పనిచేశావ్! దొంగ ముండా! ఇంకా నయం! తెల్లారి లేచి ఎవరి మొహం చూశానో! బిడ్డ దక్కేడు. ఒక్క నిముషం చూసుకోకపోతే కొంప ములిగేది కదా!" అంటూ సుశీల జుట్టు పట్టుకుని కొట్టడం ప్రారంభించింది.

"పిల్లలిని ఎత్తుకుపోయేవాళ్లు తిరుగుతు న్నారు, జాగ్రత్త' అని నిన్ననే మా ఆయన చెప్పేరు!... నిజమే! ఇంకా ఏమో అనుకు న్నాను" అని అక్కడ చేరినవారిలో ఒకామె అంది.

"నీకేం పోయేకాలమే... నువ్వు బిడ్డను కనలేదూ! ఏం చేదామని తీసుకుపోతు న్నావు" అని ఒకామె నిలదీసి అడిగింది, బుగ్గలు పొడుస్తూ.

ఈ సంఘటనకు విస్తుపోయి నిలుచుండి పోయింది సుశీల. ఏం చేయడానికీ, ఏమన డానికీ తోచక అలా కళ్లూ, ఒళ్లూ అప్పగించి చూస్తూ నిలుచుంది.

"నువ్వు బిడ్డలను కనలేదూ" అన్న మాటకి ఆమెకు ఫకాలున నవ్వు వచ్చి నవ్వే సింది. లోలోపల గుండె తరుక్కుపోయి దుఃఖం వచ్చింది.

కాని పైవాళ్ళు అందరూ

"అయ్యో పిచ్చిదానిలా వుంది. ఆ చూపూ అదీ భయం వేస్తూంది" అంటే, ఇంకొందరు "ఆఁ... పిచ్చికాదు ఏమీకాదు. అదో వేషం పట్టుకున్నాంకదా అని ఏదో నాటకం. ఈ రోజుల్లో అదొకరకం వ్యాపారం అయిపో యింది. దొరకకపోతే పెద్దమనిషీ, దొరికి పోతే పిచ్చిదీ అని అనుకుంటారనీ ఈ వేషం. పట్టుకుని పోలీసులకు అప్పగిం చండి. ఇలా వదులుతే ఇంకా ఎంత మంది పిల్లలిని ఎత్తుకుపోతుందో" అన్నారు.

సుశీల బిత్తరచూపులతో నిలుచుంది.

అపుడు అర్థమయింది తను ఎలాంటి పని చేసిందో! తను ఆ బిడ్డను ఎత్తుకుపో వడం తనకు బాగానే అనిపించినా అది

ఎంత విపరీత పరిణామానికి దారితీసిందో. జీవితంమీదే విరక్తి పుట్టింది.

"నన్ను కొట్టండి... చంపండి. నన్ను వద లవద్దు..." అని ఏడుస్తూ తల పట్టుకుని అందరినీ బతిమాలింది.

"అయ్యో! పిచ్చిదానిలా వుంది. వదిలే యండి పాపం కొట్ట వద్దు. ఆమె ఏం చేస్తుందో ఆమె తెలుసుకునే స్థితిలోలేదు" అన్నారొకరు.

అదేమిటో చూద్దామని అటు వచ్చిన వ్యక్తి సుశీలను చూసి...

"అయ్యో, అయ్యో ఈవిడా?" అని అంటూ అందరినీ దూరంగా వుండమని చెబుతూ ఆమె దగ్గరకు వచ్చేడు.

సుశీల వింతగా అతనివయిపు చూసింది

"ఈమె మీకు తెలుసా?" అని అక్కడి వాళ్లలో ఒకరు అడిగారు.

"తెలియడం ఏమిటి? ఈమె మా స్నేహి తుడు మాధవరావు భార్య ఈమె ఇలా ఎందుకు చేసిందో తెలియడంలేదు"

"మాధవరావుగారా?"

"అవును మా ఆఫీసులోనే చేస్తున్నారు. ఒకసారి వారి ఇంటికి వెళితే చూశాను" అని అన్నాడు.

"అయ్యో పాపం! మతి చెడినట్టు వుంది లేకపోతే బంగారంలాంటి మనిషి ఇదేం అవస్థ?" అని అందరూ జాలిపడ్డారు.

"ఏమండీ ప్రొద్దున్నే యిలా ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగేడు ఆమెను.

సుశీల సిగ్గుతో తలవంచుకొని జవాబు చెప్పలేదు. ఆ తర్వాత ఎన్ని ప్రశ్నలు వేసినా మౌనంగా వూరుకున్నది అంతే.

ఇక లాభం లేదని- ఒక రిక్షాని పిలిచి సుశీలను అందులో కూర్చుండపెట్టి తను సైకిల్‌మీద మాధవరావు ఇంటికి తీసుకు వచ్చి దిగబెట్టేడు.

రిక్షా ఆగగానే కాశీపతి ఇవతలకు వచ్చి సుశీల దిగుతుండడం చూసి ఏమో అన బోయి ఆ పక్కన అతనిని చూసి గతుక్కు మని లోపలకు వెళ్లేడు.

సుశీల రిక్షాదిగి ఇంటిలోకి వస్తూండేసరికి కామాక్షమ్మ, మాధవరావు కూడా వచ్చారు.

సుశీల వెనకాల వున్న ఆ వ్యక్తిని చూసి "హల్లో! వెంకట్" అని పలకరించాడు.

ఆ ముక్క విని కామాక్షమ్మ...

"అమ్మ నాయినా భగవంతుడు రక్షిం చాడు. నీలోనే వున్నాడు నాయినా. ఎక్కడ కనిపించింది మా కోడలు! ఉదయం దగ్గి ర్నుండీ బెంగపెట్టుకు ఛస్తున్నాం. రాత్రి పడుకున్నదల్లా పొద్దున్న లేచేసరికి కనబడ లేదు. ఏమయిందో ఏమిటో అని బెంగపడి ఛస్తున్నాం. ఇప్పటివరకూ ఎవరికీ మన శ్శాంతి లేదనుకో. తలొకరూ తలొకవైపూ వెళ్ళి అన్నీ గాలిస్తున్నారు. పోనీలే నాయినా! నీ రుణం తీర్చుకోలేం" అని ప్లేటు ఫిరాయించి అభిమానం ఒలికిపోతు న్నట్టు అన్నది.

"ఎక్కడ కనిపించిందేమిటి?" అని మాధ వరావు అడిగాడు.

జరిగినదంతా చెప్పేడు వెంకట్రావు లోప లకు వస్తూ.

"అవును వెంకట్, ఈమధ్యే మతి చెలిం చింది. ఎంత జాగ్రత్త పడినా ఎలాగో తప్పించుకుని రాత్రి వెళ్లిపోయింది. ఇంతవ రకూ వెతికి వెతికి ఎంతకీ కనబడకపోతే ఇప్పుడే వచ్చేను. ఇంక వెళ్లి పోలీస్ రిపోర్టు ఇద్దామని అనుకుంటూండగా నువ్వు వచ్చావు"

"అదే నేనూ అనుకున్నాను మాధవ్! ఎన్నాళ్లయింది ఇలా. నువ్వీ సంగతి ఎప్పుడూ అనలేదే"

"ఏం చెప్పుకోమంటావులే. అంతా అయి ఒకనెల. ఇహ అదంతా అడక్కు" అని విచా రంగా అన్నాడు.

" అయామ్ వెరీసారీ మాధవ్, ఇహన యినా జాగ్రత్తగా చూసుకోండి నేవెళతాను" అని వెళ్ళిపోయాడు.

ఇంట్లో అందరూ అక్కడే వున్నారు. ఎవరు వెతకడానికి వెళ్ళేరో ఏమిటో ఆ వెంకట్రావ్‌కి అర్థం కాలేదు అయినా వాళ్ళ ఇంటి వ్యవహారాలు తనకెందుకని వెళ్ళిపోయాడు.

తలవంచుకుని నిలుచున్న సుశీలను కోపంతో లోపలకు నెట్టివేసేడు మాధవరావు.

"ఈ దెయ్యం మరి మనల్ని పట్టుకొని వదలదురా" అని అంది కామాక్షమ్మ.

"శని విరగడైందనుకున్నాను. మళ్ళీ తయారయింది. ఖర్మ! నలుగురిలోనూ నగుబాటు కూడాను. ఇంక మళ్ళీ బయటికి రానీకుండా కాళ్ళూ చేతులూ కట్టిపడేయండి. ఏదో వేళకింత తిండి పడేయండి, అంతే... మళ్ళీ ఇల్లు వదిలి బయటకు అడుగుపెట్టిందా ప్రాణాలతో బ్రతకనివ్వను. అంతే" అని కసిగా తిట్టడం మొదలెట్టాడు.

"ఇహనంతే చేయాలి. ఇంట్లో ఏదో అనుకుంటే రోడ్డుమీదకు కూడా మన పరువు ఈడ్చింది. పాడు మొహం!"

"ఇదుగో చూడు సుశీలా నీకే చెప్పేది. ఏది ఎలా జరిగినా ఇంట్లోనే చావాలి. అంతేగాని బయటకు వెళ్ళి నలుగురిలోనూ ఇలా అల్లరిపాలు చేశావా వూరుకొనేది లేదు" అని ఒకగదిలో ఆమెను పెట్టి బయట గొళ్ళెం వేసేరు.



ఆరోజునుండి సుశీలను ఆ గదిలోనే వుంచి తలుపులు వేస్తూవుండేవారు. వేళకు ఇంత తిండిపడేసి, కాలకృత్యాలకు మాత్రం బయటకు రానిచ్చేవారు.

వాళ్ళు ఏంచేసినా సుశీల పూర్వంలా జవాబు చెప్పడంగాని దేనికీ అడ్డు చెప్పడం గాని చేయలేదు. అన్నిటికీ మౌనమే. ఎవరితోనూ మాట్లాడడం మానివేసింది. బాబును కూడా అడగడం మానివేసింది.

కాశీపతికి అకస్మాత్తుగా జబ్బు చేసింది. ఉండి ఉండి కుడిచేయి, కుడికాలూ మొత్తం కుడిభాగం అంతా పడిపోయింది మరి కదలలేదు. పక్షవాతం చేసి మంచం పట్టేసేడు.

ఎన్నాళ్ళు ఎన్ని మందులిచ్చినా తగ్గలేదు. అతను ఎప్పుడూ కూర్చుండేచోటే మంచం పెర్మనెంటుగా వేసేశారు.

ఎలాగూ డాక్టరు వచ్చేడుకదా అని కృష్ణారావు, మాధవరావుతో చెప్పేడు "ఒరే మాధవ్, నీ భార్యని కూడా విడిచిపెట్టరాదూ? " అని.

"ఎందుకులెద్దూ" అనేసేడు మాధవరావు. అయినా కృష్ణారావు వూరుకోలేదు.

డాక్టరు వెళ్ళిపోతున్నప్పుడు కృష్ణారావు తీసుకువచ్చాడు. డాక్టరు వచ్చేసరికి లేచి నుంచుంది సుశీల.

అతడామెను పరీక్ష చేశాడు.

ఇవతలకు వచ్చి "ఆమెకు మనోవ్యాధి తప్పితే మరేమీలేదని, ఆ మనోవ్యాధి పోకపోతే మతిచలించ వచ్చుననీ" చెప్పేడు.

మంచం పట్టిన కాశీపతిని ఒకవైపూ, సుశీలను ఒకవైపూ చూసుకోవడం కష్టం అయింది.

ఏ ముహూర్తాన్న మంచాన పడ్డాడోగాని కాశీపతి మరి తేలుకోలేదు. అలా మంచం మీద పడుకుని చూస్తూ ఎవరో ఒకరు అన్ని పనులూ చేస్తూవుంటే రోజులు లెక్కపెడుతున్నాడు.

కామాక్షమ్మ చికాకూ, కోపం, విసుర్లూ భర్తమీద కూడా పడకపోలేదు.

"నేనొక్కర్తినీ దుక్కలా కనబడుతున్నాను. చిన్నా పెద్దా అందరికీ నానా చాకిరీ చేయడానికి" అని విసుక్కుంటూనే వుండేది.

రాను రానూ సుశీల వీళ్ల అశ్రద్ధవల్ల, మాటలవల్ల నిజంగానే పిచ్చిదానిలా తయారయింది. వెర్రిచూపులు చూస్తూ కూర్చోవడం బాబు కంటబడితే చాలు వాడికోసం అల్లరిపెట్టి ఏడ్వడం చేస్తుండేది.

మాధవరావుకు ఎవరు సలహా ఇచ్చేరో గాని ఒకనాడు సుశీలను సమీపించి మెల్లగా అనునయిస్తూ ఒక కాగితం ఇచ్చి తను చెప్పినట్టు రాయమన్నాడు.

సుశీల "ఏమిటి రాసేది? " అని అడిగింది.

"నేను చెప్తాగా ముందు రాయి" అన్నాడు

"సుశీల అమాయకంగా రాయడం మొదలెట్టింది. మాధవరావు అలా చెప్పడం మొదలెట్టాడు...

"నా భర్త మాధవరావు పునర్వివాహం నా అభిమతంతోనే చేసుకుంటున్నారు"

"నేను చచ్చినా రాయను. నా అభిమతం దేనికి? మీ ఇష్టమొచ్చినట్టు మీరు చేస్తున్నారుకదా చేయండి" అని అరిచింది.

"ఇదుగో సుశీలా మంచిగా చెబుతున్నాను. విను ఇక నీకూ నాకూ ఈ జన్మలో పడేదికాదు. నీ కోసమని నేను జీవితాన్ని పాడుచేసుకోను. మన కుటుంబ గౌరవం వీధిలో పడకుండా వుందా. నువ్వు ఈ ఇంట్లో వుండేందుకు నా అభ్యంతరం లేదు. అందువల్ల నువ్వీ పెళ్లికి ఒప్పుకో. లేదా నీకే మాత్రం చోటు కూడా ఈ ఇంట్లో వుండదు.

"మీ ఇష్టమొచ్చినట్టు ఊరేగండి, ఇష్టమొచ్చినన్ని పెళ్ళిళ్లు చేసుకోండి. నేను మాత్రం రాసేది లేదు"

"నీకిష్టమయినప్పుడు రాయడానికేం? "

"నా ఇష్టం నేను రాయను అంతే!

"నీకిష్టం లేకపోయినా రాయవలసిందే!"

"బలవంతంగా రాయిస్తారా? "

"మంచిగా వినకపోతే అంతే మరి!"

"రాయకపోతే ఏం చేస్తారు"

"ఏం చేస్తానా? " అంటూ మాధవరావు కోపంతో సుశీల జుత్తు పట్టుకొని కిందకు వంచి నడ్డిమీద గుద్దడం మొదలెట్టాడు.

ఇంతలో కామాక్షమ్మ కూడా వచ్చి

"ఊ రాయవే! వాడు చెబుతూ వుంటే అంత మొండితనం ఏమిటి? అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కుతినానివ్వదన్నట్టు. నీకా మొగుడూ కాపురం అక్కర్లేదు. వాడినయినా సుఖపడనీ... అదేమిటో నిక్షేపంలా ఆ సరోజ తల్లి అడగడానికి వస్తే ఈ ముష్టి వెధవ సంబంధం ఏదో లక్ష్మీదేవి వచ్చేస్తుందని చేశాం. అనుభవిస్తున్నాం" అని ప్రారంభించింది.

"ఊ... వ్రాయి... లేకపోతే ఇవాళ ఎలా రాయవో నేనూ చూస్తాను" అని మరి రెండు వేశాడు.

ఆ దెబ్బలకు నడుంకిందకు వంగిపోయి నుదురు నేలకు కొట్టుకున్నది. ఆ బాధ భరించలేకపోయింది సుశీల.

ఆఖరికి నిరాశ, నిస్పృహతో విరక్తి పుట్టి "చెప్పండి... మీ ఇష్టం వచ్చినట్టు రాస్తాను" అని ఏడుస్తూ అంది.

"అదీ, అలారా దారికి" అంటూ మాధవరావు మరో తెల్లకాగితం ఇచ్చేడు. సుశీల రాయడం మొదలెట్టింది. అతను ఈ విధంగా చెప్పాడు.

"నా భర్త మాధవరావు పునర్వివాహం నా అంగీకారంతోనే చేసుకుంటున్నారు. ఇందుకు నాకేవిధమయిన అభ్యంతరమూ లేదు. కొన్ని వ్యక్తిగత కారణాలవలన నేనే ఆయనను ఈ వివాహం చేసుకోవలసిందిగా కోరియున్నాను. ఈ వివాహం నా హృదయ పూర్వకంగా నా ఇష్టప్రకారమే జరుగుచున్నది"

ఇట్లు

సుశీల

ఈవిధంగా రాయించుకొని ఆ కాగితాన్ని మాధవరావు జాగ్రత్తగా అట్టేబెట్టుకున్నాడు.

ఆ తర్వాత ఇంట్లో అందరూ కొన్నాళ్లు తర్జన భర్జన చేసుకుని డాక్టరు దగ్గరికి అని

చెప్పి సుశీలను తీసుకువెళ్లి మెంటల్ హాస్పిటల్‌లో చేర్పించారు. డాక్టర్‌నుండి సుశీలకు మతిభ్రమించినట్టు ఒక సర్టిఫికేటు తీసుకున్నారు.

ఒక పెద్ద బరువు దింపుకున్నట్టు అందరూ తేలికపడ్డారు.

★ ★ ★

తండ్రి సంగతి తెలిసి వున్నది కాబట్టి తల్లి పోగానే భారతి తమ్ముళ్ల బాధ్యతా, సుశీల బాధ్యతా తీసుకుంది. తన దగ్గరే వున్నారు కాబట్టి తమ్ముళ్ళ విషయంలో ఆందోళన లేకపోయింది.

సుశీలను దిగబెట్టి వచ్చిన దగ్గర్నుండి, ఆమె క్షేమసమాచారం తెలియడంలేదు! ఆమె అక్కడ ఎలా వుందో, అత్తగారూ, భర్తా, బాగా చూస్తున్నారో లేదో, బాబును మళ్ళీ ఆమెకు యిచ్చేరో లేదో? ఏ బాధలూ లేకుండా వున్నదో లేదో? ఏమీ తెలియక ఆతృతపడసాగింది.

ఒకటి రెండుసార్లు భర్తచేత ఉత్తరాలు రాయించినా వాటికి జవాబు రాకపోయేసరికి, వీలుచూసుకొని ఒకసారి వెళ్లి చూసిరావడానికి నిశ్చయించుకున్నది భారతి. అలాంటి స్థితిలో ఒకనాడు అకస్మాత్తుగా కొండలరావు వచ్చేడు.

అనుకోకుండా వచ్చిన తండ్రిని చూసి ఆశ్చర్యపోయింది. మంచినీళ్ళు తెచ్చియిస్తూ, "అదేమిటి నాన్నా ఉత్తరం, ఏమీ లేకుండానే వచ్చేశారు" అంది.

కుర్చీలో కూర్చుని భారతి యిచ్చిన నీరు తాగి, "అవునమ్మా ఉన్నపళాన్నే యిలా రావలసి వచ్చింది! చూడు ఈ ఉత్తరం" అంటూ కవరు యిచ్చాడు.

అది మాధవరావు రాసినది. సుశీలకు మతి చలించినట్టు, డాక్టరు సలహామీద, ఆమెను పిచ్చాసుపత్రిలో చేర్పించినట్టూ వున్నది.

అంతే మరే విషయాలూ లేవు. అది చదివి భారతి నిలువునా నిశ్చేష్టురాలయిపోయి అలాగే కొంతసేపు వుండిపోయింది.

అంత మొండిగుండెకలవాడు కొండలరావూ కళ్ళంట నీళ్లు పెట్టుకున్నాడు.

"చూశావా అమ్మా ఆఖరికి దాని బతుకెలాగయిందో? .. అసలే మీ అమ్మపోయిందని ఒక మూల బాధపడుతూ వుంటే, యిప్పుడు యిది ఒకటి. నాకు మనశ్శాంతిలేకుండా పోతూంది. ఈ ఆఖరు రోజుల్లో!" అన్నాడు.

భారతి కూడా కళ్ళంట నీళ్ళు పెట్టుకుంది.

"బయల్దేరండి నాన్నగారూ! మనం వెళదాం, సుశీలకు ఎలా వుందో ఏమిటో అయినా పిచ్చాసుపత్రిలో చేర్పించవలసిన కర్మఏమిటి? ఆ డాక్టరుతో మాటాడి మన యింటికి తెచ్చుకుందాం, బంగారంలాటి పిల్లని వాళ్ళమధ్య పడేసి పాడుచేసుకున్నాం!"

"ఇంత అమానుషంగా తయారవుతారని అనుకున్నామా? "

"నిక్షేపంలా వున్నదాన్ని, పిల్లాడిని యివ్వక, సూటీపోటీ మాటలని మనసు పాడుచేశారు! పాపం ఆ ఆస్పత్రిలో ఎన్ని బాధలు పడుతున్నదో సరిగ్గా తిండీ, అదీ పెడతారో లేదో" అని వాపోయింది భారతి.

ఆ మర్నాడు యిద్దరూ ప్రయాణమయి సుశీల అత్తవారి వూరికి చేరుకున్నారు.

వీళ్లిద్దర్నీ చూసి కామాక్షమ్మ బుడిబుడిరాగాలు మొదలెట్టింది. "వచ్చారా అమ్మా, వచ్చారా బాబూ! చూడండి ఆఖరికి యిలాగయింది" అని.

భారతీ, కొండలరావూ మాటాడలేదు. రాగానే సావిట్లో కాశీపతి మంచందగ్గర నిలబడ్డారు.

"ఇలాగయింది మా అదృష్టం! యిప్పటికి ఆరునెలలయింది లేవలేదు... చేయి కాలూ కదపలేరు... అంతా చిన్నపిల్లాడిలా ఎవరో ఒకరు చేయవలసిందే" అని కామాక్షమ్మ కంట నీరు పెట్టుకుంది.

ఆ నటనా, ఆ దుఃఖం అందుకన్న మాట. కాశీపతికి జబ్బుచేసిందనే కాని తన కూతురు సుశీల గురించి కాదన్నమాట!

భారతికూడా అలాగే ఆశ్చర్యపోయింది! తామొకందుకు వస్తే ఆమె ఒకటి చెబుతూంది.

ఎట్లా వుందో సుశీల? హాస్పిటల్ ఎక్కడో చూపెడితే, చూద్దామని ఆతృతపడుతూ వుంటే- ఈ కాశీపతిని చూపుతున్నది.

ఎంతసేపువున్నా, ఎంతసేపు విన్నా, ఎంత సేపు చెప్పినా, అదేగోల సుశీల విషయం లేదు. కాటికి కాళ్ళుచాచుకుని వున్న కాశీపతి గురించేగాని బతుకంతా ముందే వున్న సుశీల గురించి ఆమెకు చీమ కుట్టినట్టన్నా లేదు.

ఆఖరికి వుండబట్టలేక.

"సుశీలను చూడాలి! హాస్పిటల్ ఎక్కడో ఏమిటో చెప్పండి!" అని అడిగారు.

దానికెవరూ జవాబు చెప్పలేదు.

"వేగిరం మేం అక్కడకు వెళ్ళాలి. మరి వెళ్ళివస్తాం!" అన్నాడు కొండలరావు.

"అయ్యో వుండండి కాఫీ తాగి వెళుదురు గాని, యింతలో మాధవరావు కూడా వస్తాడు, తీసుకువెళతాడు... మీకు దారి తెలియదన్నారుగా" అన్నది కామాక్షమ్మ.

"ఫరవాలేదు లెండి యిప్పుడు కాఫీకేమొచ్చె! మేం యిద్దరం వెళ్ళివస్తాం. అతడు వచ్చేసరికి ఎంత ఆలశ్యం అవుతుందో, ఎవరినయినా కనుక్కుని వెళతాం! అదే తెలుస్తుంది!"

ఆ మాటకు వాళ్ళేమీ అనకుండా వూరుకున్నారు.

తండ్రీ కూతుళ్లిద్దరూ బయలుదేరారు. ఆ నంబరు బస్సు కనుక్కుని ఎక్కేరు. వెళుతున్నప్పుడే పళ్లూ, మిఠాయి, చెల్లెలు కోసమని కొని పట్టుకుంది భారతి.

దూరంనుండి హాస్పిటల్ ఎంతో ప్రశాంతంగా కనబడుతూంది. ఎత్తయిన చెట్లూ, విశాలమయిన భవనం చాలా రమ్యంగా వున్నది. ఎప్పుడూ ఆహ్లాదకరమయిన చల్లటి గాలి వీస్తున్నది.

లోపల అక్కడక్కడ చిన్నచిన్న కేకలు, అరుపులూ వినిపిస్తున్నా పెద్ద గోలగాలేదు. స్త్రీలకు వేరు. పురుషులకు వేరు భాగాలు వున్నాయి.

భారతీ, కొండలరావూ బరువయిన హృదయంతో, స్త్రీల భాగం వయిపు వెళ్లారు.

అక్కడ పిచ్చెక్కిన స్త్రీల పరిస్థితి హృదయవిదారకంగా వుంది. సంస్కారంలేకుండా, జుత్తులు విరియబోసుకుని, వికారంగా వున్న వారిని చూస్తే వీళ్లకు దుఃఖం వచ్చింది. ఇటువంటి వాతావరణంలో సుశీలను వూహించుకుంటే వారి గుండెలు బద్దలయిపోతున్నాయి.

సుశీలను దూరంనుండే చూశారు. ఆమె గది కటకటాలు పట్టుకొని నిలుచుని ఏదో చూస్తూంది. మాసిపోయిన చీర, ముడివేసిన జుట్టు, నీరసంగా దైన్యంగా వున్న ఆమెను చూసేసరికి యిద్దరికీ పట్టరాని దుఃఖం వచ్చింది.

సుశీల యిద్దర్నీ చూసి కళ్లు పెద్దవిచేసి మరీమరీ చూసింది. అంతేగాని ఏమీ మాట్లాడలేదు!

అక్కడ అధికారులను అడిగి అనుమతి తీసుకుని, తలుపులు తీయించుకుని వెళ్ళేరు.

"అమ్మా! సుశీలా ఏం కర్మ వచ్చిందమ్మా తల్లీ!" అని భారతి ఆమెను పట్టుకొని ఏడుస్తూ అంది.

సుశీల వాళ్ళ వయిపు తీక్షణంగా చూసింది.

"నేనమ్మా! తల్లీ, మీ నాన్నను!" అన్నాడు కొండలరావు.

"పొండి! ఎందుకొచ్చారు యిక్కడికి? వెళ్ళండి నాదగ్గరకు రాకండి!" అని గట్టిగా అరిచింది సుశీల.

ఆ కేకలు విని తుళ్ళిపడ్డారు యిద్దరూ.

"అలా అనకమ్మా చూడు నాన్నగారూ నీకోసం వచ్చారు. అలా కూర్చో యివిగో యివి తిను" అంటూ ద్రాక్షపళ్లు చేతిలో పెట్టింది భారతి.

వాటిని విసిరికొడుతూ-

"నాకేమీ అక్కర్లేదు, ఎవరూ నాదగ్గరికి రానక్కర్లేదు" అని కోపంతో చిన్నపిల్లలు అలిగినట్లు అంది అటు వయిపు తిరిగి పోతూ.

"చూడు తల్లీ నీవు బాధపడడం మాకి ష్టమా? ఏదీ యిలా తిను" అంటూ నోటిలో పెట్టి తినిపించబోయింది.

"వద్దు... మీరు వెళ్ళండి యిక్కడ నుండి... నేను ఎవరికీ అక్కర్లేదు, నాకు యిక్కడే హాయిగా వుంది. మీ యింటికీ రాను, వాళ్లింటికీ రాను నేను మొదటే చెప్పేను కదా మరి రానని!"

"ఏదో చికాకులు వచ్చాయి పోతాయి. నీ సంసారం నువ్వు చేసుకు సుఖపడతావని అనుకున్నాం... కాని, యిలా అయిందని మేమెంత ఏడుస్తున్నామో... ఆ భగవంతు డికే తెలుసు!" అని అన్నాడు కొండలరావు.

"చూశారా, ఆఖరికి నన్ను వాళ్ళు ఎలా చేసి వదిలారో! ఎక్కడకు పంపేరో! నేను రాను మొర్రో అని ఎంత మొత్తుకున్నా మీరు బలవంతాన్ని పంపేరు, చివరికి నేను మీకూ, వాళ్లకీ, బాబుకూ ఎవరికీ కాకుండా, పిచ్చిదాన్ని అయేను!" అని అంది ఏడుస్తూ సుశీల.

"ఎలా వుందమ్మా యిక్కడ బాధలు పెట్టడం లేదుకదా!" అని అడిగింది భారతి.

"వాళ్లింట్లోకన్నా సుఖంగానే వుందిలే!... నేను యిక్కడే చచ్చిపోతాను!" అని చిన్నపి ల్లలా ఏడుస్తూ అంది.

"అలాగనకమ్మా డాక్టరుగారిని అడిగి... నిన్ను మనయింటికి తీసుకు వెళ్లిపోతాము"

"నేను రానంటేరాను, నాకిక్కడే బాగుంది మీరు వెళ్లండి!" అని మళ్లీ బిగ్గరగా అరి చింది. సుశీల కోపంతో వణికిపోతూంటే మరి ఏమీ అనలేదు భారతీ కొండలరావూ.

ఎలాగో బలవంతాన తెచ్చిన పళ్ళు తిని పించి భారతి మంచి మాట లాడుతూంది. ఆ లోపున కొండలరావు మెడికల్ ఆఫీసరు దగ్గరికి వెళ్లేడు.

సుశీలను డిశ్చార్జి చేయడానికి వీలవుతుం దేమోనని అడిగాడు డాక్టర్ని. కాని తీసుకువె ళ్ళినందువల్ల ప్రయోజనం లేకపోగా సుశీ లకు ఆ పిచ్చి పోయే అవకాశం మరి వుండ దని, అంతేగాక యింకా ఎక్కువయిపోవచ్చు నని చెప్పేడు.

అక్కడే వాళ్ళ ట్రీట్‌మెంట్‌లో వుంటే, కొద్ది కాలంలో మామూలు మనిషిగా అయే అవకాశం వున్నదని, అందుచేత అక్కడ వుంచడమే మంచిదని సలహా ఇచ్చాడు.

ఆమె తరహా సాత్వికమయినది కాదు. కొంచెం ఉద్రేకపూరితమయినది కావడంవల్ల ఎప్పుడే పని చేస్తుందో కాసుకోవడం, అదు పులో పెట్టడం కష్టమని, యింట్లోంచి వెళ్ళి పోవచ్చని, ఏమాత్రం ఏమరుపాటుగా వది లేసినా ఆమె ప్రాణానికే ముప్పు అని కూడా చెప్పేడు.

ఆ మాటలు విని కొండలరావుకు ఏం పాలుపోలేదు. తన పరిస్థితి చూస్తే ఒంట రివాడు. ఈమెను పెట్టుకొని ఎలా చూసు కోగలడు? ఈమెకు ఏం చాకిరీ చేయగ లడు? యింక వున్నది ఒక్క భారతి. ఆమె యింట్లో మాత్రం ఎలా వుంచడం సబబుగా వుంటుంది? అంచేత అన్నివిధాలా అక్కడ వుంచడమే మంచిదని కొంచెం నిమ్మళించేక తనే తీసుకువెళ్ళడం మంచిదని భావించి సుశీల వినకుండా, భారతితో కూడా ఈ విషయం ఆలోచించి అక్కడే సుశీలను వుంచడానికి నిశ్చయించుకున్నాడు.

సుశీలను కాస్త ప్రత్యేకంగా, జాగ్రత్తగా, శ్రమపెట్టకుండా చూడమని, ఒకవేళ ఏదైనా తప్పుచేసినా క్షమించి, బాధలుపెట్టకుండా, కొట్టకుండా చూడమని, అక్కడ కాపలా

వాళ్ళకూ, డాక్టరుగారికీ మరీమరీ చెప్పి వచ్చారు.

భారతికి కూడా తను వున్న అసహాయస్థితిలో అంతకన్నా గత్యంతరం కనబడలేదు.

వదలలేక వదలలేక, సుశీలను ఆవిధంగా విధిలేక అక్కడే వదిలి యిద్దరూ వచ్చేశారు.

సుశీల కూడా ఈ లోకంలోకి వచ్చి, తండ్రినీ, అక్కనూ పట్టుకుని ఏడ్చింది.

ఆ దృశ్యం హృదయాలను పిండి వేస్తుంది.

సుశీలను పిచ్చాసుపత్రిలో చేర్చిన విషయం, పద్మ మోహన్‌లకు కూడా తెలిసింది.

పద్మకు ఆశ్చర్యం కోపం వచ్చాయి. భర్తతో ఒక రోజల్లా వాదించింది. అత్తగారూ, మాలతీ, వీళ్ళవల్లే ఆమెకు మతి చలించిందని అందుకు కారణం బాబును, సుశీలకు దూరం చేయడమే అని కూడా చెప్పింది. మోహన్‌కు కూడా ఆ సంగతి తెలుసు.

వెంటనే యిద్దరూ సెలవు పెట్టి వెళ్ళి చూశారు సుశీలను. పద్మతో కూడా తాను ఎక్కడికీ వచ్చేదీ లేదని, తనకు అక్కడే బావున్నదని చెప్పింది.

సుశీల అప్పుడప్పుడు మామూలుగా మాట్లాడుతున్నా ఆమెకు స్థిమితంగా లేదని పద్మ, మోహన్ గ్రహించారు. వారు కూడా డాక్టర్‌ని కలుసుకుని, విషయం విని మరేం చేసేదీ లేక విచారించారు. కొంతసేపు ఆమెతో గడిపి వచ్చేసేరు.

★ ★ ★

రెండు మూడు నెలలు గడిచిపోయాయి. మాలతి పిన్నీ, ఆమె కూతురు మళ్ళీ "ఆసుపత్రి పని" మీద వచ్చారు.

ఒకటి రెండు రోజులు పోయాక సరోజ తల్లి తన ఉద్దేశ్యాన్ని చల్లగా బయటపెట్టింది.

భోజనాలవుతుండగా అందరి ముందూ మాధవరావును కదిలించింది "మళ్ళీ ఆసుపత్రికి వెళ్లేవా నాయనా? సుశీల ఎలావుంది? డాక్టరు ఏమన్నాడూ? " అని.

"ఆ చూశాను... మామూలు మనిషి అయే సూచనలు లేవన్నాడు" అని నిస్పృహతో నిట్టూర్చాడు.

"ఏమిటో నాయినా. కుర్రకుంకవు నీకెక్కడా శాంతి లేకుండా పోయింది. ఎన్నాళ్లిలా గడపాలో ఏమో!"

"గ్రహచారం తప్పుతుందా మరి! పెళ్లి చేసుకున్న దగ్గర్నుండి ఒక్కలాగే వుంది. అది యింట్లో వుండి ఎంత సుఖపడ్డానో యిప్పుడు లేకా అంతే సుఖపడుతున్నాను... అంచేత నాకేం విచారం లేదు!" అన్నాడు మాధవరావు.

"అదే- మీ అమ్మా నేనూ అనుకుంటున్నాం బాబూ! మొదట నీకు సరోజనే యిద్దాం అని అనుకున్నాం... కాని ఏమిటో అలా అయిపోయింది. ఘటన వుందనో ఏమో యింకా సరోజ అలానే వుండిపోయింది! నీవప్పుడే ఒక బిడ్డ తండ్రివయినా- నీవేమీ అనుకోకపోతే మళ్ళీ సరోజని చేసుకు సుఖపడకూడదా! ఆ సుశీలతో యిక నీ సంసారం చక్కబడుతుందన్న నమ్మకం లేదు"

"మీరు చెప్పినంత సుళువుగా తేలిపోయే సమస్యాయిది! నాకిష్టమయినా భార్య వుండగా మళ్ళీ పెళ్ళి చేసుకోడం అన్నది మాటలతో అయే పని కాదు!"

"ప్లీడర్ని ఎవరినయినా కనుక్కో నాయనా! భార్య వున్నా... ఆమె పిచ్చి తగ్గేది కాదని డాక్టరు సర్టిఫికెటు తెస్తే పనికి వస్తుందేమో... ప్రయత్నిస్తే ఏదో దారి వుంటుంది. ఆ సుశీల పిచ్చి తగ్గి వచ్చినా, దానితో నీవు సుఖపడలేవు! ఒకసారి అలాంటి జబ్బులు రాకనే పోవాలిగాని వచ్చి నంక తగ్గినట్టు కనిపించినా... పోవు! సరోజకి కూడా నువ్వంటే ఎంతో యిష్టం! అదీ నీకోసమే అన్నట్టు యిన్నాళ్లూ పెళ్ళికాకుండా

వుండిపోయింది"

"డాక్టరు మాత్రం యివ్వొద్దూ! తర్వాత వాళ్ళు కేసుపెడితే నానా బాధపడాలి. అప్పుడు ఈ మాత్రం మనశ్శాంతి కూడా వుండదు! యింక సరోజకు కూడా అన్యాయం చేసిన వాడినవుతాను!"

"అంతా నీ భయమే! లోకంలో ఎంత మందిలేరు! అంత మందీ దావాలు ఎక్కడ తేగలరు? మీ మామగారు అంత పాటి కూడానా? ఖర్చు అంటే ప్రాణం పోతుంది. అయినా ఆ పిచ్చాసుపత్రి డాక్టరుని పడితే సర్టిఫికేటు సంపాదించడం అంత కష్టం కాదు!" అని అంది మాలతి.

"సరే ఆలోచిద్దాం" అనేశాడు మాధవ రావు... ఆ తర్వాత అతని బుర్రలో అనేక ఆలోచనలు చెలరేగేయి.

సుశీలతో తన జీవితం సవ్యంగా, హాయిగా గడవడం అన్నది కల్ల! ఒక వేళ సుశీల మామూలు మనిషయి వచ్చినా, పూర్వం లాగే వుంటుందిగాని తనకు సుఖం వుండదు! అందువల్ల ఏదో విధంగా సరో జను పెళ్ళిచేసుకోవడం మంచిది. ఇదే తగు సమయం కూడాను. ఇహ డాక్టరు దగ్గర సర్టిఫికటు తేవడం అన్నది ఒక పెద్ద సమ స్యకాక పోవచ్చు

తన మనసులో వున్న ఈ విషయం తనుగా చెప్పకుండా వాళ్ళే అడిగినందుకు సంతోషించాడు. తన కోరిక నెరవేరడానికి యిదే మంచి అదునని ఆలోచించాడు. తర్వాత తన ప్రయత్నాలు తను చేయడం మొదలెట్టేడు.

★ ★ ★

సుశీలమీద ఎంత అయిష్టం, అసహ్యం వున్నా, మాధవరావుకు- బాబు అంటే మాత్రం అభిమానమే! బాబు కూడా మాధ వరావును చూస్తే వదిలేవాడు కాదు!

మాలతి, కృష్ణారావులకు ఇది కొంచెం యిబ్బంది కలిగించింది.

బాబుకు పూర్తిగా తమ యిద్దరిమీద గురి ఏర్పడడానికి సుశీల దగ్గరగాని, మాధవ రావు వద్దగాని, చనువు వుండకూడదు. అందులో ఒక అడ్డు సుశీల ఎలాగో వదిలి పోయింది. యింక మాధవరావునుండి కూడా ఎడం చేయాలి. అలా చేస్తే పూర్తిగా బాబు తమ వాడే కాగలడు.

ఎవరికీ అనుమానం కలగకుండా వుండ డానికి, బదిలీ ప్రయత్నం చేయమంది మాలతి. అక్కడనుండి ఎక్కడికయినా దూరంగా వెళ్ళిపోతే మరి బాబుకు, మాధ వరావుకూ కూడా సంబంధానికి అవకాశం వుండదు.

కృష్ణారావు అందుకోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఎప్పుడయితే తమకు పెళ్ళి చేస్తామని, అందరూ నిర్ణయానికి వచ్చేరో అప్పటినుండి సరోజా మాధవరావులకు హద్దులు లేకుండా పోయాయి.

అప్పటికప్పుడే పెళ్ళి అయిపోయిన దంప తుల్లాగే విచ్చలవిడిగా తిరగజొచ్చారు. వారి ప్రవర్తన చూసి వాళ్ళిద్దరికీ త్వరలో ముడిపె ట్టేయడమే మంచిదని అందరూ తొందరప డ్డారు.

ఇద్దరికీ ఒక శుభముహూర్తంలో వివాహం జరిగిపోయింది.

సుశీలకు మతి చలించినందువల్లే మాధవ రావు మరో పెళ్ళి చేసుకోక తప్పలేదని, బంధువర్గంలోనూ, స్నేహవర్గంలోనూ ప్రచారం చేశారు.

ఎవరికీ అభ్యంతరపెట్టే అవసరం, కారణం కూడా లేకపోయింది. యిద్దరి మధ్యా పెద్ద వ్యత్యాసం వయసులో లేకపో వడంవల్ల యిద్దరూ నవదంపతుల్లానే వున్నారు.

కొత్త భార్యతోపాటు, కొత్త ఉత్సాహం కూడా పొంగుకువచ్చింది మాధవరావులో.

మాధవరావు విజయకుమార్‌ను తాత్కాలి కంగానైనా మరచిపోవడం, మాలతీ కృష్ణారా

వులకు అమితానందం కలిగించింది. బాబుకు తల్లీ తండ్రీ అన్నీ మాలతే అయింది. ఇహ ఆమె వద్దనుండి బాబును అడిగి తీసుకొనేవారు లేకపోయారు.

సరోజ సమక్షంలోనే మాధవరావు ఎప్పుడూ వుండేవాడు. ఆఫీసుకు వెళ్లిన సమయంలో తప్పితే మిగతా సమయాల్లో ఇద్దరూ కలిసే వుండేవారు. అలాంటప్పుడు బాబు జ్ఞాపకం ఎందుకు వస్తాడు? తనకు ఒక కొడుకు వున్నాడా? అన్నట్టు వుండేవాడు.

పెళ్లి పదహారురోజుల పండగ దాటందే హఠాత్తుగా ఒకనాడు కాశీపతికి పక్షవాతం తిరగబెట్టి ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు.

భర్తని ఎంత లొంగదీసుకుని అధికారం చెలాయించినా, కాశీపతి కన్ను మూసేసరికి కామాక్షమ్మ కొండంత మనిషీ కుప్పలా కూలిపోయింది. భర్త పోయాడని రాత్రిపగలూ ఏడ్చింది. తన మాటంటే అతనికి ఎంత గురో, ఎన్నడూ తనమాట కాదని ఎట్లా ఎరగడో తలుచుకుంటూ కుమిలిపోయింది.

పద్మ, మోహన్‌లు, మాధవరావు, సరోజని మళ్ళీ పెళ్లాడాడనే కోపంతో పెళ్లికి రావడం మానుకున్నారు. కానీ తండ్రి చనిపోయాడని తెలిశాక రాకతప్పలేదు.

కర్మకాండ అంతా ముగిశాక మాధవరావును సూచావాచాగా చీవాట్లు పెట్టేడు కూడా. అయినా మాధవరావేం జవాబు చెప్పలేదు.

ఈ సంగతులన్నీ కొండలరావుకు తెలిశాయి. కానీ ఏం చేయగలడు? తన అల్లుడు మళ్ళీ పెళ్లి చేసుకుంటున్నాడని తెలిసి కోపం పట్టలేకపోయినాడు. ప్లీడరు దగ్గరకు వెళ్లి సలహా అడిగినా భార్య పిచ్చిదని తేలిపోయాక మళ్లీ పెళ్లి చేసుకున్నా ఏం చేయలేమని చెప్పి అయినా కేసు పెట్టండి వాదించి చూద్దాం" అన్నాడు.

ఆ మాటలు వట్టివని తెలుసుకుని కొండలరావు నిరాశ చేసుకుని వూరుకున్నాడు. తరువాత కాశీపతి చనిపోయాడన్న వార్త తెలిసినా వెళ్లి పరామర్శించడానికి మనస్కరించక వెళ్లలేదు.

వీలయినపుడల్లా ఆ వూరు వెళ్లి కూతుర్ని చూసుకువస్తున్నాడుగాని వాళ్ళ ఇంటికి మాత్రం పోలేదు.

ఇక్కడ సరోజకు ఆ ఇంటి పరిస్థితులూ, వారి మనస్తత్వాలూ క్షుణ్ణంగా తెలుసు.

సుశీలను కామాక్షమ్మ ఎన్ని బాధలు పెట్టేదో, కిమ్మనకుండా ఆమె ఎలా పడివుండేదో తెలుసు. కనుక జాగ్రత్తపడి ముందుగానే ఒంట్లో బావులేదని మంచం ఎక్కి పడుకోవడం మొదలెట్టింది. అయినా మాధవరావుతో షికార్లకూ, సినిమాలకూ ఆ అనారోగ్యం అడ్డువచ్చేది కాదు. పనిచేయవలసి వచ్చినప్పుడే తలనొప్పనో, పక్కలో నొప్పనో, జ్వరం అనో చెప్పి తప్పించుకొనేది.

కామాక్షమ్మ నోరు మూసుకుని వూరుకోక తప్పేదికాదు. లోలోనే కుళ్లిపోతున్నా నోరు పెగల్చడానికి కారణం దొరికేది కాదు.

సుశీల ఛస్తున్నా పట్టించుకోని మాధవరావు, సరోజ వంట్లో బాగాలేదంటే చాలు, సపర్యలుచేయడం, ఆఫీసుక్కూడా సెలవు పెట్టి ఎదురుగుండానే వుండడం, మందు కోసం పరుగెట్టడం, విశ్రాంతి తీసుకో అంటూ తనే ఆమె చెయ్యి పట్టుకు తీసుకెళ్లి పడుకోబెట్టడం, కదలబోకు సరూ! పనులకేం ఎవరో ఒకరుచేస్తారులే. విశ్రాంతి తీసుకోమన్నాడు డాక్టరు" అని అనేవాడు.

తేలుకుట్టిన దొంగలా వుంది కామాక్షమ్మ పరిస్థితి. అటు మాలతి బాబును తీసుకుపోయేది. ఇటు సరోజ మంచం ఎక్కేది. అందుచేత పని అంతా కామాక్షమ్మ మీద పడింది.

పైకి అనడానికా వీలులేదు. పూర్వంలా తనని ఎవరూ వెనకేసుకురావడానికి లేరు. త[illegible]త అంటే అంత అనే భర్త కాశీపతి

వుంటే పెద్ద అండలా వుండేది. పని చేయకపోతే వీలులేదు. ఆఖరికి ఆమె విసిగిపోయి ఎప్పుడయినా ఏదయినా చిన్నపని సరోజగాని చేయబోతే.

"నువ్వు పడుకోవే తల్లీ! ఈ ఒక్క పనీ చేస్తే అయిపోయిందా? నా పనులు నాకె లాగూ తప్పవు" అని రోషంతో అనేది.

అందులో వెటకారం గ్రహించి సరోజ!

"నేనేం దుక్కలా వుండి పనికి భయపడి చేయలేదనుకున్నారా! అందరూ ఎప్పుడూ ఒక్కలాగే వుండిపోరు. తనవరకూ వచ్చేవరకే తలనొప్పయినా తెలీదు. అయినా అదేం డాక్టర్లో! అదేం మందులో! పోతే ప్రాణం అయినా పోదు. ఈ జబ్బులయినా పోవు" అని అనేది.

ఇక ఏమన్నా లాభంలేదని గ్రహించి కామాక్షమ్మ వూరుకొనేది.

"సుశీల పాపం నోరు లేనిది. ఎంతపని చేసేది. దాన్ని నానాబాధలూ పెట్టాను. అందుకే కాబోలు నాకీ శిక్ష. ఇంత చాకిరీ నామీదే పడింది" అనుకొనేది కామాక్షమ్మ.

సరోజలాటి కోడలు వస్తేనేగాని సుశీల మంచితనం ఆమెకు తెలియలేదు.

కానీ పైకి అంటే పురువు తక్కువ, అనలేక చేయలేక లోలోపలే కోపాన్ని దిగమింగేది కామాక్షమ్మ.

కొన్నాళ్లకు మాలతి కృష్ణారావుల పథకం ఫలించింది. కృష్ణారావుకు ట్రాన్స్‌ఫర్ అయింది, ఆ వూరికి చాలా దూరంగా.

విజయకుమార్‌ను మరి ఆ వాతావరణంలో వుంచనవసరం లేదని మాలతి సంతోషించింది.

సుశీల ఆసుపత్రిలో పడివుంది. మాధవరావు సరోజ మోజులో బాబును మరిచేడు. అక్కడనుండి విజయకుమార్‌ను తీసుకువెళ్ళిపోవడానికి ఇదే మంచి సమయం.

అందుకు ఎవరూ అభ్యంతరపెట్టలేదు. మాధవరావుకు ఆ విచారమే లేదు. అంతేగాకుండా అలా తీసుకువెళ్లడమే తనకు రిలీఫ్ అని భావించేడు. సరోజతో హాయిగా గడపడానికి బాబు పానకంలో పుడకలా అడ్డురాడు. కానీ అలా చేస్తే ముందుముందు తనమీద అభిమానం తగ్గి బాబు మనసు మరొకపక్క తిరిగిపోతుందన్న విషయం గ్రహించలేకపోయాడు.

తనూ, సరోజ ఈ లోకంతో సంబంధం మరిచిపోయి సుశీలనుగాని, బాబునుగాని తలుచుకోకుండా మరచిపోదలచాడు.

అనుకున్నట్లే మాలతీ కృష్ణారావులు విజయకుమార్‌ను తీసుకుని వెళ్ళిపోయారు.

★ ★ ★

కాలం ఇట్టే జరిగిపోతోంది. వంట్లో బాగు లేదంటూ సాకులు చెప్పే సరోజకు "నాన్నా పులి" కథలా అయింది. ఆమెకు నిజంగానే ఆరోగ్యం పాడయింది. మొదటినుంచీ ఆమె ఆరోగ్యం అంతంత మాత్రంగానే వుండేది. రానురాను మరీ పాడయింది. ఎప్పుడూ ఆస్పత్రులూ, మందులూ, వీటితోనే మాధవరావు కాలం గడిచిపోయేది.

కామాక్షమ్మ ఏడుస్తూనే ఇంటిపనులు చేసేది. సరోజ కాఫీ తాగేసి గ్లాసు కడక్కుండా అక్కడే వుంచేసేది. ఏమనడానికీ ఒంట్లో బాగులేదన్న మిష ఒకటి ఆమెకు బాగా పనికి వచ్చింది.

ఈవిధంగా అయిదారేళ్లు గడిచిపోయినాయి.

సరోజకు ఇంకా పిల్లలు పుట్టకపోవడం మళ్ళీ కామాక్షమ్మ నోటికి పనిదొరికింది. ఆ సందు పెట్టుకొని జ్ఞాపకం వచ్చినప్పుడలా "పిల్లాలేదు- పీచూలేదు" అని దెప్పుతూ వుండేది.

సరోజ ఖాతరు చేయకపోయినా తనూ మనసులో బాధపడుతూ వుండేది. మాధవరావు మాత్రం ఎప్పుడూ విచారంగా వుండేవాడు. కొత్తలో ఒక ఏడాదిపాటు ఆనందంగా గడిపినా తర్వాత విసిగిపోయాడు.

సరోజకు పిల్లలు కలుగకపోవడం

మరింత విచారానికి కారణమయింది. 'బాబు' లేని లోపం ఇప్పుడు బాగా కనపడ జొచ్చింది.

ఒకనాడు తనే సరోజను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి స్పెషలిస్టులను సంప్రదించాడు.



ఆమెకు మొదటినుండీ వున్న గంటునొప్పి వల్ల, మిగతా అనారోగ్య కారణాలవల్ల మరి పిల్లలు కలగరని నిర్ధారణ చేశారు. ఆపరేషన్ కూడా పనికి రాదన్నారు.

మనసులో అదే అనుకుంది. కాని పైకి ఎవరితో చెప్పుకోగలదు?

మాలతీ, కృష్ణారావులిద్దరూ బాబును ముద్దుగా పెంచుకుంటున్నారు.

అన్నాళ్లూ కూడా విజయకుమార్‌కు సుశీలా, మాధవరావులు తన తల్లిదండ్రులని తెలియనివ్వకుండా "చిన్నాన్న- పిన్ని" అని చెబుతూవచ్చారు.



నిరాశతో ఇద్దరూ తిరిగి వచ్చేశారు.

బాబును సుశీలకు కాకుండా చేసిన పాపమే, సరోజకు శాపమై వుంటుందని, ఆమె ఉసురు తగిలివుంటుందని మాధవరావుకు స్ఫురించింది. కామాక్షమ్మ కూడా

ఆ ప్రాంతాలలో ఆ విషయం తెలిసినవా ళ్లెవరూ లేకపోవడంచేత నిజం తెలియడానికి అవకాశం లేకపోయింది. అతనికి అసలు విషయం ఎక్కడ తెలిసిపోతుందో అన్న భయంతో వాళ్లు మాధవరావు దగ్గరికి వెళ్ళ డమే మానుకున్నారు.

అసలు విషయం తెలియనీయవద్దని కృష్ణారావు తమ్ముడికి పదేపదే రాస్తూండే వాడు. "ఎలాగూ ఇన్నాళ్లయిపోయింది. బాబు పూర్తిగా మమ్మల్నే తల్లీదండ్రీ అని నమ్ముతున్నాడు. నిజం తెలిస్తే ఎలాంటి మార్పులు వస్తాయో? అందువల్ల ఈ రహస్యం ఇలాగే వుండనిమ్మ"ని ప్రాధేయప డుతూ రాసేవాడు.

ఆ ఉత్తరాలు చదువుకుని మాధవురావు కళ్లంట నీళ్లు పెట్టుకొనేవాడు. కలిగిన ఒక్క కొడుకునీ అన్నా వదినలకు ఇచ్చివేశాడు. ఒక్కమారయినా "నాయనా" అని పిలిచి బాబును చేరదీయలేదు- పోనీ తల్లి ప్రేమ అయినా తెలుస్తుందేమో అనుకుంటే సుశీల ఎంత ఏడ్చి మొత్తుకున్నా ఆమె దగ్గర వుండ నివ్వలేదు. అంత కర్కోటకుడయ్యేడు.

ఇహ బాబుకు తనమీద ప్రేమాభిమా నాలు ఎలా వుంటాయి? తను తండ్రి అంటే నమ్ముతాడా? అన్నగారు చెప్పినట్టే ఎన్నాళ్లయ్యే! నేను నీ తండ్రిని అని చెబితే నమ్మకపోవచ్చును. ఒకవేళ నమ్మినా జ్ఞానం వచ్చిన కొడుకు ఏమంటాడో?

"ఇంతవరకూ నేనంటే అక్కరలేని నువ్వు నా తండ్రివా? అయితే ఇప్పుడు అలాంటి తండ్రి నాకవసరంలేదు. అంతకన్నా ప్రాణా నికి ప్రాణంగా పెంచినవాళ్లే నా తల్లీ తండ్రీ' అంటాడేమో.

అయినా పుత్రవాత్సల్యం పెల్లుబికి వస్తే ఒక్కోప్పుడు తను వెళ్ళి బాబుతో, "నువ్వు నా కొడుకువి" అని చెప్పేద్దామా? అనుకు న్నంత ఉద్రేకం వస్తుంది. కాని మళ్ళీ రాబోయే పరిణామాలు ఆలోచించి తన ప్రవర్తనకు సిగ్గుపడి వూరుకుంటాడు.

"నా తల్లి ఎవరు? ఎక్కడ వున్నది? ఎందుకు ఇలా జరిగింది? " అన్న ప్రశ్నలకు తను ఏం సమాధానం చెప్పగలడు?

అందువల్ల తనలోతానే బాధపడుతూ, విచారం అంతా దిగమింగి వూరుకున్నాడు. ఆ ఆలోచనల్లో తరచూ సుశీల జ్ఞాపకానికి వచ్చేది. మరి వుండబట్టలేక ఒకటి రెండు సార్లు హాస్పిటల్‌కు వెళ్లి సుశీలను దూరం నుండి చూసేవాడు. ఎదురుగుండా వెళ్ళి మాట్లాడే ధైర్యంలేదు. ఆమె స్థితికి తనే కారణం అనే సత్యాన్ని మింగలేక సిగ్గుతో తలవంచుకొనేవాడు. ఆ పరిస్థితిలో అంత కన్నా ఏం చేయలేకపోయాడు.

తనను చూడడానికి వచ్చిన తండ్రిని చూసి సుశీల జాలిగా ఏడవడం మొదలె ట్టింది. ఆమె జుత్తు నెరిసిపోయింది. కళ్ల కింద నల్లని ఛాయలు వచ్చేయి. ఆమెలో మార్పు, ఆమె దీనస్థితి చూసి కొండలరావు గుండె బెదిరిపోయింది. ఇలా ఈ ఆస్పత్రి లోనే తన కన్నకూతురు ముసలిదయి, ఏ సుఖం లేకుండా మగ్గిపోతుందని బాధతో తను కూడా కృంగిపోయి ఏడిచాడు.

అతనితో ఇంటికి వచ్చేస్తానని సుశీల ఒకటే ఏడుపు ఇంతకు పూర్వం ఒకటి రెండుసార్లు అనేసి వూరుకొనేది. కాని ఇప్పు డేమో ఆమె మరి అక్కడ వుండలేనని ఒకటే పట్టుదల. కొండలరావు కూడా ఆశ్చర్యపో యాడు. ఆమె పూర్తిగా మామూలు మనిషి లాగా వున్నది. ఏ విధమయిన పిచ్చిచేష్టలూ లేవు.

"అలాగేనమ్మా అంతకన్నా కావలసిందే మిటి? డాక్టరుగారితో చెప్పివస్తాను. అలాగే వచ్చేద్దూగాని "అని ఓదార్చి డాక్టరు దగ్గరికి వెళ్ళి కలుసుకున్నాడు.

ఈయన అడగకముందే ఆ డాక్టరు సుశీల ఇప్పుడు మామూలు మనిషి అయిందని, ఆమెను ఇంటికి తీసుకుపోవచ్చుని, ఇంటివద్ద

మాత్రం ఎక్కువగా విశ్రాంతి అవసరం అని. ఉద్రేకపరచే విషయాలేవీ జరగకూడదని. చిన్నపిల్లలకి సాధ్యమయినంతవరకూ దూరంగా వుంచండి" అంటూ చెప్పాడు.

ఆ మాటలు విని ఆనందంతో ఆ సంగతి సుశీలకు చెప్పాడు. సుశీల సంతోషం చెప్ప నలవి కాదు. తలదువ్వుకొని బొట్టుపెట్టు కొని, డాక్టరుగారికి నమస్కారం చేసి బయ లుదేరింది.

డిశ్చార్జి సర్టిఫికెట్ తీసుకుని సుశీలతో సహా ఇంటికి వచ్చేశాడు కొండలరావు.

ఆ ఊర్లోనే వున్న భర్తనుగాని, అత్తవారిని గాని చూడడానికి నిరాకరించింది సుశీల. తిన్నగా తండ్రితో తన పుట్టింటికి వచ్చే సింది.

తమ్ముళ్ళిద్దరూ అప్పటికే చాలా పెద్ద వాళ్ళయిపోయారు. పెద్ద తమ్ముడు ఆ వూర్లోనే టీచరుగా పనిచేస్తున్నాడు. చిన్న వాడు ఇంకా చదువుతున్నాడు.

అక్కని పోల్చుకుందికి వాళ్ళిద్దరికీ కొంత సేపు పట్టింది. వాళ్ళని చూసి దుఃఖం ఆపు కోలేకపోయింది సుశీల.

వాళ్లను చూశాక తన కొడుకు గుర్తుకి వచ్చేడు.

"వూరుకో అమ్మా... ఏడవకు" అని ఓదా ర్చేడు కొండలరావు.

"బాబు జ్ఞాపకం వచ్చి..." అంది సుశీల.

"వాడిని ఒకసారి చూస్తే బావుణ్ణు" అని అంది.

"అయ్యో తల్లీ! వాడు నీ భర్త దగ్గర వున్నాడనుకున్నావా? వాడిని మాలతి తీసు కుపోయి పెంచుకుంటోంది. వాళ్లెప్పుడో దూరంగా బదిలీ చేయించుకు వెళ్లిపోయా రట" అని చెప్పాడు.

ఆమె ఆ మాట విని నమ్మలేక అలా వుండిపోయింది. ముఖంనిండా చెమటలు పట్టేశాయి. అలాగే సొమ్మసిల్లిపోయింది. కొండలరావూ, కొడుకులూ గాభరాతో ఆమెను మంచంమీద పడుకోబెట్టి ముఖం మీద నీళ్లుజల్లేరు.

అప్పుడు కొండలరావుకు జ్ఞాపకం వచ్చింది.. ఉద్రేకపరచవద్దని డాక్టరు చెప్పిన మాటలు! తను నోరుజారి అన్న మాటలకు విచారించేడు. మరెన్నడూ అలాటి మాటలు ఆమె దగ్గర అనవద్దని కొడుకులకు హెచ్చరించాడు.

తర్వాత తాపీగా ఆమెకు తెలివి వచ్చింది. క్రమంగా ఆ షాక్‌నుండి తేరుకుంది. ఆ తర్వాత క్రమేణా పరిస్థితులన్నీ తెలుసు కుంది.

అన్నిటికన్నా తన భర్త ఆ సరోజని మళ్ళీ పెళ్లి చేసుకొన్నాడని విని విరక్తితో ఒక్క నిట్టూర్పు విడిచింది.

"నేను అనుకుంటూనే వున్నాను. నన్ను పిచ్చాసుపత్రికి పంపించింది అందుకే" అంది.

"ఇప్పుడేమయిందమ్మా... ఇన్నాళ్లూ నీ వంట్లో బావులేదని వూరుకున్నాను. ఇవాళే ప్లీడర్ని కలుసుకుని నోటీసు ఇప్పించి కేసు పెడతాను. నువ్విప్పుడు నిక్షేపంగా వున్నావు కదా!"

"వద్దు నాన్నగారూ! అతడు ఏరికోరి చేసు కున్నాక మనం కేసు పెట్టి గెలుచుకుంటే మాత్రం ఏం ప్రయోజనం? మొదట్లో నన్ను బాగా చూసుకున్నారు కనుకనా? ఇప్పుడు వెడితే మాత్రం ఏం సుఖం? మరింత నర కబాధ పెడతారు. ఇహనుండి ఆ సరోజ కూడా నానుండి బాధపడాలి. అంచేత వద్దు నాన్నగారూ! ఎవరి మానాన్న వారిని వుండ నీండి"

"నిన్ను సరిగ్గా చూడనీ మాననీ, కనీసం నీకు మనోవర్తి అయినా దొరుకుతుంది. అక్కడికి వాళ్ళ రోగం కూడా కుదురుతుంది'
'

"ఇప్పుడు మనకేం తక్కువ నాన్నగారూ! మీ దగ్గర వుండి మిమ్మల్నీ, తమ్ముళ్లనీ చూసుకుంటూ గడిపేస్తాను. అమ్మ లేనే

లేదు. ఆడదిక్కు వుండకపోతే ఈ సమయంలో మీరూ, తమ్ముళ్లూ చూడండి ఎలా గయిపోయారో!" అని అంది.

"ఆ సరోజకు పిల్లలు కలగలేదట. మనం కేసు పెట్టినా పెట్టకపోయినా ఆస్తి బాబుకి చెందక తప్పదులే"

"అలాగయినప్పుడు మనం ఎందుకు కేసు పెట్టడం? ఇప్పుడు నేను వెళ్ళినా వెళ్లకపోయినా ఒకటే. వాళ్ళ కర్మానికి వాళ్లనే పోనివ్వండి. నాకింక బతుకుమీద ఏ తీపీ లేదు. నేను మాత్రం మరి వెళ్ళేది లేదు" అని నిక్కచ్చిగా చెప్పేసింది.

"ఏమోనమ్మా నీ ఇష్టం" అని వూరుకున్నాడు కొండలరావు.

తమ్ముళ్లకీ, తండ్రికీ చేస్తూ కాలక్షేపం చేస్తోంది సుశీల.

చెల్లెలు హాస్పిటల్‌నుండి వచ్చిందని తెలిసి అక్క భారతి భర్త, పిల్లలతోసహా చూడ్డానికి వచ్చింది. అక్కను చూసి ఏడ్వసాగింది సుశీల.

భారతి కూడా కళ్లంట నీళ్లు పెట్టుకుంటూ ఓదార్చింది. మాటల సందర్భంలో మళ్లీ అత్తవారింటికి ఎప్పుడు వెళతావు?" అని అడిగింది.

సంగతంతా చెప్పి సుశీల మరి వెళ్లేదిలేదని చెప్పేసింది.

ఆమె మనసు మరి మారదని గ్రహించి మరెవరూ ఆ ప్రసక్తి తేవడం మానివేశారు. అదీకాక ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవన్న సంగతి తెలిసి వూరుకున్నారు.

రెండు మూడు రోజులుండి భారతి వెళ్ళిపోయింది.

★ ★ ★

విజయ్‌కుమార్ మెడిసిన్ పాసయి హౌస్ సర్జన్ కూడా పూర్తిచేశాడు. తోటివాళ్లు, కొందరు ప్రొఫెసర్లూ కలిసి హైదరాబాదు టూర్ వేసుకున్నారు.

అప్పుడప్పుడు మాటల్లో మోహన్ చిన్నాన్న, పద్మ పిన్నీ హైదరాబాదులో వున్నారని ఇంట్లో అనుకుంటూండడంవల్ల తను అక్కడికి వెళ్ళినప్పుడు వాళ్ళింటికి వెళతానని చెప్పేడు.

అసలు నిజం వాళ్లెప్పుడు బయటపెడతారోనని మాలతీ, కృష్ణారావులిద్దరూ అనుమానపడకపోలేదు. అయినా వద్దని ఎలా చెప్పగలరు?

"అలాగే వెళ్లిరా నాయనా" అనక తప్పలేదు.

హైదరాబాద్ వెళ్లినప్పుడు మోహన్ ఇంటికి వెళ్లేడు. మొదట్లో వాళ్ళిద్దరూ పోల్చుకోలేకపోయినా, తర్వాత తెలుసుకొని ఆనందించారు.

విజయకుమార్ బృందం అక్కడ వారంరోజులున్నారు. ప్రొఫెసర్‌తో చెప్పి ఆ ప్రోగ్రామ్‌లకు వెళుతూనే చిన్నాన్నగారి ఇంట్లో మిగతా వేళల్లో వుండేవాడు.

తను సుశీల మాధవరావుల కొడుకని ఇంకా విజయకుమార్‌కు తెలియదని అతని మాటలవల్ల పద్మ, మోహన్లిద్దరూ గ్రహించారు.

ఆ అమాయకుడిని ఇన్నాళ్లు ఎలా మభ్యపెట్టారా అని ఆశ్చర్యపోయారు.

ఇప్పుడు విజయకుమార్‌కు నిజం చెప్పడమా? మానడమా? అన్న సమస్య వారికి ఎదురయింది.

అనవసరంగా, అన్యాయంగా ఒకరి సొత్తును మరొకరు ఉపయోగించుకొని, ఫలితం పొందడం సహించరానిదని భావించేరు.

సుశీల పరిస్థితి, ఆమెకు చేసిన అన్యాయాన్ని పద్మ ఎన్నడూ సహించలేకపోయింది. అయినా అందుకు ప్రతీకారంగా ఏమీ చేయలేకపోయింది. సరికదా అత్తగారికీ వాళ్లకీ తగిన బుద్ధి చెప్పాలనుకున్నా సాధ్యపడింది కాదు.

ఎంతమంది వున్నా ఒక తోటి ఆడదాన్ని కనీసం మామూలుగానయినా బతికే అవ

కాశం కూడా లేకుండా చేశారు. సుశీలను వెనకేసుకురావడానికి ఎవరికీ ధైర్యంగాని, కాలంగాని కలిసిరాలేదు.

విజయకుమార్ ఆ మర్నాడు వెళ్ళిపోతాడనగా పద్మ మెల్లిగా అసలు విషయం కదిపింది, "బాబూ మీ నాయినమ్మగారింటికి వెళ్లేవా? " అని.

"లేదు పిన్నీ! ఎప్పుడు వెళతానన్నా నాన్నగారూ, అమ్మా వద్దంటారు! ఎందుకు వాళ్ల మనసు కష్టపెట్టడం అని నేనే మానుకుంటాను!"

"మీ అమ్మ సుశీలను చూడడానికి వెళ్ళలేదా? ఆమెకు స్థిమితం లేదు కదా!"

"మా అమ్మా? .. ఓహో... సుశీల పిన్నిని కదూ నువ్వు చెప్పేది? "

"ఎవరు చెప్పేరు అలాగని? "

"మా అమ్మే! ఆవిడకు మతిచెలించి హాస్పిటల్‌లో వుందట కదా! చిన్నాన్నగారు మళ్ళీ పెళ్లిచేసుకున్నారట కదూ!"

"బాబూ ఒక్క విషయం చెబుతాను వింటావూ? "

"ఏమిటది పిన్నీ!"

"ఆ సుశీల ఎవరో నీకు నిజంగా తెలీదా? "

"అదేమిటలా అంటున్నావు పిన్నీ!"

"ఆవిడకు ఎందువల్ల మతిచెలించిందో తెలుసా? తన కన్నబిడ్డ వుండి కూడా చూసుకోలేక, తను వుండీ కూడా కన్నకొడుకుకు తను తల్లి అని తెలియక పోవడంచేత! అందులో ఆశ్చర్యం ఏముంది చెప్పు!"

"ఇది నిజమా పిన్నీ... అయితే ఆ పిల్లాడు ఎక్కడున్నాడు? ఎందుకలా తల్లీ బిడ్డా విడిపోవలసి వచ్చింది? ..."

"నిజం చెబుతే నమ్మవేమో! బాబూ!"

"లేదు పిన్నీ... యిదేదో వింతగా వుంది, తెలుసుకోవాలని ఆతృతగా వుంది. నువ్వేది చెప్పినా నమ్ముతాను! అసలు నాతో అబద్ధం ఆడాల్సిన పనేముంది నీకు? ... చెప్పు!"

"సుశీల కన్నకొడుకువి నీవే బాబూ!"

ఆ మాటలు విని నిశ్చేష్టుడయిపోయాడు విజయకుమార్. అక్కడ వుండి అన్నీ వింటున్న వనజ కూడా విభ్రాంతి చెందింది.

"నువ్వు... చెప్పినవి... నిజమా... పిన్నీ" అని గద్గదికంగా అన్నాడు... ఏమీ అర్థంగాక.

ఆ తర్వాత పద్మ చెప్పినదంతా విని విజయకుమార్ నిశ్చేష్టుడయాడు.

"ఏమీ తెలియనట్టు అమాయకంగా వుండే పెద్దనాన్న, దొడ్డ లోలోపల ఎంత కుట్రపన్నారు! యీ మనుషులు, స్నేహితులయినా, ఆత్మీయులయినా, బంధువులయినా ఎవరయినా స్వార్థం కోసం ఎంత పని అయినా చేస్తారు!" అనుకున్నాడు. వనజకి యిదంతా ఏదో కథలా అనిపించింది. తమ్ముడు ఏడుస్తుంటే ఎత్తుకుని అవతలకు తీసుకువెళ్ళింది.

"ఇన్నాళ్లు నాకు తెలియకుండా ఎలా జరిగిందో... నాకే ఆశ్చర్యంగా వుంది. నే నమ్మలేకపోతున్నాను" అని అన్నాడు పద్మతో.

"అదే విచిత్రంగా వుంది బాబూ! మాట వరసకయినా ఆ మాటలు రాలేదా? "

"లేదు పిన్నీ! అసలు నేను వింటూండగా ఎవరి వూసులూ ఎత్తేవారు కాదు. అందులోనూ మా అమ్మా, నాన్నల విషయాలు అసలే అనేవారు కాదు. యింక నాకెలా తెలుస్తుంది? "

"నిన్ను చూస్తేనేగాని మీ అమ్మ మామూలు మనిషికాదు నాయినా! కళ్ళకెదురుగుండా ఈ అన్యాయం జరుగుతూ వుంటే చూడలేక నీకీ నిజం చెపుతున్నాను... నువ్వెలా భరించగలవో అని అనుకున్నా... యింకా నిజాన్ని దాచడం మంచిది కాదని అనుకున్నాను. ఇందువల్ల ఏ ఒకరి స్వార్థం కోసమో ఒక నిండుజీవితం నాశనం అయిపోతూ ఒక తల్లీ... బిడ్డా... అన్యాయంగా విడిపోతూవుంటే



చూడలేకపోయాను. ఇహనయినా ఆలస్యం చేయకు బాబూ! నేను ఈ నిజం చెప్పినందుకు ఎంతో ఆనందిస్తున్నాను... నా హృదయం, బరువు తీరిపోయింది. అందుకు ఎవరేం అనుకున్నా... నాకు భయంలేదు!" అని ఆవేశంతో చెప్పింది పద్మ.

"ఇన్నాళ్లూ అందరూ వూరుకుని నన్ను మభ్యపెట్టేరు. అది నేను చేసిన దురదృష్టమో! పాపమో! యిక్కడికే నా హృదయం మండిపోతూంది. ఋంకా ఆలశ్యం చేసేం

ఛటి మూర్ఖుడిని కాను పిన్నీ" అన్నాడు కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ.

"యింతవరకూ అవకాశం రాలేదు బాబూ! మేమూ ఆలోచించి ఆలోచించి, లోలోపలే ఎన్నో తర్కించుకొని యీ విష

యాన్ని తెలిపేము. చెబితే ఒక ముప్పు... చెప్పకపోతే మరొక ముప్పు యీ రెండు బాధ్యతల మధ్యా ధైర్యం చేయలేక పోయాం..." అని అన్నది.

తర్వాత విజయకుమార్ అక్కడ మరి వుండడానికి యిష్టపడలేదు. మోహన్‌రావు వచ్చేక తన తల్లిదండ్రుల గురించి మరికొంతసేపు మాట్లాడి... ఆ రోజే ప్రయాణమయేడు. ఆ కొద్దిరోజుల అనుబంధం వనజకు ఎంతో బాధ అనిపించింది. మోహన్‌రావు, పద్మ నుండమనలేకపోయారు.

★ ★ ★

సుశీల వంట పని పూర్తిచేసి తండ్రికి, తమ్ముళ్ళకి పెట్టింది. తమ్ముళ్ళిద్దరూ స్కూళ్ళకి వెళ్ళేరు.

కొండలరావు వీధిలోకి వెళదామని గుమ్మం దిగుతూ వుండగా వీధిలో రిక్షా ఆగింది.

సుశీల గుమ్మంలోంచే చూస్తోంది.

"ఎవరబ్బా మనింటికి వచ్చేది!" అని కొండలరావు ఆగిపోయాడు.

రిక్షాలోనుండి మాధవరావూ, విజయ్‌కుమార్ దిగారు.

కొండలరావు మాధవరావును గుర్తుపట్టినా విజయకుమార్‌ను పోల్చుకోలేక తడబడుతున్నాడు.

సుశీల యిద్దరినీ గుర్తుపట్టినా, అడుగు ముందుకు వేయబోయి ఆగిపోయింది.

"బాబూ!" అని అప్రయత్నంగా పిలిచింది!

విజయకుమార్ తలెత్తి చూసి,

"అమ్మా! అంటూ సుశీల దగ్గరకు వెళ్ళి కాళ్ళమీద పడ్డాడు. సుశీల పట్టలేని ఆనందంతో విజయకుమార్ తల స్పృశించి లేవనెత్తింది.

"నాయనా! వచ్చావా? " అని ఆనందభాష్పాలు రాల్చి అతని తలను హృదయానికి హత్తుకుంది.

"లోపలకు రండి!" అని మాధవరావును తీసుకువెళ్ళాడు కొండలరావు.

★ ★ ★

కథ ఆపింది 'నాయీ' సావిత్రమ్మ!

ఆమె కంటివెంట ఏకధారగా అశ్రువులు రాలుతున్నాయి. అంతా విని నిశ్చేష్టుడయినాడు శేఖర్. ఆలోచనలో పడ్డాడు.

"నాయీ! నిన్నొక మాట అడగనా!" అని ప్రశ్నించాడు శేఖర్.

"అడుగు నాయినా!" కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అన్నది.

"ఆ సుశీలే... యీ నా... నాయీ కదూ!'

"అవును బాబూ!"

"ఎంత జాలికథ నీది నాయినమ్మా!" అని నిట్టూర్చాడు.

"ఈ రోజుల్లో కూడా యిలాంటి జీవితాలున్నాయంటే ఎవరు నమ్ముతారు నాయనా? '

"ఎవరు నమ్మినా నమ్మకపోయినా ఈ బాధలన్నీ భరిస్తూ ఎలా బతకగలిగావు నాయీ!"

"ఇదుగో యిందుకోసమే నాయనా! మీ నాన్నకోసం! తర్వాత కోడలితో, మనుమలయిన మీతో గడుపుతున్నా.. యీ ఆనందం కోసమే నేను మొండికెత్తి బతుకుతున్నది... యీ సుఖం కోసమే నాయినా..." అని అన్నది నాయీ ఆనందంతో పరవశిస్తూ.

"నీ కథ తప్పకుండా రాస్తాను నాయీ!"

అని అంటూండగానే కోడలు కమల లోపలకు వచ్చింది.

"బావుంది... తెల్లవారిపోతున్నా... ఏమిటి? నాయినమ్మా... మనుమడూ... కథలు చెప్పుకుంటూ కూర్చున్నారు? మీ అబ్బాయిగాని చూశారంటే యింకేమన్నా వుందా? ... అసలే మీ ఆరోగ్యం మంచిది కాదు... లేవండి!"

అంటూ చేయి పట్టుకుని తీసుకువెళ్ళిపోయింది సావిత్రమ్మను!...

అంతలోనే తొలికోడికూసింది. ★

# చతుర ప్రపంచం

## వెన్నెల్లో
### ఆలయశోభ

గ్రీసుదేశంలోని పార్థినాన్ అనే అతిపురాతన దేవాలయం ప్రపంచం మొత్తంమీద విశిష్ట మైనదిగా గుర్తించబడింది. దీనికి గల చారి త్రకప్రాముఖ్యత, మతపరమైన విశిష్టత, శిల్పకళాసంపన్నత ప్రపంచంలో మరేదేవా లయానికి లేదంటున్నారు పరిశీలకులు. కానీ అధికారుల అలసత్వం, అశ్రద్ధల కారణంగా ప్రస్తుతం ఈ దేవాలయం అత్యంత శిధిలావ స్థకు చేరుకుంది.

పశ్చిమదేశాల సంస్కృతికే మకుటాయ మానమనిపించుకుంది గ్రీకు సంస్కృతి. గ్రీకు నాగరికతతోపాటే పాశ్చాత్య నాగరికత అభివృద్ధి చెందుతూ వచ్చింది. ప్రతి సంవ త్సరం సుమారు 5 లక్షల మంది గ్రీసులో పురాతన కట్టడాలను, ఆ సాంస్కృతిక వైభ వాన్ని తిలకించడానికి వెడతారు.

గ్రీస్‌లో ఎన్నో కట్టడాలున్నా పురాతన పార్థినాన్ దేవాలయ మొక్కటే మొత్తం గ్రీకు సంస్కృతిని ప్రతిబింబిస్తోందంటారు సంద ర్శకులు. ఈ దేవాలయం ఏథెన్స్‌లోవుంది. ప్రస్తుతం ఇది పూర్తిగా కూలిపోయేందుకు సిద్ధంగా వుంది. 'యాక్రోపోలిస్' పర్వతసా నువులపై నిలిచిన ఈ మందిరం చుట్టూ వున్న కలుషిత వాతావరణానికి కొంత శిధిల మయిందంటారు. ఒక్క వాతావరణ కాలు ష్యమే కాక 1981లో వచ్చిన భూకంపం దేవాలయ పునాదులను కదలించింది. ప్ర స్తుతం ఈ దేవాలయాన్ని రక్షించడానికి ఏమేం చర్యలు తీసుకోవాలి అన్నదానిపై చర్చలు జరుగుతూనే వున్నాయి. దేవాల యంలో వాడిన ఇటుకలను నెమ్మదిగా తొల గించి వాటికి రసాయనిక చికిత్స చేసి తిరిగి మళ్ళీ యధాస్థానంలో అమర్చడం మంచి దని నిపుణుల అభిప్రాయం. ఇది చెప్పడం తేలికేగానీ, ఆచరణసాధ్యంకాదని చాలా మంది అభిప్రాయం. ఆ దేవాలయంలోని ఒక్కొక్క గ్రెనైట్ రాయి బరువు సుమారు 12 టన్నులు దాకా వుంటుందని తెలుస్తోంది. వీటిని క్రేనుల సహాయంతో మాత్రమే ఎత్తడం సాధ్యం. ఈ పని పూర్తి కావడానికి 12 సంవత్సరాలు పడుతుందంటున్నారు పరిశోధకులు.

ఈ దేవాలయానికి సంబంధించిన ఓ కమిటీ ప్రొఫెసర్ జార్జిమిలనాస్ అనే ఆయన ఆధ్వర్యంలో ఈ విషయాలన్నిటినీ పరిశీలి స్తోంది. ఆ ప్రాంతంలో అధిక మొత్తంలో విడుదలయ్యే సల్ఫర్‌డైయాక్సైడ్ కారణంగా దేవాలయంలోని విగ్రహాలపై జిప్సమ్ కో టింగ్ ఏర్పడుతోందని అది వాటి అందాన్ని నాశనం చేస్తోందని అంటున్నాడు ప్రొఫెసర్ మిలనాస్.

ప్రయోగశాలలో జాగ్రత్తగా పరిశోధనలు జరిపి ఈ విగ్రహాల పూర్వపు శోభను పునరు ద్ధరించగల కెమికల్‌ని తయారుచేయడం అవసరమని అంటున్నారు పరిశోధకులు. ఈ కెమికల్ ఆ విగ్రహాలను మరో 50 సంవత్సరా లవరకు చెక్కుచెదరకుండా వుంచేంత శక్తి మంతంగా వుండాలని వారి అభిప్రాయం.

ఎన్నో శతాబ్దాలనుంచి నిర్లక్ష్యానికి గు రయి నాశనమవుతున్న విగ్రహాలను కేవలం మరో అర్ధశతాబ్దం వరకైనా కాపాడగలగాలి అన్న ఆలోచన నిజానికి ఇంతవరకు కార్య




రూపంలోకి రానేలేదు.

ఈ దేవాలయానికి ఓ విచిత్ర చరిత్ర వుందని అంటారు. క్రీ.పూ. 300 సం॥ ప్రాంతంలో మాసిడోనియా రాజు పోలియోసెటిజ్ తన సైన్యంతో ఈ దేవాలయంలో విడిది చేశాడు. క్రీ.శ. 6వ శతాబ్దంలో క్రిస్టియనులు దీన్ని చర్చిగాను, అటుపైన 900 సంవత్సరాలకి మహమ్మదీయులు దీనిని మసీదుగాను మార్చినట్లు తెలుస్తోంది.

1687లో ఈ దేవాలయం ఎన్నో సమస్యలను, ఆటుపోట్లను ఎదుర్కొంది. వెనిస్‌కి చెందిన మోటోసినీ అనే అతడు ఈ దేవాలయాన్ని ఆక్రమించాడు. టర్కిష్ సైన్యాలు ఈ దేవాలయాన్ని కాపాడ్డంకోసం తమతమ యుద్ధసంబంధిత ఆయుధాలను ఆ మందిరంలో పెట్టారు. ఇరుపక్షాలవారుపయోగించిన అప్పటి నాటు బాంబులు కొన్ని దేవాలయంమీద పడటంతో చాలా విగ్రహాలు బాగా దెబ్బతిన్నాయి. ఏథెన్స్‌లోని రాజకీయ పెద్దలు ఆ నగరాన్ని ఎంతో సౌందర్యవంతంగా తీర్చిదిద్దాలనుకున్నారు. కానీ యుద్ధం వారి ఆశల్ని నాశనం చేసింది. ఆ తరువాత మరెన్నో సైన్యాలు ఈ దేవాలయాన్ని నాశనంచేసాయి. అంతకుముందు క్రీ.పూ. 480లో ఈ దేవాలయాన్ని పర్షియన్ సైన్యం ఆక్రమించుకోడానికి చేసిన ప్రయత్నంలో కొంత నాశనం చేసింది. ఆ సైన్యం ఏథెన్స్‌ని విడిచిపోగానే ఏథెన్స్ ప్రజలు విరిగిపోయిన ఎన్నో విగ్రహాలను భూస్థాపితం చేశారు. అవి 19వ శతాబ్దపు తవ్వకాల్లో బయటపడ్డాయి.

పార్థినాన్ దేవాలయాన్ని పునరుద్ధరించే బాధ్యత ప్రఖ్యాత గ్రీకు శిల్పి ఫిదియాస్‌కు అప్పచెప్పబడింది. 'పెనాథినియక్' అనే పండుగకు ఏథెన్స్ పట్టణం మొత్తం ఈ దేవాలయానికి తరలి వెళ్ళి అక్కడి దేవతా విగ్రహాలను రంగురంగుల దుస్తులతో అలంకరించి ఆరాధిస్తారు.

ఈ మధ్యన 34 ఏళ్ళ వయస్సుగల 'మనోలిసేకోట్స్' అనే శిల్పి ఆధ్వర్యంలో ఈ దేవాలయం తిరిగి పునరుద్ధరింపబడింది. ఆయన చెప్పేదేమంటే "ఆనాటి రాజులు తయారుచేయించిన చెక్క రక్షక వలయాలు, ఇప్పటి 20వ శతాబ్దపు ఆధునిక ఇనప నిర్మాణాలకన్న శక్తివంతంగా వున్నాయి" అని. తుప్పు కారణంగా ఇనప తలుపులు, జాలీలు మొదలయినవి నిర్మాణంలో పగుళ్ళకు కారణమవుతున్నాయని, అందుకని ఇనుముస్థానంలో టిటానియమ్ వాడటం క్షేమదాయకమని అంటున్నారు నిపుణులు. ఇది తేలికగా వుండటమే కాక తుప్పును దరిచేరనివ్వదని వారి అభిప్రాయం.

లక్షలాది ప్రజలు ఇప్పటికీ ఈ దేవాలయాన్ని సందర్శించి, విగ్రహాలను తాకి క్రమేపీ శోభనుకోల్పోతున్న వాటిని చూసి బాధపడు

తూవుంటారు. ఏక్రోపోలిస్ పర్వతంపై వున్న ఈ దేవాలయం ప్రస్తుతం ఒకే ఒక్క పెద్దరాయి మీద అలవోకగా నిలిచివుంది. అది ఓ సున్నపురాయి. వాతావరణం మార్పులకి ఆ రాయి ఎంతో కాలం తట్టుకోవడం కష్టమంటున్నారు పరిశోధకులు.

వేసవిలో సందర్శకుల సంఖ్య అధికమొత్తంలో వుంటుంది. ప్రతివారు బైనాక్యులర్స్ తెచ్చుకుంటారు. ఎందుకంటే దేవాలయ భద్రత దృష్ట్యా ప్రస్తుతం సందర్శకులను దేవాలయ ప్రాంగణంలోకి అడుగుపెట్టనివ్వడం లేదు. కొంచెం దూరంగా నిలబడి బైనాక్యులర్స్‌తో మాత్రమే దాని శోభను తిలకించాలి. ఇంతకీ వీళ్ళు చూసే విగ్రహాలు అసలు విగ్రహాలు కావనీ, నకిలీవని మరో కథనం. అసలు విగ్రహాలను 19వ శతాబ్దంలో లార్డ్ఎల్జిన్ ఇంగ్లండు మ్యూజియంకు పంపి భద్రపరిచినట్టు చెబుతారు. ఇది ఇప్పటికీ ఇంగ్లండుకీ, ఏథెన్స్‌కీ మధ్య తీరని తగవులా నడుస్తూనే వుంది.

ఒకప్పటి సినీనటి, ఇప్పటి సాంస్కృతిక శాఖామంత్రిణి అయిన మిలినా మెర్క్యురీ ఈ అసలు విగ్రహాలను బ్రిటన్‌నుంచి వెనక్కి తెప్పించడానికి విఫలయత్నం చేస్తున్నట్టు వినికిడి.

అక్కడి మ్యూజియం అధికారులు చెప్పేదేమంటే "ఈ విగ్రహాలు ఇక్కడ కాబట్టి ఇంత జాగ్రత్తగా వుంచగలుగుతున్నాము. మళ్ళీ ఏథెన్స్‌కు పంపితే అవి తొందరలోనే పాడయ్యే ప్రమాదముంది'' "అవును ఆ సమస్య మాకూ తెలుసు. అందుకే వాటిని ఎక్రోపోలిస్‌లోనే ప్రత్యేక ఎయిర్ కండిషన్డ్ మ్యూజియంలో భద్రపరచాలనుకుంటున్నాము'' అంటూ మిలినా మెర్క్యురీ వాదిస్తోంది.

ఈ దేవాలయంతోపాటు మిగిలిన దేవాలయాల రక్షణకు గ్రీసు ప్రభుత్వం ఏటా కోటీ 30 లక్షల రూపాయలను ఖర్చుపెడుతోంది. ఈ మధ్య వివిధ ధార్మిక సంస్థలనుంచి 75 లక్షలు విరాళ రూపంలో అందింది. ఇదికాక అనేక రకాల పన్నులను విధించి ఆ డబ్బును దేవాలయ రక్షణకు ఉపయోగిస్తోంది ప్రభుత్వం.

పున్నమిరాత్రిలో వెన్నెల కాంతుల్లో ద్విగుణీకృతమయ్యే పార్థినాన్ దేవాలయపు శోభను చూడ్డానికి చాలామంది ఉవ్విళ్ళూరుతూ వుంటారు. ఇది మరెన్నో శతాబ్దాలపాటు ప్రజలను అలరించాల్సిన అపూర్వకట్టడమని నిస్సందేహంగా చెప్పవచ్చునంటారు చాలా మంది.

## మాంసాహార మొక్కలు

మొక్కల్లో మాంసాహారులు కూడా వుంటాయన్న విషయం చాలామందికి తెలిసేవుండచ్చు. నిజానికి మామూలు మొక్కలకు, ఈ ప్రాణాంతక మొక్కలకు పైకి ఏమీ తేడా కనిపించదు. ఈ మాంసాహార మొక్కలకు తమ ఆహారాన్ని పట్టుకుందుకు కోరలూ, దంతాలు వగైరా లేమీ వుండవు. పైకి అది మామూలు మొక్కలా కనిపిస్తుంది.

మనిషితోపాటు ఇతర జంతుజాలమంతా తమ ప్రాణవాయువుకోసం మొక్కలపైనే ఆధారపడివుంది. అలాగే కొన్ని చెట్ల జీవనం మాత్రం ఇతర జీవుల ప్రాణంపై ఆధారపడి వుందని చెప్పక తప్పదు.

చెరువులవద్ద, నదులవద్ద పెరిగే ఓ రకమైన మొక్కను 'సన్‌డ్యూ' అంటారు శాస్త్రజ్ఞులు. ఇది మాంసాహారి. దీని ఆకులకు చుట్టూ వేల సంఖ్యలో సన్నని నూగులాంటి దారాలు వేలాడుతూ వుంటాయి. ఇవి జిగురుగా వుండి కీటకాలు వీటిపై వాలగానే వాటికి అంటుకుపోతుంది. త్వరలోనే ఆ జిగురు పదార్థం ఆ కీటకం శరీరమంతా వ్యాపించి, దానిలోని కండ భాగాన్నంతటినీ కరిగించి వేస్తుంది. ఆకులకున్న ఈ నూగులాంటి పీచుపదార్థం ఎట్టి పరిస్థితుల్లోనూ

కీటకాన్ని తప్పించుకోనివ్వదు. సన్నని ఈ నూగు ఆ చెట్లకి అనేక వందల చేతుల్లా పనిచేస్తాయి. కీటకాన్ని కరిగించి మాయం చేసే ఓ ఆమ్ల పదార్థం ఉత్పత్తి అవుతూ వుంటుంది ఆ చెట్ల ఆకులనుంచి. కీటకంలో కండ భాగమంతా కరిగి ఆ మొక్క ఆహారంగా మారాక మిగిలిపోయిన అస్థి పంజరం ఎండిపోయి గాలికి కొట్టుకుపోతుంది.

పరిశోధించగా తేలిందేమంటే ఈ మాంసాహార వృక్షాలకు చక్కని తెలివి, తార్కిక శక్తీ వున్నాయని, ఇవి కూడా కండ ఎక్కువగా అంటే తాము తినే ఆహారపదార్థ భాగం ఎక్కువగా వున్న కీటకాలను మాత్రమే ఒడిసిపట్టుకుంటాయని తేల్చారు శాస్త్రజ్ఞులు. కీటకాలతోపాటు, చిన్నచిన్న పిన్నులు, కాగితంముక్కలులాంటి నిర్జీవపదార్థాలను కూడా ఈ ఆకులపై పెట్టి చూశారు శాస్త్రజ్ఞులు. అయితే కేవలం కీటకాన్ని మాత్రమే కరిగించి మాయం చేసి, మిగతా నిర్జీవ వస్తువులని అలాగే వుంచేశాయి ఆ మొక్కలు. ఏది తినాలో, ఏది తినకూడదో బాగా తెలిసిన జ్ఞానుల్లా కనిపిస్తాయి ఈ మొక్కలు.

ఆకులకుండే పీచుభాగాల టెంటకిల్స్ ఆహారాన్ని పట్టుకోవడంలో ఓ చక్కని పద్ధతిలో పనిచేస్తాయి. ఈ ఎరని తినడంలో కూడా ఆకుచుట్టూ వుండే పీచుపదార్థ భాగాలు మొత్తం ఆహారాన్ని సమానంగా పంచుకుని తింటున్నట్టు కనిపిస్తుంది.




ఎరని పూర్తిగా భుజించాక అస్థిపంజరాన్ని అవతలకి తోసేస్తాయి ఆకులు. ఒకరోజు ఆహారాన్ని తిన్నాక, తిరిగి రెండు రోజులపాటు ఆ జిగురు పదార్థాన్ని స్రవించవు. అంటే తిన్న ఆహారం అరగడానికి రెండు రోజులు పడుతుందన్నమాట. మళ్ళీ ఆకలి వేసినపుడు మాత్రమే కీటకాన్ని కరిగించే జిగురుపదార్థాన్ని స్రవించడం మొదలపెడతాయి ఆకులు. అలా వాటికి కావాలసినపుడు కీటకాలు దొరక్కపోతే చివరకు ఆకలితో చచ్చిపోతాయీ మొక్కలు.

ప్రసిద్ధి చెందిన వృక్షశాస్త్రజ్ఞుడు, పరిణామ శాస్త్రవేత్త ఛార్లెస్ డార్విన్ (1809-1882) ఈ మొక్కలపై చాలా పరిశోధనలు చేశాడు. ఈ మొక్కలను రెండు వేర్వేరు వర్గాలుగా విభజించి, ఒక వర్గానికి కేవలం గాలి, నీరు, ఎండ, మట్టి వగైరాలు మాత్రమే అందజేసి, మరో వర్గానికి కీటకాల్ని అందించేవాడు. కొన్నాళ్ళకి నీరు, మట్టి వగైరా మాత్రమే అందుకున్న మొక్కలు ఎండి చచ్చిపోయాయి. మాంసాహార మొక్కలు నిక్షేపంగా వున్నాయి.

ఈ 'సన్‌డ్యూ' మొక్కల వేర్లు అతి సున్నితంగా వుంటాయి మిగిలిన మొక్కల్లా వేరు ద్వారా భూమిలోని మట్టినుంచి ఆహారాన్ని గ్రహించవు. కేవలం ఆకులపై పీచు, నూగుపదార్థాలద్వారా మాత్రమే ఇవి

ఆహారం స్వీకరిస్తాయి.

'సన్‌డ్యూ' కాక ఇంకా ఎన్నో మాంసాహార మొక్కలున్నాయి ప్రకృతిలో అంటున్నారు శాస్త్రజ్ఞులు. బ్లాడర్ బర్ట్ అనే మరో మాంసాహార మొక్క ఆహారం సంపాదించే మార్గం మరింత క్రూరంగా వుంటుందంటారు పరిశీలకులు. ఈ మొక్కల ఆకులు పొడవుగా వుండి సూదుల్లా మొనతేలి వుంటాయి. ఆకుల కాడభాగంలో అనేకచోట్ల చిన్న సంచుల్లా వేలాడుతూ వుంటాయి. పొరపాటున ఏదైనా కీటకం చెట్టుపై పాకడం జరిగితే అది దగ్గరకు రాగానే ఈ సంచి తెరుచుకుని కీటకాన్ని తనలో ఇముడ్చుకుని వెంటనే తలుపు మూసేస్తుంది. ఆ మూసుకున్న సంచిలోనే ఊపిరందక ప్రాణాలు విడిచి సదరు మొక్కకు ఆహారమవుతుందా జీవి. ఈ బ్లాడర్ బర్ట్ మరీ పెద్ద సైజు మొక్కలు ట్రాపికల్ ప్రాంతాల్లో కనిపిస్తాయి. అక్కడి వాతావరణం చాలా వేడిగా వుంటుంది. ఈ మొక్కలకు వేలాడే సంచులు సుమారు 18 అంగుళాల పొడవు వుంటాయి. ఆ కాయల్లోని జిగురు పదార్థంలో ఓసారి పడిన కీటకం మరి తప్పించుకునే ప్రసక్తే లేదు.

ఇదే ప్రకృతివైచిత్రి. ఎన్నో మొక్కలు మనిషికి ఆహారమైతే మరెన్నో మొక్కలు మాంసాహారంకోసం ఎదురుచూస్తాయి.

---

## ప్రాణాల్ని తీస్తున్న మందులు

ఆమధ్య కొచ్చిన్‌కు చెందిన ఓ డాక్టరు ఈస్ట్రోజెన్, ప్రొజెస్ట్రాన్‌లనుంచి తయారయ్యే మందులను నిషేధించవలసిందిగా కేరళ హైకోర్ట్‌కి పిటిషన్ పెట్టాడు. ఎందుకంటే అవి రెండూ ప్రమాదకరమైనవిగా నిరూపించబడ్డాయని ఆయన వాదన. వెంటనే కోర్టువారు ఈస్ట్రాజాన్, ప్రొజోస్ట్రాన్‌లు కలిసి వున్న మందులన్నిటి పేర్లూ వెల్లడి చేయవలసిందని మందుల కంపెనీలకి హెచ్చరికలు చేసింది. అయితే ఇన్‌ఫార్, యునిచెమ్ అనే రెండు మందుల కంపెనీలు మాత్రం హైకోర్ట్ హెచ్చరికను ధిక్కరించి సుప్రీంకోర్టుకు వెళ్ళాయి. సుప్రీంకోర్టు ఈ కంపెనీవారికి ఈస్ట్రొజెన్, ప్రొజెస్ట్రన్ అనేవి మానవాళికి నిజంగా హానికరమా? అన్న విషయం పైపరిశోధన జరిపి ఆరునెలల లోపుగా ఓ నివేదికను తమకు సమర్పించాలని కోరింది.

అంతేకాకుండా 1983లో 18 రకాల మందులు ప్రజలకు హానికరమని ప్రకటించబడిన తరువాత కూడా ఆ మందుల అమ్మకాలను నిషేధించకుండా ఎందుకు ప్రోత్సహిస్తున్నట్టు అని సుప్రీంకోర్టు కేంద్ర ప్రభుత్వాన్ని నిలదీసింది. జస్టిస్ రంగనాథమిశ్రా అన్నదేమంటే "ఫలానా మందు హానికరం అని తెలియనంతసేపు దాని అమ్మకాల్ని పట్టించుకోము, కాని అవి ప్రమాదమని తెలిసిన పిదప కూడా ఎట్టి చర్యా తీసుకోకపోవడం అంటే కేవలం మనుషులను సామూహికంగా హత్య చేయడం తప్ప మరేం కాదు'' అని. కేంద్ర ఆరోగ్యశాఖవారిని ఈ విషయంలో సుప్రీంకోర్టు ఘాటుగా విమర్శించింది.

'కేంద్ర ఆరోగ్యశాఖవారు', 'ఇండియన్ మెడికల్ అసోసియేషన్స్ అండ్ డ్రగ్ కంట్రోలర్స్'వారు ప్రజల విశ్వాసాన్ని పోగొట్టుకుంటున్నారన్న ఆరోపణలు వస్తూనే వున్నాయి. కోర్టు ఆర్డరు వచ్చి మూడేళ్ళయినా ఈ మందుల అమ్మకాలు ఎందుకు నిషేధించబడలేదన్నది ఎవరికీ అంతుబట్టకుండా వుంది. ఏది ఏమయినా డాక్టర్లు, డీలర్లు, కంపెనీలు, డ్రగ్ కంట్రోలర్లు, హెల్త్ ఇన్స్‌పెక్టర్లు... ఇలా అందరూ కలిసి మూకుమ్మడిగా ప్రజల ఆరోగ్య పరిస్థితిని మెరుగుపర్చడానికి బదులు అధ్వాన్నస్థితికి తీసుకువెళుతున్నారన్నది మాత్రం స్పష్టం. ఒక్క హానికరమైన మందులేకాక ప్రమాదకరమైన డూప్లికేట్ మందులను కూడా తయారుచేసి ప్రజల పాలిట హంతకుల్లా తయారవుతున్నారంటు

న్నారు విమర్శకులు.

వార్తాపత్రికల్లో నకిలీమందుల కారణంగా జనం చనిపోవడం చదువుతూనే వున్నాం. అందుకని 1983లో నకిలీమందుల తయారీకి ఉన్న చిన్నపాటి శిక్షను యావజ్జీవ కారాగార శిక్షగా మార్చారు. పూర్వం ఇది పదేళ్ల జైలుశిక్షగా వుండేది. కానీ ఈ శిక్షలో మార్పు జరిగాక ఒక్క కేసు కూడా నమోదయిన దాఖలాలు లేవు అంటున్నారు. అంతమాత్రంచేత ఎవరూ నకిలీమందులను తయారు చేయడంలేదని ఖచ్చితంగా చెప్పలేం. చట్టానికి దొరకనంతసేపు వారు తయారుచేయనట్టే. కంపెనీనుంచి మందులను హోల్‌సేల్‌గా తీసుకెళ్లే డీలరూ ఎలాంటి టెస్టూచేసి ఆ మందులు నకిలీవనీ, కావనీ చెప్పలేడు. అలాగే డీలర్లనుంచి కొన్న కస్టమర్లకీ అవి ఎలాంటి మందులో తెలియవు.

కట్టుదిట్టమైన భద్రతాచర్యలను, కంట్రోలును విధించకుండా మందుల పరిశ్రమలను విస్తరింపచేయడం ఆత్మహత్యా సదృశమని చాలామంది ఘోషిస్తున్నారు. ఇండియాలో 12 వేల ప్రయివేటు మందుల కంపెనీలున్నాయి. అదే అమెరికాలో ప్రయివేటీకరణ సర్వసామాన్యమైనచోట 700 ప్రయివేటు మందుల కంపెనీలు మాత్రమే వున్నాయి. ఎంతో అభివృద్ధి చెందిన జపాన్‌లో కూడా కేవలం 1100 మందుల కంపెనీలున్నాయి. దానికి కారణం మందుల రాశికన్న వాసికి ప్రాధాన్యమిస్తూ, ప్రజలను సురక్షితంగా బతకనివ్వడమే ఆయా దేశాల ధ్యేయంగా కనిపిస్తోంది. హాథీకమిటీవారు మందుల పరిశ్రమని ఓ కుటీర పరిశ్రమగా చేయడాన్ని ఖండించింది. దాని అభిప్రాయమేమంటే చిన్న పెట్టుబడితో స్థాపించబడిన చిన్న చిన్న మందుల కంపెనీలు సరియైన ఆర్థిక స్థోమత, యంత్రసామర్థ్యత లేక మందుల క్వాలిటీ విషయంలో శ్రద్ధ చూపలేకపోతున్నాయి. 1971లో సెంట్రల్ డ్రగ్ కౌన్సిల్‌వారు 2000 చిన్న మందులకంపెనీలను తనిఖీచేసి తేల్చినదేమంటే అందులో కనీసం 500 కంపెనీల్లో కూడా మందుల తయారీకి కావలిసిన ప్రాథమిక యంత్రసామగ్రి లేదు.

ప్రస్తుతం పెద్ద మందులనుంచి, చిన్న మందులదాకా అన్నిటికీ నకిలీ మందులు తయారవుతున్నాయి. ఇండియాలో ఫరీదాబాద్, గజియాబాద్, సోనిపేట్, ఢిల్లీ, జైపూర్, కాన్పూర్, లక్నోలలో ఈ నకిలీమందులను తయారు చేసే కంపెనీలున్నాయని తేలింది.

హైద్రాబాద్‌లోని నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్‌వారు చేసిన ఓ సర్వేలో 46 శాతం మందులు డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేకుండానే అమ్ముడుపోతున్నాయని తేలింది. ఈ పరిస్థితి ఒక్క హైద్రాబాద్‌కే పరిమితం కాదు, దేశం మొత్తంమీద ఇదే స్థితి నెలకొని వుంది. మందుల క్వాలిటీని, నకిలీ లక్షణాలని, కాలదోషాన్ని... చెక్‌చేసే లీగల్ మెషినరీ కరువైందంటున్నారు పరిశీలకులు. కొన్ని మందుల కంపెనీలు ఒకదానితో ఒకటి చేతు



లు కలిపి ప్రజలను మోసం చేస్తున్నాయి. ఆమధ్య కొంతకాలం క్రితం ఓ మందుల కంపెనీ రెండు మూడు మందుల పేర్లను మార్చింది. అవే పేర్లను మిగతా కంపెనీలు కూడా సొంతం చేసుకున్నాయి.

విదేశాలనుంచి దిగుమతయ్యే మందుల ను పరిశీలించే మంచి మెషినరీ కూడా మనదేశంలో లేదని తెలుస్తోంది. విదేశీ మందు అనగానే మంచిదే అన్న నమ్మకం మన ప్రభుత్వానికుందని కొంతమంది విమర్శిస్తున్నారు. ప్రస్తుతం ఆయా దేశాల్లో నిషేధించబడిన 1200 రకాల విదేశీమందులు ఇండియాలో నిరాటంకంగా అమ్ముడుపోతున్నాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థవారి ఓ నివేదిక ద్వారా వెల్లడి అయిన విషయమేమంటే అభివృద్ధి చెందిన దేశాలకన్న, అభివృద్ధి చెందుతున్న దేశాలు మందుల దిగుమతులమీద ఎక్కువ ఖర్చుపెట్టి మంచి రకం విదేశీమందులను ప్రజలకు అందించగలుగుతున్నాయి.

వరల్డ్ హెల్త్ ఫౌండేషన్‌వారికి తమ 200 రకాల మందులపై గల హక్కు కాలదోషం పట్టినా ఎవరూ పట్టించుకునేవారు లేరు. ప్రపంచం మొత్తంమీద 25 వేల రకాల మందులు తయారవుతున్నా కేవలం 200 రకాల మందులు, ఇంజక్షన్లు మాత్రమే వాడకంలో వున్నాయి. ఇందులో గ్రామీణ ఆరోగ్య శాఖవారయితే కేవలం 25 రకాల మందులు మాత్రమే ఉపయోగిస్తున్నారు. ఆధునిక మందుల తయారీలో కొన్ని మందులు ఎంత బాగా పనిచేస్తున్నాయో అంత సైడ్ ఎఫెక్ట్స్ కూడా వున్నాయంటున్నారు వైద్యులు.

'కన్స్యూమర్ గైడెన్స్ సొసైటీ' చీఫ్ డాక్టర్ రాజ్‌ఆనంద్ అనే ఆయన మందుల కంపెనీలు నిర్లక్ష్యవైఖరితో ప్రజల చావుకు ఎలా కారణమవుతున్నాయి అన్న విషయంపై పరిశీలన జరిపి ప్రజలకు ఆ లోటుపాట్లు తెలియచెప్పేందుకు ఎంతో కృషిచేశారు.

ఎనబాలిక్ స్టెరాయిడ్ అన్న మందు స్థూలకాయాన్ని తగ్గించడం కోసం పూర్వం ఇచ్చేవారు. అయితే అది చాలా హానికరం అని తెలిశాక సీబాగాయెగీ కంపెనీ 1983లో దాని ఉత్పత్తులను నిలిపివేసింది. కానీ ప్రస్తుతం అదే మందును వేరే పేరుతో మరో కంపెనీ దానిని మార్కెట్‌లో విడుదల చేసింది.

ఓ ప్రఖ్యాత మందుల కంపెనీవారు 1985 మార్చి 15న విడుదల చేసిన ఉత్తరంలో తమ కంపెనీ మార్చి 31నుంచి ఇంట్రాలియోఫామ్, మెక్సాఫామ్ మొదలైన కొన్ని మందుల తయారీని ఆపేస్తున్నామని ప్రకటించింది. కానీ 1985 మే నెలలో ఇది విడుదల చేసిన మందుల ధరవరల జాబితాలో ఈ పైమందుల ధరలు కూడా చేర్చబడ్డాయి. దీనినిబట్టే సదరు కంపెనీ ఆ పై మందుల తయారీని, అమ్మకాల్ని ఎంతవరకు ఆపిందో తెలుస్తోంది. ఇందులో కొన్ని మందులను ప్రస్తుతం ఇండియా ఫార్మెట్యూటికల్స్‌వారు తయారుచేస్తున్నారు.

ఇకపోతే మార్కెట్‌లో మందుల ధరలు అప్పుడప్పుడు ఒక షాపుకి మరోషాపుకి తేడాను చూపిస్తూ వుంటాయి. అంతేకాదు వంద బిళ్ళలుండవలసిన ఓ సీల్డ్ బాటిల్‌లో 90 బిళ్లలు మాత్రమే వుంటాయి. టానిక్ సీసాలో టానిక్ $^{3}/_{4}$ వంతు మాత్రమే వుంటుంది. వీటికి బాధ్యత వహించేవారుగానీ, చెక్ చేసేవారుగానీ ఎవరూ లేరు. అంతేకాదు మందుల ఎక్స్‌పైరీ విషయంలో కూడా వైరుధ్యం వుంది. వేరు వేరు కంపెనీలు తయారు చేసే ఒకే కెమికల్ కాంబినేషన్‌తో కూడిన మందులు, వేరు వేరు ఎక్స్‌పైరీ డేట్లను సూచిస్తున్నాయి అంటున్నారు కష్టమర్లు. ఇంతకీ ఆఖరు మాటగా చాలామంది మొత్తుకుంటున్నదేమంటే ఈ మందుల పరిశ్రమలు ప్రజల్ని నిదానంగా చంపుకుంటూపోతున్నాయని. ★

# ఏరిన ముత్యాలు

☆ నిషేధించిన ప్రతి పుస్తకంలోను ప్రపంచానికి కావలసిన విజ్ఞానం ఏదో వుందన్నమాట.

-ఎమర్సన్

☆ చేసిన పనియొక్క యోగ్యతకు తగిన ప్రతిఫలం ముట్టని వృత్తి సాహిత్యం ఒక్కటే.

-ఫ్రూడ్

☆ ఉన్నవాళ్లు, లేనివాళ్లు అనే రెండే రెండు కుటుంబాలు ప్రపంచంలో వున్నాయి.

-సెరివాంటిజ్

☆ రాజులు, వారి ఖడ్గాలు నైతికఖడ్గం ముందు దిగదుడుపే.

-గాంధీజీ

☆ దేశసంస్కృతికి, సంపదకూ మూలస్తంభం రైతే.

-వెబ్‌స్టర్

☆ ప్రజల జీవన సమస్యలతో సంబంధంలేని కళ నిరుపయోగం.

-నెహ్రూ

☆ వెలుగుతున్న దీపమే ఇతర దీపాలను వెలిగించగలదు. నేర్చుకున్నవారే ఇతరులకు నేర్పగలరు.

-టాగూర్

☆ కంట్లో పడిన నలుసును తీయడానికి ముల్లును ఉపయోగిస్తే కన్నుకే ముప్పు వస్తుంది. అలాగే హింసామార్గంతో దేన్నైనా సాధిస్తామనుకుంటే అది ఎదురు తిరుగుతుంది.

-థామ్సన్

☆ వివేకవంతుడెప్పుడూ నిన్నటికంటే, రేపటికంటే, నేడు తెలివిగా మసలుకుంటాడు.

-కోల్టన్

☆ అంతరాత్మ అనేది మానవునిలోని దైవత్వం.

-స్వీడెన్‌బర్గ్

☆ ఆప్త స్నేహితులను కాపాడుకోగల వ్యక్తి అదృష్టవంతుడు. ఎందుచేతననగా స్నేహమనేది భగవంతుడిచ్చిన వరాలలో ఒకటి.

-థామస్ హూగ్స్

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు

# సూపర్ హిట్ పై సమీక్షలు



ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన భాగవతుల సుబ్రహ్మణ్యం రచన 'సూపర్‌హిట్'పై మాకందిన ఉత్తమ సమీక్షలు...

## 'పరమ సినిమాటిక్ కథ'

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ఏప్రిల్ చతుర నవల 'సూపర్‌హిట్' రచయితే చెప్పినట్లు పరమసినిమాటిక్ కథ కాబట్టి సాధ్యాసాధ్యాలు, సహజాసహజాల ప్రశ్నే తలెత్తదు. మేధకు ఎటువంటి ఒత్తిడీ కలిగించని కాలక్షేప బటాణిగా మూడు గంటలు కులాసాగా గడిపించే తిరగేసిన సినిమాగా మాత్రం ఇది ఖచ్చితంగా సూపర్‌హిట్టే.

రచయిత ఇదివరకు చతురలో అచ్చయిన నవలలు సినిమాగా రూపుదాల్చిన వైనం గుర్తించి మరీ దీనిని రాశారనిపించింది. ఆ మేరకా ప్రయోజనం నెరవేరింది.

గతంలో చతురలోనే అచ్చయిన 'తెర' నవల సినిమాకి సంబంధించిన సాంకేతిక రంగాలన్నింటినీ విశదీకరిస్తే ఈ నవల ఒక సినిమా కథ, ఎలా వండి వడ్డించబడుతుందో వివరించింది. స్క్రిన్‌ప్లే షాట్ డివిజన్ అంటే ఏమిటో ఎలా ఉండాలో భావిరచయితలకి అవగాహననిచ్చినట్లయింది. చాలా క్లియర్‌కట్ ఐడియా ఇచ్చారు సుబ్రహ్మణ్యంగారు.

పోతే చివరలో సినిమా సీన్ ముగిసేక జనమేజయం నమీచిని కించపరుస్తూ మాట్లాడటం ఇతర రంగాల్లోకన్నా సినీరంగంలోనే ఒరిజినాలిటీని గుర్తించకపోవడం, అణచివేయడం చాలా సహజమని నిరూపించింది. అవకాశంకోసం వెంటబడే వాళ్ల క్రియేటివ్ బ్రెయిన్స్‌ను తమ స్వంతమైనవిగా ముద్రవేయించే జనమేజయాలు సినీరంగంలో కోకొల్లలు. నిర్మాత సత్తువనంతా చాలా నింపాదిగా పీల్చివేస్తూ, రెండు నెల్లుగా కథ చర్చ కొనసాగించినవాళ్ల తలల్లో కత అనేదుంటే కదా అంటాడు సదాశయం. కాని ఇది తెల్సి ఈ నవలలోలా వారిని కాదని కొత్తవారినా

హ్వానించే నిర్మాతలు మరి ఒక్కరో అరో అనే చెప్పాలి. అందుకేనేమో రచయిత సదాశయం పేరు నిర్మాతకిపెట్టి సూచనప్రాయంగా ఆకాంక్షను వ్యక్తం చేశారు.

స్త్రీ గాంభీర్య చిత్రణ బాగుంది కాని తరుణ్ శీల ప్రతిష్టాపన కోసం అన్ని అమ్మాయికేస్‌లు చూపనక్కర్లేదేమో.

**-పి.లక్ష్మిచూడామణి**
కరకంబాడి

## 'నవలాస్త్రం'

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**కొ**న్ని నెలలుగా పాఠకుల్లో ఉత్కంఠను, భావావేశాలను ముప్పిరిగొలిపే సీరియస్ రచనలనే అందిస్తూ వస్తున్న **చతుర ధోరణి** ఒక్కసారిగా మారి పాఠకహృదిలో హాస్యపు జల్లులు కురిపించ తలపెట్టడం ఒక మంచి మార్పు. అయితే కామెడీ నవలగా చెప్పబడిన సూపర్‌హిట్ రచన ఆశించిన రీతిలో ఆకట్టుకోలేకపోయింది. అందుకు ప్రధాన కారణం ఈ రచనయొక్క ఇతివృత్తమే! గతంలో సినిమాల మీద సెటైర్స్ కొన్ని వెలుగు చూశాయి. ఈ నవల వాటికి దగ్గరగానే వుందని చెప్పవచ్చు.

రచయిత సిన్సియర్‌గా మంచి హాస్యాన్ని సృష్టించాలనుకుంటే సమాజంలోని ప్రతి సంఘటనలోనూ హ్యూమర్ ఇమిడి ఉంటుంది. దానిని నేర్పుగా పిండి పాఠకులకు నవ్వులవిందును నివేదించవచ్చు. కాని రచయిత కలాన్ని కష్టపెట్టకుండానే నిడివికి సరిపడా ఈ నవలను సాగదీసారనిపిస్తుంది.

నవలలో నమీచి చెప్పిన కథ కామెడీ సినిమాకి సంబంధించినది కనుక దానిలోని లోటుపాట్లను అంతగా సమీక్షించనవసరం లేదుగానీ అసలు రచన ప్రారంభం నుండే చాలా అసహజంగా అనిపించింది. స్టార్ హొటల్స్‌లో నెలల తరబడి మందుకొడుతూ మందగా ఆలోచించే కాలం చెల్లి చాలా ఏళ్లవుతోంది. ఇప్పటి పరిస్థితుల్లో చాలా మంది సినీ ప్రబుద్ధులు రెండు గంటల సినిమాకోసం రెండు రోజుల్లో కథను తయారు (కాపీ) చేసుకోగల (దు)స్థితికి వచ్చేసారు. కనుక ఈ స్పీడ్ యుగంలో మూడు నెలలు గడుస్తున్నా కథ మాత్రం అంగుళం కదల్లేదనడం నమ్మశక్యంగాలేదు.

అలాగే పిలవని పేరంటంలా స్టోరీ సిట్టింగ్‌లోనికి అడుగుపెట్టిన నమీచి ఒక సందర్భంలో తనను తాను చెప్పే కథలోని రంజనిగా చెప్పుకుంది. రంజని నమీచిగా ఎందుకు మారాల్సివచ్చిందో ఆమె జనమేజయం బృందానికి చెప్పాల్సిన అవసరం లేకపోయినా, రచయిత పాఠకులకి మాత్రం చెప్పాల్సిన ఆవశ్యకత కనిపిస్తోంది. ఒకవేళ నమీచి చెప్పినది కల్పితం అనుకుంటే మరి ముగింపు ముందు దర్శనమిచ్చిన ప్రభుదాస్ మాటేమిటన్న ప్రశ్న ఉదయిస్తుంది.

చివర్లో నమీచి, సదాశయంలద్వారా జనమేజయ బృందాన్ని దద్దమ్మలుగా చెప్పించి వారిని టాలెంట్‌లెస్ ఫెలోస్‌గా చిత్రీకరించిన రచయిత... ప్రారంభంలో మాత్రం హిట్ ఫార్ములాగల మాస్‌కథలు అల్లించడంలో జనమేజయంది అందె వేసిన చెయ్యి అని, అతనితో కూడిన బృందం ప్రతిభా పాటవాలు గలదని చెప్పడంలోని ఔచిత్యం ఏమిటో అర్థంకాలేదు. ఒక సందర్భంలో రచయిత తెలుగు సినిమా కథల్లేక కదలలేకపోతోంది అన్న సినీ ప్రముఖుని వ్యాఖ్యని ప్రస్తావించారు. కాని ఇప్పటి ట్రెండ్‌ని బట్టి చూస్తే తెలుగు సినిమా పరభాషా బాణీల కోసం అర్రులుజాచి పరుగులు పెడుతూ బొక్కబోర్లా పడి కాళ్లు విరగ్గొట్టుకుంటోందనిపిస్తుంది.

నమీచి చెప్పిన కథలోని వివిధ పాత్రలు కొంతవరకూ కవ్వింపుతోనూ, నవ్వింపుతోను పాఠకులను ఊరడించాయి. అలాగే సినీ పరిశ్రమలో నేటి నిర్మాతల దౌర్భాగ్యపు స్థితిని మాత్రం వీలైనంతగా వివరించగలిగారు

రచయిత. నవలను ఆద్యంతం హాస్య ప్రధానంగా నడిపించాలన్న ప్రయత్నం అంతగా సఫలం కాకపోయినా అక్కడక్కడా సాంఘిక పరమైన కొన్ని మంచి సీరియస్ విషయాలను సైతం ఆయా పాత్రలద్వారా చెప్పించిన రచయిత యొక్క సహజమైన ప్రతిభ అంతర్లీనంగా గుబాళించింది. ఒక్క మాటలో చెప్పాలంటే... మురుగుతున్న సినీ పరిశ్రమపై అవగాహనా రాహిత్యంతో నవలాస్త్రాన్ని సంధించిన రచయితపై ఆ బురద పడిందని చెప్పవచ్చు.

-ఎన్.వి.వి.సత్యనారాయణ
నేలటూరు

## 'మాస్ మసాలా'

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ఏప్రిల్ నెల చతుర నవల సూపర్‌హిట్ నిజంగా మాస్ మసాలా సూపర్‌హిట్టే. నవల ఆద్యంతం ఎంతో ఆసక్తిదాయకంగా మలచడంలో రచయిత సఫలీకృతులైనారు. నేటి సమాజంలో ముఖ్యంగా హైక్లాస్ పీపుల్ నైతిక దిగజారుడుతనానికి నిలువుటద్దం ఈ నవల.

ప్రభుదాస్ తరుణ్ వంటి భర్తలు సమాజంలో మనకు చాలామంది కనిపిస్తారు. ఇలాంటి భర్తలు చేసే రాసకేళీ విలాసాల్లో సమిధలుగా మిగిలే రంజని, దీపిక వంటి భార్యలూ కనిపిస్తారు. అయితే దీపిక భర్త తరుణ్ అంతలా బరితెగించినా ఒక అందమైన కవరుతో అతని కళ్లు తెరిపించి మన భారతీయ స్త్రీ సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని చాటి చెప్పింది. పల్లవిలో ఆకతాయితనాన్ని, చరణ్‌లో సంస్కారాన్ని హృద్యంగా చిత్రించి నవలని మనోహరంగా పండించారు రచయిత.

కానీ హీరోయిన్ దీపిక ప్రత్యక్షంగా రంగ ప్రవేశం చేసేవరకు కథలో నాటకీయత, శిల్పం అత్యంత బలంగా రక్తికట్టించిన రచయిత తరువాత తేలిపోవడం, హీరో బలహీనతల్ని స్పష్టంగా చెప్పడానికి అనాసక్తమైన సౌందర్య పాత్రని సృష్టించడం విచారకరం. ఎంత ప్రాణ స్నేహితురాలైనా నీ భర్తతో నేనొక రాత్రి గడిపాను అన్న విధంగా సౌందర్యచేత చెప్పించటం అసహజంగా ఉంది. హెూటల్‌లో రంజని తరుణ్‌తో మాట్లాడినప్పుడు ఆమెలోని రచయిత విజృంభించాడు అనడం అప్పటిదాక ఆమె ఎవరో తెలియని పాఠకునికి అసందర్భంగా అన్పిస్తుంది.

రచయిత్రి తనే కథకురాలు, సమీక్షకురాలు అయిన వైనం మాత్రం ఆకట్టుకుంది. అయితే దగాపడ్డ స్త్రీగా, రచయిత్రిగా గుర్తింపబడ్డ రంజనికి కీలకపాత్ర లేకపోవడం, తన దిగజారుడు తనానికి కారణమైన ప్రభుదాస్ రంగ ప్రవేశంతో కథ సుఖాంతం చేయడం ఆశ్చర్యాన్ని కలిగించింది. మొత్తానికి నవల ఒక మాంచి మాస్ మసాల సినీమాను కళ్లకు కట్టినట్టు చూపి మంత్రముగ్ధుల్ని చేసింది.

-శోభదేముడు
మలకపాలం

## 'సినిమా చూపిన నవల'

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ఏదైనా ఒక సినిమా విజయవంతమవ్వాలంటే బలమైన కథ చాలా అవసరం అన్న విషయాన్ని కాదనలేం. తీవ్రమైన కథల కొరతతో కొట్టుమిట్టాడుతోన్న సినీరంగంలో తను తీయబోయే సరికొత్త సినిమాకి విజయవంతమైన కథకోసం వెతుక్కుంటున్న ఓ నిర్మాతకు ఎదురైన అనుభవాలూ, ఒక డాన్సర్ చెప్పిన కథ నచ్చి చివరికి ఆమెనే డైరెక్టర్‌గా చేసుకొని కొత్త సినిమాని ప్రారంభించడం ఇతివృత్తంగా చక్కని కామెడీతో సాగిన కాలక్షేపానికి పనికొచ్చే నవల భాగవతుల సుబ్రహ్మణ్యంగారి సూపర్ హిట్.

బాక్సాఫీస్ ఫార్ములాలతో భారీ తారాగణంతో అంగాంగ విన్యాసంతో సినిమాలు తీసి చేతులు కాల్చుకొనే నిర్మాతలకి బలమైన కథ అవసరాన్ని వ్యంగ్యంగా, పరోక్షంగా తెలియజెప్పడమే ఈ నవల ప్రధాన ఉద్దేశ్యమనిపించింది.

'జనమేజయం' లాంటి డైరెక్టర్లు స్టోరీ డిస్కషన్ పేరుతో రోజుల తరబడి స్టార్ హోటల్స్‌లో మకాంవేసి, బాటిల్ తర్వాత బాటిల్ కాళీ చెయ్యడంవలన మాత్రమే కథలు పుట్టుకొస్తాయనుకోవడం అపోహ అని తేల్చిచెప్పి నమీచి అందించిన కథ ఆధారంగా సినిమాతీస్తే సూపర్‌హిట్ అవుతుందో లేదోచెప్పలేంగానీ సినిమా కథనే ఆధారంగా చేసుకొని, సినిమాకోసమే రాయబడ్డ ఈ నవల ఒక తెలుగు సినిమా చూస్తున్న అనుభూతిని కలిగిస్తూ కాస్సేపు కాలక్షేపంగా మనస్సుని ఆహ్లాదపరచింది.

చదువుతోన్న ప్రతీ సన్నివేశం ఇంతకు ముందే ఏదో ఒక సినిమాలో చూసినట్లనిపిస్తే అది మన సినిమాలు రూపొందుతోన్న తీరునే ప్రతిబింబిస్తుంది.

ఏదో పెద్ద సందేశాన్నో అభ్యుదయాన్నో ఈ నవల ద్వారా ఎవరూ ఆశించకుండా ముందే చెప్పేశారు కాలక్షేపం కల్గించడమే దీని ప్రధాన ఉద్దేశ్యం అని.

-టి.వరలక్ష్మి
విశాఖపట్నం

## 'సూపర్ డూపర్ హిట్'

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'సూపర్‌హిట్' కేవలం పేరుతోనేగాక నిజంగా నవలకూడా సూపర్ డూపర్‌హిట్టై కూర్చుంది. నేటి సినిమాల స్వరూప స్వభావాలను కళ్లకు కట్టినట్లు చూపింది. కథ చదువుతూన్నట్లు కాక సినిమా చూస్తున్నట్లే అన్పించింది. పది రూపాయల ఖర్చుతో రెండున్నర గంటల సమయంతో ఆ సినిమా భవితవ్యాన్ని తేల్చేసే ప్రేక్షకుడికి తెలియని ఎన్నో అంశాలను ఈ నవలలో పొందుపరిచారు. తెరపైన చూపే తళుకుబెళుకుల మాటున ఎందరి శ్రమ, పట్టుదల, దీక్ష, మానసిక ఒత్తిడి, తర్జన భర్జనలు దాగివున్నాయో తెలుస్తుంది.

నమీచి, కథను నడిపించే తీరులో రచయితే కనిపించారు. ఆమె కథను వినిపించే సమయంలో నిర్మాత, దర్శకుడు, ఇతరులు అడ్డు తగిలినా వారిని తన వాక్చాతుర్యంతో ఓర్పుతో, నేర్పుతో ఒప్పించటం చక్కగా ఉంది. కథతోపాటు కథనంలో కూడా నవ్యత ఉంటే ఆ సినిమా సూపర్‌హిట్టే. తుపాకులు, బాంబులు, వీరోచితఫైట్లు లాంటి మూస క్లైమాక్స్‌కి స్వస్తి చెప్పి రక్తపాతంలేని సరికొత్త పద్ధతికి నాంది పలికారు. నవలలోని పాత్రలన్నీ నిజజీవితంలో మనకు పరిచితమైన పాత్రలే. స్త్రీలోలుడైన భర్తని, భార్య సరిదిద్దే పద్ధతి, తాను అనుభవించిన మానసిక క్షోభ అతనూ అనుభవించేలా పరిస్థితులను కల్పించడం, మొదలైన సంఘటనలన్నీ శీలం స్త్రీకే కాదు పురుషుడికీ ముఖ్యమన్న నగ్న సత్యాన్ని ఋజువు చేశాయి.

చివరలో నిర్మాత తన చిత్రానికి దర్శకురాలిగా నమీచినే నియమించటం ఆశ్చర్యార్థకమైన చక్కటి మలుపు. సినిమాలు ప్రేక్షకులను ఊహాలోకాలలో విహరింపజేసినా అందులోని పాత్రలు మాత్రం చుట్టూ సమాజంలో నుంచి తీసుకోబడేవే అన్న విషయం ఈ నవల చదివిన తరువాత ఒప్పుకోక తప్పదు.

-బి.శ్రీదేవి
తిరుపతి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 470434; Vijayawada 476685; Visakhapatnam 52211; Tirupati 5291; Anantpur 22977; Rajahmundry 71390; Karimnagar 83216; Suryapet 20538; Guntur 353942.

